శ్రీమతే రామానుజాయనమః
అస్మద్గురుభ్యోనమః

# పీఠిక.

---

భగవద్భాగవతాచార్య విశేషకటాక్ష ప్రేరణా, "శ్రీ రామానుజ ప్రభావకల్పకము" ఉత్తరభాగము, ముప్పదియైదు గుచ్ఛములు సత్వరముగ రచించునటు ప్రేరేపించెను. అయినను గ్రంథము నచ్ఛొత్తించుటకు నా ద్రవ్యాభావ పరిస్థితి, ఆరోగ్యాభావ పరిస్థితి, కర్మానుగుణముగ నట్టిదగిలి, యాలశ్యముగాక తప్పినదికాదు. పూర్వభాగము శ్రద్ధాభక్తులతో జదివిన పాఠకమహాశయులు ఉత్తరభాగము జదువ కుతూహలురై గ్రంథమును నచ్ఛొత్తింప త్రీవ్రపడుచుండిరి. కాని నా యసహాయపరిస్థితి కెంతయో లోలోన పరితపించుచుండవలసినటులయ్యెను. తుదకు శ్రీ శ్రియఃపతుల కటాక్షమొటులనో యకించనుడగు నాపైప్రసరించి గ్రంథము నచ్ఛొత్తింపబూన, "శ్రీ రామానుజ ప్రభావము" వామనావతారముగ ప్రవేసించి త్రివిక్రమావతారమువలె దాదాపు నాలుగు నూర్ల డెబ్బదిపుటల నాక్రమించెను.

దేహబలమునకుతోడు జ్ఞానబలమొసంగి, తుదకు గదాధరుడై శ్రీ బలిచక్రవర్తిని గాచిన యా త్రివిక్రమావ

తారకమూర్తి యీనాడు నాబోటి యాశ్రితుల బోషింపక [illegible] కష్టదైన్యము. కర్తవ్య మూహింపజాలక యాందో ళనకు లోనైన నా చంచలమనస్సునకు కొంత స్థైర్యము నొసంగెను.

శ్రీ దేశబంధు ముద్రణాలయాధికారుల హృదయాంతర్వర్తియై యుదారాశయముతో కార్యము కొనసాగింప యూపరమదయామయుడగు పరమేశ్వరుడే ప్రేరేపించెను. కరుణామయుడగు భగవంతుని కటాక్షముచే కైంకర్యము ముగిసినది. ముద్రణాలయమునకు నేనింకను చెల్లించవలసిన ద్రవ్యము పాఠకమహాశయుల ఔదార్యముపై నాధారపడి యున్నది. కావున అస్థిరదేహ భోగములకై యను దినము మనము వ్యర్థముగ వినియోగించుచుండు ద్రవ్యములో యీ గ్రంథముల మూల్యమే పాటిదని యించుక వివేక దృష్టిచే విమర్శించుకొని గ్రంథము రెండుభాగములు తెప్పించుకొని చదివి యందలి యాధ్యాత్మతత్వ మెద్దియైన నగపడిన గ్రహించి భగవద్విశేషానుగ్రహము లభింప పాఠకమహాశయుల బ్రార్థించుచున్నవాడ.

ఇట్లు విన్నవించు,
బుధజనవిధేయుడు,
బుక్కపట్టణాం నరశింహాచార్యులు.

తాడిపత్రి.
27-6-1951

శ్రీమతేరామానుజాయనమః,

# ఉపోద్ఘాతము.



శా. "సత్యజ్ఞాన సుఖస్వరూపకలనా, సర్వాత్మసంసేవనా
మర్త్యామర్త్య సుసేవ్య పాదకమలా, మత్పాపతూలానలా
కృత్యాకృత్య వివేకిలోకవినుతా కృష్ణానుభూతిప్రీతా,
నిత్యానందనిదాన సత్వనిరతా సత్కీర్తిదా రామానుజా."

శ్రీమాన్ బుక్కపట్టణం నరసింహాచార్యుల వారు, "శ్రీ రామానుజ పరిభాషకల్పకము" పూర్వభాగము రచించి మూడుసంవత్సరముల క్రిందట నాకందజేసిరి. నేను గ్రంథమును కొంతవఱకు చదివితినిగాని పర్యాలోచన గావింప నైతిని. ఈనాడుత్తర భాగము సిద్ధమైనదని, దానికొక యుపోద్ఘాతము వ్రాయుమని శ్రీ ఆచార్యపురుషులగు గ్రంథకర్తగారు కోర నాకిది సాధ్యమాయని వెనుదీయుతరి అంతర్వాణి "శ్రీగురుకార్యము అవశ్యమ' నెడు ఆజ్ఞవిదితమాయెను. పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట" యనెడి శ్రీపోతన వాక్కులు స్మరించి "దాసోహం "అని శ్రీవారి నారాధించి ఈవాక్యముల వ్రాసితిని. అల్పజ్ఞుడనగు నాకంటె రసపిపాసువులగు కవులు పండితులు విమర్శకులునగు మహాశ

[illegible]యులు భక్తిసారులునగువారికి శ్రీరామానుజులవారి పవిత్ర
జీవితము [illegible]నపరిపూర్ణతను, కరుణాభక్తిప్రేమలయొక్క
సహజవిస్ఫురణము నంది యధికతరముగా గోచరించును.

దాదాపు వెయ్యి సంవత్సరముల క్రిందట, ఉత్తర హిందూస్థానము, యవనులపాలై ప్రాచీన సంప్రదాయముల మరుగున నుంచి ప్రజలు తమ్మేలు ప్రభువే దేవుడని ప్రాణముల జేతిలో బెట్టుకొని జీవితములు గడుపుచుండిరి. దేవాలయములు శిథిలమాయెను. గ్రంథములు గంగపాలాయెను. దక్షిణమున పాలెగాండ్రు చిన్న చిన్న సంస్థానముల కధిపతులై బలమేధర్మమని పాలించుచుండిరి. మతము మతములలోనో, దేవాలయములయందో, దాగియుండెడిది అట్టి పరిస్థితులలో క్రీ. శ. 1017 సంవత్సరమున శ్రీ పెరుంబూదూరున శ్రీరామానుజులవారు సద్బ్రాహ్మణ దంపతులకు పుత్రులై జన్మించిరి. శ్రీఆదినారాయణమూర్తి యనుజ్ఞచే భారతావని దుఃఖము దొలగింప శ్రీఆదిశేషమూర్తి ఈ రామానుజుల యవతారము దాల్చిరని సంప్రదాయాగతవాక్యము వీరికి సహాధ్యాయుడు శ్రీవాసుదేవుని వాహనమైన శ్రీగరుత్మంతుడు, గోవిందమిశ్రులను నామమున సమీపగ్రామమున నవతరించెను. వీరిరువురు గురుముఖమున సకల శాస్త్రములు పఠించి సన్యాసాశ్రమము స్వీకరించిరి. శ్రీ — —

వారు విద్యార్థిదశలోనే రాకుమారికిబట్టిన బ్రహ్మరాక్షసిని వదలించి రాజపుత్రికిని రాక్షసికిని శాపవిమోచనము గావించిరి. శబరివంటి ముక్తయాదవప్రకాశులకు శ్రీనివాసుల సాయుజ్యము లభింపజేసిరి. వేదార్థసంగ్రహము వేదాంతదీపము, భగవద్గీతాభాష్యము, ఇత్యాది వైష్ణవ గ్రంథములెన్నియో రచించిరి. శ్రీకాంచీపురమునను, శ్రీరంగమునను వీరు మహాత్ములుగానుండి యెందఱనో భక్తిమార్గమునకు త్రిప్పిరి. కాశ్మీరదేశహృదయభాగమగు శ్రీనగరమునకు కాలినడకన శ్రీ కూరేశాది శిష్యులతో నేగి శ్రీశారదా గ్రంథాలయమున యెన్నియో శతాబ్దములనాడు తాటియాకులలో వ్రాయబడియుండిన శ్రీ బోధాయనవృత్తియను బ్రహ్మసూత్రముల వ్యాఖ్యానము శ్రీశారదాగ్రంథాలయమున నుండ బరిశీలించి, మానవకోటి నుజ్జీవింప నమూల్యమగు బ్రహ్మసూత్రసారమును రచించిరి. దీనినే శ్రీభాష్యమందురు భగవదనుగ్రహములభించి సాయుజ్యానందము నీజన్మమందే లభింపవలెనన్న భగవచ్చరణారవింద శరణాగతికన్నను వేఱొండు సులభోపాయము లేదని లోకమునకుచాటు గద్యత్రయము హృద్యముగ రచించిరి.

భారతదేశమునగల సుప్రసిద్ధ పుణ్యక్షేత్రములందు జరుగుచుండెడి యక్రమములు, అనాచారములు శ్రీరామానుజులవారు గమనించి శిష్యవర్గముతో నాసేతు హిమాచలము

వారు సంచరించి అనంతశయనము, పండరీపురము, మధుర, ద్వారక, అయోధ్య, ప్రయాగ, హరిద్వారము, బదరీనారాయణము, శ్రీరంగము, వారణాశి, శ్రీకూర్మము, సింహాచలం, అహోబలము, తిరుపతి ఘటికాచలము, తిరువళ్లూరు, కాంచీపురము మున్నగు క్షేత్రములదర్శించి యాయా ప్రదేశములందెందరికో భక్తి ప్రపత్తి మార్గముల నుపదేశించి సన్మార్గవర్తులై యుజ్జీవించునటుల్లొనర్చిరి. నిమ్నజాతులవారి నుద్ధరించుటకై వీరు ప్రత్యేకమగు యేర్పాటులు కొన్నిగావించి సాయుజ్యానందము వారికిగూడా లభింపజేసిరి. గ్రంధకర్త ఈపుస్తకమున చదువరులను తన్మయులజేసి శ్రీరామానుజుల నాటికాలమున మనముగూడ వారివెంట నీక్షేత్రములదర్శించితిమేమోయనెడు పూర్వజన్మజ్ఞానమంకురింప జేసినారు.

శ్రీరామానుజులవారు శ్రీ ఆదిశేషావతారమని తెలిసియు, కొందఱసూయచే వారినంతమొందింపజూచిరి. గురువులగు శ్రీయాదవ ప్రకాశకులే ద్వేషబుద్ధితో శిష్యులగు శ్రీవారి గంగపాలుజేయ యత్నింప శ్రీ లక్ష్మీనారాయణులే యెరుకు దంపతుల వేషమున వారిని రక్షించిరి. మరియొకపర్యాయము దుర్మార్గులు కొందరు దేవాలయార్చకుని లోబఱచుకొని తీర్థములో విషముగలిపి శ్రీరామానుజులవారి కిప్పించిరి. సకలభువనభారము వహించు శ్రీయతిపతి కరుణామృతమును

నిరంతరము కైంకర్య వ్యాజమున ననుభవించుచుండు ఆదిశేష
మూర్తికి ప్రాకృత విషమమృతముగదా మాయను! వారు
శాంతహృదయులై చిరునగవుతో నాక్షీరము, విషమయమని
తెలిసియు స్వీకరించి నిర్వికారులైయుండిరి. శిష్యత్వమువహిం
చినవారే పశ్చాత్తప్తులై ప్రార్థింప వారు వారిని క్షమించిరి.

మరియొకపర్యాయము మేలునాటి సీమనుండు తొండ
నూరను గ్రామమున శ్రీలక్ష్మీ నృసింహ దేవాలయమున శ్రీ
రామానుజులవారి నెట్లులైనను పరాభవింపవలెనని పట్టు
బట్టి ధిక్కరింపవచ్చిన ప్రతిపక్షులకు, ముఖమండపమున నిజ
స్వరూపమగు శ్రీ ఆదిశేషస్వరూపమును,

సీ॥ మహనీయ నిజఫణామండలమణిదీప్తి గగనభాగం
బెల్లగప్పి మెరయ
వేయిమోముల రెండువేల జిహ్వలబొల్చు ఫూత్కార వా
తాళి భువనమలయ
పాదాదిమూర్ధాంత బహుభూషణ ప్రభల్ సకల
మోహధ్వాంత శాంతిసలుప
కైలాసగిరిచుట్టు గ్రమ్ము శాలాభ్రముగతి నీలచేలము
కటివెలుంగ
తే॥ బ్రహ్మరుద్రాది దేవతల్ ప్రస్తుతింప దనరు శేష
స్వరూపము

చూచి భయభ్రాంతులై దాసోహమను వారి నందఱి క్షమించి రక్షించిరి. ఈర్ష్యాసూయలచే పతితులై యుండిన శిష్యులను, పరమభక్తుడగు ధనుర్దాసు నాదర్శముగ గొని శ్రీవారు రక్షించిరి.

శ్రీ రామానుజులవారికి జాతిమత వర్ణభేదము లందా చిత్యమాత్రమైయులేని యభినివేశములేదు. అందఱియెడ సమహితత్వసహితప్రేమ, ఆదరణగలవారు. పరమభాగవతులగు శ్రీ కాంచీపూర్ణులు శూద్రులైనను వారియెడ శ్రీవారికి గౌరవము మెండు. పంచమవర్ణమునకు జేరిన భాగవతోత్తముడు రాచపుండుచే గాసినొంది మరణించుతరి ప్రేమార్ద్రహృదయులగు వీరిగురువులు శ్రీ పరాంకుశదాసులును వీరును చూపిన యాదరణ వర్ణనాతీతము. సర్వమానవ సోదరత్వమును వీరు మనోవాక్కాయకర్మముల సాధించిరి.

ఇట్టి మహనీయుని దివ్యచరిత్ర నాంధ్రవాఙ్మయమున నింతవఱకు గద్యరూపమున లేనందున శ్రీ రామానుజభక్తులకెల్ల గ్రంథకర్త గారు అపూర్వమైన సేవజేసినవారైరి. శైలి సులభముగాను, సరళముగాను నున్నది. స్వధర్మమనుపేర నాలుగు వర్ణములవారు యీనాడుచేయు నవకతవకల నచ్చటచ్చట హాస్యఘట్టములు కల్పించి మంచిపదునుతో నున్న

కత్తిత్రోవలె సంఘములోని చెడుగును సున్నితముగ తొలగింప బూనిరి. సంఘమున వ్యక్తి కర్తవ్యాకర్తవ్యముల గమనించి సమయాసమయములను గనిపెట్టి సందర్భానుసారముగ నెట్లు నడుచుకొనిన, వారినుండి యుద్భవించు ఆనందతరంగము లితరుల దుఃఖదూరులఁ జేయునో అట్టి భాగములు చదువరులు గమనించెదరుగాక.

శ్రీరామానుజ మతముపేర నచ్చటచ్చట గనుపించు మద్యమాంససేవనము యద్విధముగనో తామలవరచు కొన్న జిహ్వాచపలులగు కొందఱు కల్పించిన యాభాసము. ప్రాణికోటియందత్యంతదయాసమన్వితుడును, పవిత్రజీవియు నగు శ్రీ రామానుజులవారెక్కడ మద్యమాంససేవన మెక్కడ? ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయకోశముల వికసనమే యాధారముగాగల సాయుజ్యానందము ప్రాణిహింసకులగు నిట్టి వారికి జన్మశతములనైన కలుగునా?

శ్రీమాన్ నరసింహాచార్యులవారు రాయలసీమలోని తాడిపత్రిపురవాసులు, గొప్పవిష్ణుభక్తులు. ఎల్లప్పుడును, శిష్యవర్గమునకు తత్వబోధ గావించి పూజింపబడుచుండువారు, సంస్కృతాంధ్ర భాషలందు యెక్కువ పరిచయము, అభిమానముగలవారు. శ్రీ రామానుజులవారిపై వీరికిగల భక్తి

యుపారము. పూర్వాచార్యానుగ్రహామువలన వీరికి జన్మ
సిద్ధముగ గలిగిన దివ్యశక్తియగు నంతర్వాణి ప్రభావమే
ఆదర్శపూర్వకమగు ఈగ్రంథమునకు మూలము. భక్తిరస
పూరిత గ్రంథముల నింకను వీరు తమ యాంతర్వాణి ప్రేరణచే
నెన్నియో రచించి ముముక్షువుల నుజ్జీవింపజేయ ప్రోత్స
హింప శ్రీ ఆదిత్రిమూర్తుల (శ్రీ ఆదినారాయణ, శ్రీ ఆదిలక్ష్మీ
దేవి, శ్రీ ఆదిశేషులు) ప్రార్థించుచున్నాడను.

బుధజనవిధేయుడు,

అడపాల కుప్పస్వామి,
B. A. F. T. S.

# అభిప్రాయము.



శ్రీమాన్ బుక్కపట్టం నరసింహాచార్యుల వారిచే రచింపబడిన శ్రీ రామానుజ ప్రభావ కల్పకమును గురించి నా యభిప్రాయమును వారు వ్రాయుమని కోరుట సూర్యుడు స్వప్రకాశోద్ఘాటనమునకు మిణుగురుబురువు నాశ్రయించినట్లున్నది. నాయల్పత్వము నాకు దెలిసియేయున్నను, దాదాపు ముప్పది సంవత్సరములనుండి విశిష్టాద్వైతమత వారాశి నిరంతరమథనము గావించినట్టియు బహుసంవత్సరములనుండి నన్నుచక్కగా యెరిగినట్టియు శ్రీ ఆచార్యులవారు నన్నిట్టికోరిక గోరుటలో నాకేదో శుభము కలదను విశ్వాసమునను, పెద్దలచే నడుగబడియు పలుమారందుకు నే జాలననుటలో స్వరూపానురూపగర్వభావమిమిడియుండునని వారూహించుట కవకాశము కలుగుననియు నిందుకు బూనుకొంటిని. వ్రాయబడినది యాచార్యత్రియము నందలి శ్రీరామానుజాచార్యులవారిపునీతచరిత్ర. దాదాపు వందసంవత్సరములు పరోజ్జీవన కార్యములందు నిశ్చలమగు తగులుతో భగవత్కైంకర్యము సాగించిన శ్రీయతిరాజులవారి నిండుజీవితమున విషయమున

కేమికొఱత? విషయవైలక్షణ్యమున కేమికొదువ? విషయమున కనుగుణమగు కాలక్షేపధోరణిలో, చిన్నతనమున వారికుండిన నవలారచనయందలి పోకడల మఱచిపోక, వారు పొందిన యానందము నితరులకుగూడ చూఱబెట్టు తలంపున విశ్వాసోద్దీపితమగు శ్రద్ధావేశములతో రచింపబడిన యీ గ్రంథము సర్వమత ముముక్షుజనాదరణీయము కాకపోదు. పరమతనింద చేయక యాత్మీయ మతోత్కర్షను జాటుచు కేవల భగవన్ముఖోల్లాసమునకై యిట్టి రచన సరళ సులభశైలిలో సాగించి యాంధ్రమహాజనుల కెంతయో యుపకృతిగావించి శ్రీఆచార్యుల వారు చరితార్థులైరని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను.

తాడిపత్రి
6—3—51

ఇట్లు,
కలచవీడు వెంకటరమణాచార్యుడు

# — విషయసూచిక. —

గుచ్ఛములసంఖ్య ... పుట

# శుద్ధాశుద్ధపత్రికా.

## ప్రథమ సంపుటము.

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| 4 | 3 | మతమునిచ్చుటికి | మతమిచ్చుటికి |
| 7 | 15 | గృహీతమయి | గృహీతమై |
| 12 | 21 | ఇటులా | ఇటుల |
| 14 | 1 | శాస్త్రకాఋ | శాస్త్రకారు |
| 15 | 15 | మున్నను | మున్నది |
| 22 | 6 | జ్ఞప్తిపస్థితా | జ్ఞప్తిరవస్థితా |
| | 21 | చ్ఛేత్ర | ఛేత్తు |
| 31 | 18 | నాకశగు | శాకరగు |
| 32 | 10 | బోధివ | బోధింప |
| 33 | 3 | నిదివఱకె | శ్రీవారికిదివఱకె |
| ” | 4 | చెప్పిశంపు | చెప్పనంపు |
| ” | 8 | నుటుండ | మటుండ |
| ” | 16 | కైంకర్యము | కైంకర్యముగ |
| ” | 19 | నెఱవేర | నెఱవేరు |
| 41 | 10 | లుప్పతిల్లి | లుప్పతిల్ల |
| 43 | 2 | లేదని | లేదేయని |

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| 45 | 5 | యియ్య్వా | యివ్వా |
| 47 | 8 | కొరత | కొఱత |
| 48 | 14 | (వంటి) | (వంట) |
| 50 | 13 | పోయిత్రో | పోయివిత్రో |
| 53 | 6 | పశ్చాత్తాపము ల | పశ్చాత్తాపము |
| 54 | 15 | దాను | దాసు |
| 58 | 13 | సమేతులను | సమేతులగు |
| 60 | 20 | శ్రీకాంచీపూర్ణులకు | శ్రీవారు శ్రీకాంచీ పూర్ణులకు |
| 64 | 5 | స్వామి | స్వామీ! |
| 66 | 5,6 | నాచరిత్రము | నాదుచరితము |
| 69 | 14 | హృద్ధతా | హృద్గతా |
| „ | 15 | ప్రపస్న | ప్రపన్న |
| 70 | 12 | పరిశ్రమ | పక్షశ్రమ |
| 71 | 6 | సమృద్ధి | సమృద్ధిగ |
| 72 | 19 | భగవద్రుణకార్యములో | భగవద్గుణాలో |
| | 20 | ప్రాకృతిక | ప్రాకృత |
| 74 | 10 | పితామహుడను | పితామహుడగు |
| 75 | 12 | లభ్పించి | లభ్యించి |

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| 84 | 14 | సేవించుచు | దర్శించుచు |
| | 16 | కడపట్టిణమిల్లి | కడ నేమనము గొని |
| | 16 | పూర్వ్వుల | పూర్ష్ణుల |
| 85 | 21 | పదాయను | పదాఅను |
| 86 | 17 | శరీర | శరీరి శరీర |
| | 19 | శరీర | శరీరి |
| 87 | 1 | కాల | కాల్య |
| 91 | 1 | క్రిందనోక | అందోక |
| 93 | 21 | భర్త | భర్తు |
| 100 | 1 | ఫలము | ఫలములు |
| 100 | 9 | కర్మపృథ్వి | కర్మభూమి |
| 101 | 5 | నెలకొనినది | నెలకొల్పిరి |
| 111 | 1 | మనగా | మవగా |
| „ | 11 | చాలునని | చాలునని |
| | | యభిప్రాయమని | యత్రీందులతో నని |
| 117 | 4 | గదా | గదా? |
| | 18 | ఏడువారములలో | ఏడుదినములలో |
| 119 | 1,2 | ఆమానసపుత్రుని గురవు | ఆమానసగురువు |
| 122 | 18 | మీరందఱి | మీరందఱీ |

| పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|
| 2 | జీమూః | భౌమాః |
| 3 | త్యన్వాహం | త్వన్వాహం |
| 7 | దవ్యై | దవ్వై |
| 3 | తిరుమాలర్ | తిరుమాళ్ |
| 17 | శ్రీరామతీర్థశయనము | దర్భశయనము |
| 3 | తిరుక్కురయల్ | తిరుక్కురుఘూర్ |
| 10 | ఘూరం | ఘూర్ |
| 4 | శఠగోపాది | శఠగోప |
| 8 | ఉదయసరిగ | ఉదయసంగ |
| 5 | కృష్ణా | కృష్ణో |
| 5 | వృష్టి | వృష్ణి |
| 5 | చిరు | తిరు |
| 6 | వారుతరు | వారుతము |
| 4 | ఏకోటి | ఏకేటు |
| 10 | రాత్రోక్తి | రాత్రోక్త |
| 17 | మహారి | మరియు |
| 20 | గావ్రున | కావృన |
| 2 | కొరత | కొఱత |
| 8 | మునా | మున |
| 11 | వరణ్యాము | యరణ్యాము |

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| | 19 | మఃలను | మును |
| | 20 | బాలుడఃయంజలి | బాలుడంజలి |
| 146 | 8 | కొనుచుండ | కొనుచు |
| 148 | 1 | శీఘ్రుగా | శీఘ్రముగా |
| | 19 | నొందితిరి | నొందితివి |
| 149 | 4 | నెచ్చట | నెచ్చట |
| | 12 | గొల్పి | గొల్పు |
| | 18 | చేరువ్రనే | చేరువనే |
| 152 | 10 | నిజమెఱిగిన | ఇటులజరిగిన |
| 155 | 1 | స్ఫణిక | స్పృణిక |
| | 11 | మరియు | మఱింత |
| 156 | 6 | కూర్మ్మ | కూర్మ |
| 158 | 6 | పార్శ్వ | పార్శ్వ |
| 161 | 4 | శేషాంగ | శేషాంశ |
| 162 | 8 | పద్మ | సీ॥పద్మ |
| | 13 | వదలి | వరలి |
| | 15 | ఆంద్రి | ఆంధ్రి |
| | 21 | లేనిలదటి | లేనియెడల నందటి |
| 163 | 8 | కతిశిష్య | కతిపయశిష్య |
| 164 | 8 | సజ్ఞ | సంజ్ఞ |

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| 164 | 5 | చూచుటకు | చూచువఱకు |
| 165 | 3 | మార్జైచరించు | మార్గానరింప |
| 166 | 1 | యున్నతం | యుండ |
| 167 | 4 | సత్యా | సత్వ |
| 167 | 7 | కవ్రుల | కవ్వాల |
| 168 | 12 | వారికినెంత | వారికను |
| | 14 | వీరిని | వీరి |
| 169 | 11 | మంటి | మంట |
| | 20 | మహిమ | మహిషి |
| 170 | 16 | కర్మోహం | కర్మాహం |
| 172 | 18 | తంత్రువుల | తంతుల |
| 173 | 4 | బూనిన | బూని |
| | 15 | శేషాంశుడగు | శేషాంశజుడగు |
| 174 | 1 | గని | దిగి |
| 175 | 2 | లెలుంగు | తెలుంగు |
| 176 | 12 | మారుదిన | మరుదిన |
| | 16 | తామఱవక | లేమఱక |
| 178 | 11 | శౌన్య | శౌన |
| 182 | 10 | నెంచిక | నెంచక |
| 184 | 20 | యత్నించు | యత్నింతు |

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| 185 | 4 | కంటిని | కంటికి |
| | 6 | మూలవీరులు | మూలవరులు |
| 188 | 3 | కైంకర్యమే | కైంకర్యము |
| 189 | 19 | శ్రీశైవ | శైవ |
| 190 | 10 | కేలాటి | కీలాటి |
| 191 | 2 | కూరు | కురు |
| 191 | 11 | నానాటి | యూనాటి |
| | 13 | చేర | చేరినంబిగారిది |
| 192 | 7 | తిరుపరివట్టి | తిరుపరివట్టి |
| | 14 | తిరు | వీర |
| 194 | 13 | నియ్యో | నివ్వ |
| 195 | 2 | ఔదార్యను | ఔదార్యము |
| 197 | 14 | ప్రసవించి | ప్రసరించి |
| 202 | 2 | వశికిం | వడికి |
| 204 | 4.5 | శ్రీయొంబెరుమానాముల దర్శించి | శ్రీయొంబెరుమానారుల దర్శించి |
| | | దర్శించి యాంజలి | యంజలి |
| 213 | 1 | యూమె | యీమె |
| 215 | 21 | ఇదియే | ఈమె |
| 217 | 2 | శృపవోపి | శ్వపచోపి |

| పుట | పంక్తి | అశుద్ధం | శుద్ధం |
|---|---|---|---|
| | 4 | శ్వపబిందుమః | శ్వపచాధమః |
| | 5 | మద్భక్తాః గోమః | మద్భక్తాః శ్రోత్రి |
| | | తియో | యో |
| | 8 | దోషలము | దోషము |
| 220 | 8 | మూర్తిని | యార్తిని |

శ్రీమతే రామానుజాయనమః



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - మొదటిగుచ్ఛము.

### శ్రీయతిరాజులవారిని యజ్ఞమూర్తిగారు సందర్శించుట.

శ్రీరంగనగరమున నొకనాటియుదయమున శ్రీమద్రామానుజయతీంద్రులు స్వశిష్యబృందముతో శ్రీరంగనాథాలయమునకువిచ్చేసి, శ్రీరంగనాథుని సుప్రభాతసేవయు నభిగమనారాధనయు ముగిసినవెనుక తిరుపరివట్టి, తీర్థ, శఠగోప ప్రసాదములు స్వీకరించి శ్రియఃపతి నాపాదమస్తకముసేవించి నుతించి "సేమనము" బొంది స్వమఠమునకు మఱలిరి. వీరు మహాద్వారముదాటి మఠమువంకకు మఱలిన మరుక్షణమే యొకయేకదండసన్యాసి శిష్యసహితుడై కోవెలలోని కరుగుచుండెను. విభూతిరుద్రాక్షమాలాలంకృతుడగు నాసన్యాసి విశాలఫాల వక్షములచే వెలయు సమున్నతకాయుడు. అతని

ఫాలభాగమును నేత్రయుగ్మమును జూచువారికతడు బహుమే ధాసంపన్నుడనియు క్షమాశాంత్యాది సద్గుణపుంజముల కాట పట్టనియు సులభముగ నూహింపనగు కోవెలలోనికే గోపు రండు మహాలోకభూసురు డీయతివరునిగని వినయవినమితోత్త మాంగుడై నమస్కరించెను. యతివరుడును నారాయణ స్మరణమొనర్చి చిరునగవుతో "మీరును భగవత్సేవకే యరు గుచున్నటులున్నదే. సేవాకాల మతిక్రమింపవచ్చినదేమో ఎంతశీఘ్రముగ రాదలంచినను యీవేళకుగాని రాసాధ్యపడ లే"దనెను. అందుకాభూసురుడు" "ఇంకనుదాదాపు రెండు ఘడియలకాలము భగవంతునిసేవించుకొన నవధియుంచును. భగవత్సేవకొఱకే యందఱకు లభింపవలయుననియే తగు నేర్పాటులు గావింపబడియున్నవి. తమరినిదివఱకెన్నడును దర్శించియుండలేదు" అనెను. "కావలికేణియను గ్రామ ము నాజన్మభూమి. మాపెద్దలందుండినవారేగాని నేనుమా త్రము కారణాంతరములచే నాగ్రామము వదలి యుత్తరదేశ వాసమొనర్పవలసివచ్చినది. ప్రకృతమునను కేవలతీర్థయా త్రికుడనై శ్రీరామేశ్వరాది పుణ్యక్షేత్రముల దర్శించి మార్గమధ్యముననుండు నీమహాక్షేత్రమునుదర్శింప నిన్నటిదిన మిచ్చటికివచ్చితిని" అని యతివరుడనెను. యతీశ్వరుని నామ ధేయ మేఁదెలుప బ్రార్థిప "నన్ను యజ్ఞమూర్తియందు"రని యాయనయనెను. ప్రశ్నించినయాయనశిష్యుడు "స్వామి

లవారిసద్గుణపుంజములఁబట్టి మాబోటివారు దయాపాలముని
యనిగూడ పిలుచువాడుక" యనెను అప్పుడాభూసురుడు "యీ
నామధేయము విననెంతయో యానందదాయకముగ నున్న"
దనెను. యతీశ్వరుడు భూసురునితో "మీగ్రామవాసు
లేనా" యని యడిగెను. భూసురుడంజలిఘటించి "చిత్తము
మాపెద్దలనాటినుండి భగవదనుగ్రహముచే నీమహాక్షేత్రము
ననేవాసమేర్పడినది" అనెను.

యతీశ్వరుడు:- మీనామధేయము?

భూసురుడు:- నన్ను మాధవుడందురు.

యతీశ్వరుడు:- పరమసంతోషము. నిరంతర మాధవసేవచే
మీరుకడుంధన్యులు.

భూసురుడు:- తమబోటి మహనీయుల యాశీర్వాదబలమే
సకలశ్రేయములకుకారణము.

ఇటులవారిరువురు సంభాషించుకొనుచు భగవత్స
న్నిధికరిగి శ్రీరంగనాథునిసేవించుకొని తీర్థ శఠగోపప్రసాద
ములఁ గ్రహించి శ్రీరంగనాథాలయ మహాద్వారముదాటి
వచ్చిరి. అప్పుడు యతివరుడాభూసురునితో "శ్రీరామానుజా
చార్యులవారను నొకగొప్పపండితులు నావలెనే
యత్యాశ్రమము స్వీకరించి యీగ్రామమున నున్నారని
వినియున్నాను. వారినొకపర్యాయము దర్శించిన బాగుం
డునని తోచుచున్నది. వారిమఠమిచ్చటికి సమీపముననే

యున్నదా? " యనియడిగెను. అందుకా భూసురుడు సంతస మున "తమబోటివారాయతిశిఖామణిని తప్పక దర్శింపవలసినదే. వారిమఠము నిచ్చటికి సమీపముననేయున్నది. ఆమఠముం డువీధిలోనే నేను గాపురముండునది. వారిమఠముమీకుజూ పించియే పోదునురండు. మీబోటి మహాత్ములసేవకన్నను మాబోటిసంసారులకు సంతసనోపాయమెద్ది." యని శ్రీ యజ్ఞమూర్తిగారిని శ్రీయతిరాజులవారి మఠముకడ కాభూసు రుడుగొనిపోయి అచ్చటనిలుచున్న నిరువురు శ్రీవైష్ణవులను జూపి "వీరు శ్రీరామానుజాచార్యులవారిశిష్యులు. వీరిసాయ మున నామహనీయుని మీరు సులభముగ దర్శింపగల"రని లికి, నమస్కరించి యతీశ్వరుని యనుజ్ఞనంది నిజనివాస మునకరిగెను. శ్రీయజ్ఞమూర్తిగారును మఠద్వారముకడ న్న ఆ శ్రీవైష్ణవులతో శ్రీరామానుజాచార్యులవారిని ర్శింప నిపుడవకాశముండునాయని యడిగిరి. అందున శ్రీ వైష్ణవులిరువురిలో నొకడు "శ్రీయతిరాజులవారికి మీరాక దెలిపివత్తుము. తామెవరో తెల్పెదరా"యనెను. "గంగా తీరమునందు నొకగ్రామము నానివాసము. శ్రీరామేశ్వరయా త్రకరిగి మార్గమధ్యముననుండు నీమహాక్షేత్రము దర్శించిపోద మని వచ్చియుంటిని. భగవద్దర్శనమైనది. భాగవతదర్శనము నందదలచితి"నని శ్రీయజ్ఞమూర్తిగారనిరి. వైష్ణవోత్తముడు వారివాక్యవైఖరికి సంతసించి "ఉతిన్నపై నిందుకవిశ్రమిం

పుడు. లోనికరిగి పరిస్థితికనుగొనివచ్చి తెల్పెద" ననిపలికి మఠ
ములోనికరిగి విశ్రాంతిగ గ్రంథావలోకనమొనర్చుచున్న శ్రీ
యతిరాజులవారికి శ్రీయజ్ఞమూర్తిగారివిషయముదెలిపి వారిని
లోనప్రవేశపెట్ట "నేమనము" బొందివచ్చి శ్రీయజ్ఞమూర్తి
గారి కావార్త తెలిపి వారినిలోనికిగొనిపోయెను. శ్రీయజ్ఞ
మూర్తిగారును శ్రీయతిరాజులవారినిదర్శించి నమస్కరింప
వారును ఆసనమ నుచితరీతి సత్కరించి యుచితస్థలమున నుపవి
ష్టులఁగావించిరి. అటుపిమ్మట వారిరువురికిని ఈక్రిందివిధముగ
సంభాషణజరిగెను.

శ్రీయతిరాజులు:- మీరుత్తరదేశమున గంగాతీరగ్రామవాసు
లని తెలిసెను. మీగ్రామము శ్రీకాశీనగరమునకు
సమీపమేనా?

శ్రీయజ్ఞమూర్తి:- కాశీనగరమున కొకక్రోసుదూరమున మా
గ్రామముండును. కాశీనగరమున పదునాల్గుసంవత్స
రములు వేదాంతాదివిద్యల నభ్యసించితిని. మాపెద్ద
లందఱు దాక్షిణాత్యులే. కారణాంతరముచే నేనుత్తర
దేశమునకువచ్చి చేరుకొనినపిదప వారణాసి వాసి
యగు నొకవైదికోత్తమునికడ విద్యాభ్యాసమొనర్చి
తిని. నాకు విద్యగరిపినవా రఖండపాండిత్యమును గడిం
చినవారు. వేదాంతశాస్త్రమున వారినిమించినవారు
లేరు. అద్వైతమున వారెన్నియో వాదగ్రంథములకు

వ్యాఖ్యానమొనరించిరి నేనువారివద్ద భాష్యాంతము విద్యనభ్యసించి ఆమహనీయుని యనుగ్రహమున వాదాహవమున దిగ్దంతులవంటి పండితులనెందఱనో గెలిచితిని. తమబోటివారికడ తన్నుతాను పొగడుకొనుట తగనికార్యమేగాని గురుప్రశంసలో నవశముగ నెటులనో నను చితముగ స్వప్రశంసనోటినుండివెడ్లినది. క్షమింపుడు.

శ్రీయతిరాజులు:- దానికేమిగాని మీరిచ్చటికి కేవలము యాత్రార్థమేవచ్చితిరా?

శ్రీయజ్ఞమూర్తి:- చిరునగుపుతో "మీరునన్నిటుల బ్రశ్నించు వైఖరియే మీపరాభిప్రాయజ్ఞత దెల్పుచున్నది. మీబోటివారికడ నికదాపరికమెందులకు? నాకుతీర్థయాత్రాపరతగౌణము. మతప్రచారపరత ముఖ్యము. మీపాండిత్యము కర్ణాకర్ణికగా వినియుండి మిమ్ముల నొకపర్యాయము దర్శింపనెంచివచ్చితిని. మీతో వేదాంతశాస్త్రవాదమొనర్చుటే నాకుచిరకాలవాంఛితము."

శ్రీయతిరాజులు:- మీరఖండపాండిత్యము గడించియుండవచ్చును. మీగురువులయెడ మీకుండుపూజ్యభావము మిక్కిలి ప్రశంసించదగినదే. కాని మీరుగాని మీగురుపరంపరకుజేరిన పండితోత్తములుగాని కేవల కుదృష్టిోదితమగు మతప్రచారమునకై పాండిత్యము

నంతయు వినియోగించుటఁజూడ కమ్మనిసీటిని కంటక వృక్షములఁబెంచుటకై వినియోగించువానిపగిది కన్పట్టుచున్నది.

శ్రీయజ్ఞమూర్తి:- శ్రీయతిరాజులవారి కడపటివాక్యములకు శ్రీయజ్ఞమూర్తి యజ్ఞేశ్వరునివలె మనంబునమండిపడి బొమముడివైచి "శ్రీఆదిశంకరులకాలమునుండి యాసేతు శీతాచలపర్యంతము దృఢముగ నెలకొనియున్న యద్వైతమతము ముందు మరేమతము నిల్వఁగలదు? ఇక శ్రీశంకరాచార్యులవారో కైలాసాధిపతి సాక్షాత్ శ్రీశంకరుడేయని "శంకరోశంకరస్సాక్షాత్" అను నార్యోక్తియే ప్రబలప్రమాణమై చాటుచుండలేదా! ఇంతకును వాదమున కుపక్రమించినగదా మతబలాబలములు తెలియనగును."

శ్రీయతిరాజులు:- మోక్షవ్యవసాయాత్మికమై బహుశిష్టపరిగ్రహీతమయి శాస్త్రసమ్మతమై, యుక్తియుక్తమైయుండు మతినిశ్చయమే మతనిశ్చయము. భగవద్గీతాశాస్త్రము లోని "వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహకురునందన! బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం" అను శ్లోకమె యిందుకుప్రబలప్రమాణము కాగలదు. లీలామతములు కుదృష్టిమతము లని తామసమోహనార్థము ద్వివిధముగా భగవదాజ్ఞచే సాత్వికేతరమత

ములు నిర్మింపబడియున్నవని శ్రీ పద్మోత్తర ఖండ
ములోని యుమామహేశ్వర సంవాదము దెల్పుచుండ
లేదా? శ్రీ శంకరాచార్యులవారివలె నేమఱికొందఱు
భగవదంశ సంభూతులగు మహాత్ములు, దేవతలు సైతమి
ట్టిలీలామతములు కల్పించిరి గాని వాటిని తమయనుష్ఠా
నమున నవలంబించినటుల నెచ్చటను గానంబడదు.
వ్యాధిగ్రస్థునికై సిద్ధపఱుపబడిన యౌషధము వైద్యు
డు సేవించనిపగిది యీదృష్టిలీలామతముల నిర్మించిన
వారు వాటినితామవలంబించుటయసంభవము. కావున
శ్రీశంకరాచార్యుల వారద్వైతమత మవలంబించలే
దని నాయభిప్రాయము.

శ్రీయజ్ఞమూర్తి:- వాదమున కుపక్రమించినగదా నేది వ్యవ
సాయాత్మికబుద్ధియో దెలియవచ్చుట. శృతులకను
గుణముగనున్నపుడేగదా పురాణములప్రమాణము
గానంగీకరింపదగును.

శ్రీయతిరాజులు:- మీరువాదమొనర్ప నుత్సాహులైయు
న్నటుల దెలియవచ్చుచున్నది. అందులకు నిరాక
రింపనేల. అవశ్యముగావచ్చును. నేనందుకుసదాసం
సిద్ధుడనే.

శ్రీయజ్ఞమూర్తి:- ఈనాడుకాలాతీతమైనది. రేపటియుదయ
మున వాదమున కుపక్రమింతము. ఈనగరముననుండు

వేదాంతశాస్త్రజ్ఞులను మీశిష్యులచే గెలువనంపుడు. వాదమునకు స్థలమెక్కడనిర్ణయించితిరి?

శ్రీయతిరాజులు:- శ్రీరంగనాథముఖమండపము ప్రశస్తముగ నుండును.

శ్రీయజ్ఞమూర్తి:- "అదినాకునుసమ్మతమే"యని శ్రీయతిరాజులవారికి నమస్కరించి "నియమనము"బొంది శ్రీయజ్ఞమూర్తిగారు శిష్యసహితులై తమబసకరిగిరి.

మొదటి గుచ్ఛము సమాప్తము.



శ్రీమతేరామానుజాయనమః



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - రెండవగుచ్ఛము.

### శ్రీయతిరాజ యజ్ఞమూర్తుల వేదాంతవాదము.

వేదాంతశాస్త్రమున వాదప్రతివాదములు శ్రీయతిరాజులవారికిని, యజ్ఞమూర్తిగారికిని శ్రీరంగనాథాలయముఖమండపమున మఱుదిన ముదయమున జరుగనున్నదను వార్త శ్రీవారిశిష్యులవలన పండితులకేకాక జనసామాన్యమునకు సయితము దెలియవచ్చెను. మరుదినముదయము శ్రీరంగనాథాలయ ముఖమండపము పండితబృందముతో తదితర ప్రేక్షకులతో క్రిక్కిరిసియుండెను. శ్రీమద్రామానుజయతీంద్రులుదయముననే కోవెలలోనికరిగి శ్రీరంగనాథుని సేవించి తీర్థశఠగోపాది సత్కారము లువడసి తామానాడు జరుపబోవు వేదాంతశాస్త్రచర్చకనమతిగొని శిష్యసహితులై ఆస్థాన

ముఖమండపము ప్రవేశించిరి. వారువిచ్చేసిన యనంతరము శ్రీయజ్ఞమూర్తిగారును శిష్యునివెంటనివచ్చిరి. వాద ముపక్రమింపబడుటకుముందు శ్రీయజ్ఞమూర్తిగారు "మనమి రువుర మీ వాదవిషయ మొకనియమమేర్పరచుకొని యం దుకు కట్టుబడియుండుట మంచిదని తోచుచున్న"దనిరి. శ్రీ యతిరాజులవారందుకు సమ్మతించి "మీ నియమ మెద్దియో తెల్పు"డనిరి. శ్రీయజ్ఞమూర్తిగారు, "నేనొకవేళ వాదమున మీ చేత పరాజితుడనైన నాసంప్రదాయమును రుచివాసనతో గూడ పరిత్యజించి మీకుశిష్యుడనయ్యెద"ననిరి. శ్రీయతి రాజులవారు "మీరునన్ను వాదమున గెలిచిన నాసంప్ర దాయ గ్రంథములపై నభిరుచివాసనతో గూడ వదలుకొనె ద"ననిరి. అపుడు శ్రీయజ్ఞమూర్తిగారు చిరునగవుతో "మీరుయుక్తిశాలురు. అయినను మీనోటినుండి ఆమాత్ర మైన మనసార మీనియమము తెల్పు టేచాలు"ననిరి.

శ్రీయతిరాజులు:- ఇక మీ వాద ముపక్రమింప్రదు. ఇప్పటికే కొంత మాలశ్యమైనది. పండితులెందరో మీయభి ప్రాయము వినకుతూహాలురై యున్నటులంచెలియవ చ్చుచున్నది.

శ్రీయజ్ఞమూర్తి:- చిత్తము. అపౌరుషేయమగు శ్రుతులను బాగుగ పరిశీలింప సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత చిన్మాత్రమే బ్రహ్మస్వరూపమని తెలియవచ్చుచున్న

కనుక భ్రమచేకంటికిగానఁబడునదంతయు మిథ్య ఇది కేవలము భ్రాంతివశమున బ్రహ్మమునందు కల్పితము నియే వేదాంతుల యభిప్రాయము.

యతిరాజులు:- మీ యభిప్రాయమునుబట్టిచూడ మీవలె జెప్పువారుమాత్రమే వేదాంతులని తెలియవచ్చు చున్నది. ఆవిషయమటుండనీగాని మొదలు మిథ్య యనగా నేమియో వివర్శింపుడు.

యజ్ఞమూర్తి:- ఒకవస్తువునుగురించిన యేస్థితియథార్థజ్ఞా నమువలన నివార్యమో ఆస్థితిమిథ్య చీకటిలో త్రాడు సర్పమువలె నగుపడుచు వెలుతురులో నిది త్రాడు గాని సర్పముగాదని తెలియవచ్చుచుండలేదా. యదార్థ రజ్జుజ్ఞానముచే సర్పమనెడిభ్రాంతి నివర్తించు నుగదా. దోషమువలన త్రాటియందు సర్పమను భ్రమకలిగినది. అటులనే బ్రహ్మమునందును నానా విధదేవ, మనుష్య తిర్యగాది జగత్తనెడి భ్రమదోష మువలనగలిగి బ్రహ్మరూపయథార్థజ్ఞానముచే నది నివ ర్తించును. కావుననే నేను మొదట దెలిపియుంటిని ట్టి ప్రపంచమంతయుమిథ్య.

యతిరాజులు:- ఇదిపర్వతమనియు, ఇదిసముద్రమనియు ఇదిభూమియనియు, ఇట్లుపరస్పర భిన్నపదార్థములను తెలిసికొనుట ప్రత్యక్షసిద్ధము. ఇటులాప్రత్యక్షసిద్ధము

భేదజ్ఞానమునకు నివృత్తిగలుగుట కేవలము ప్రత్యక్ష విరుద్ధము. ఇట్లుండ ప్రత్యక్షసిద్ధమగు భేదజ్ఞానమును శాస్త్రజ్ఞానమెట్లు నివర్తింపజేయగలదు?

శ్రీయజ్ఞమూర్తి:- ఇది త్రాడుగాని సర్పముగాదు. అను జ్ఞానముచే నింతకుముందు ప్రత్యక్షసిద్ధమైన సర్పమను జ్ఞానము నివర్తింపబడుచుండ లేదా? అటులనే శాస్త్రజ్ఞానముచే భేదజ్ఞానము నివర్తించుచున్నది.

శ్రీయతిరాజులు:- త్రాడు, సర్పము, అను రెండువస్తువులును ప్రత్యక్షములు. ఇట్టి రెండు ప్రత్యక్ష జ్ఞానములకుండు విరోధము వెలుతురుచే యథార్థవస్తువిషయని తెలిసికొనుట సాధ్యము. ఈయుపమానము పొసగదు. ప్రత్యక్షజ్ఞానమునకును తన్మూలమగు శాస్త్రజ్ఞానమునకును విరోధమెట్లు గలుగునని నేనడుగునది.

శ్రీయజ్ఞమూర్తి:- ఒక్కజాతిలో జేరిన రెండుజ్ఞానములకు విరోధము గలిగినపుడు దేనిచే నేది నివర్తించునని మీ యభిప్రాయము.

శ్రీయతిరాజులు:- దోషవిశిష్టమగు జ్ఞానము, దోషరహితజ్ఞానముచే నివర్తింపబడుచున్నది.

శ్రీయజ్ఞమూర్తి:- మీరుచెప్పెడి యీనిర్ణయపద్ధతియే శాస్త్రజ్ఞానమునకును ప్రత్యక్షజ్ఞానమునకును విరోధముసంభవించినపుడు సంయుక్తము నిర్ణయమున కనుకూలపడును.

ఇదిగాక శాస్త్రకారులందఱును రెండుప్రమాణము
లకు విరోధము పరస్పరము సంభవించినపుడు యేది
మఱియొకవిధముగ సమాధానము చెప్పుకొనుట కవ
కాశమిచ్చునదియో నది బాధింపఁబడదగినదనియు ఏది
యటుల సమాధానము చెప్పుకొనుట కవకాశమియ్య
నిదియో నదిభాదించునదియనియు నిర్ణయించియు
న్నారు. ఈ బాధ్యబాధకపద్ధతి ప్రత్యక్షప్రమాణ
మునకును శాస్త్రమునకు విరోధముగలిగినట్లయిన
శాస్త్రమపౌరుషేయమై యవిచ్ఛిన్నముగ శిష్టసంప్ర
దాయానుసారముగ వచ్చుచున్నది గావున ప్రత్యక్ష
ప్రమాణమును బాధించును. ఇట్టిశాస్త్రజ్ఞానము
నిత్య (కాలపరిచ్ఛేదరహితమై) శుద్ధ (అవిద్యారహి
తమై) ముక్త (జన్మమరణాదిరహితమై) బుద్ధ (ప్రకాశ
స్వరూపమై) స్వప్రకాశ (స్వయంప్రకాశమై) చిన్మా
త్రము (జ్ఞానమాత్రస్వరూపము) .బ్రహ్మయనియు,
నదియే యాత్మయనియు, బోధించుచున్నది. ఇట్లు
శాస్త్రజ్ఞానముచే బోధింపబడిన బ్రహ్మాత్మైక్యజ్ఞా
నము దోషవిశిష్టములైన ప్రత్యక్షాదిప్రమాణముల
నుండి సిద్ధమగు నానావిధ భేదజ్ఞానరూపమైనట్టి బా
ధమును నివర్తింపజేయును. భేదజ్ఞానవాసనయు నెడి
యవిద్యయే యొకదోషము. దీనిచే ప్రత్యక్షజ్ఞా

నము దూషితమయినది. వాస్తవమునకు భేదజ్ఞాన మసత్యముగనుక దోషములేని శాస్త్రిజ్ఞానముచే బాధింపఁబడుచున్నది.

శ్రీయతిరాజులు:- శాస్త్రిమవిచ్ఛిన్న సంప్రదాయానుసారము వ్చుచుండునదైనను "జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత" (స్వర్గమునుగోరువాడు జ్యోతిష్టోమయాగమును జేయవలయును) అని యివ్విధమగు భేదజ్ఞానము నవలంబించినదగుటచే శాస్త్రిముసయితము బాధింపబడదగినదేగదా? యని కొందఱడిగినప్రుడు మీరేమి సమాధానము జెప్పెదరు?

శ్రీయజ్ఞమూర్తి:- వేదశాస్త్రిము పూర్వభాగమనియు ఉత్తరభాగమనియు, నిర్ణయింపబడియున్నది. పూర్వభాగము కర్మకాండ, ఉత్తరభాగము జ్ఞానకాండ. కనుక పూర్వభాగముత్తరభాగముచే బాధింపబడుట కవకాశమున్నను, జ్ఞానకాండలోఁగూడా సగుణనిర్గుణ బ్రహ్మవిమర్శ లేకపోలేదు. అందుసగుణశ్రుతులు నిర్గుణ శ్రుతులచే బాధింపబడుచున్నవని సమాధానముఁజెప్పనగును.

శ్రీయతిరాజులు:- అయితే "యస్సర్వజ్ఞస్సర్వవిత్" (ముం. 2-7వా) (ఏపరబ్రహ్మము సర్వజ్ఞుడై యున్నాడుగను కనే సర్వముఁ నుతెలిసికొనుచున్నాడో) యనియు, పరా

స్యశక్తిర్వివిధైవ శ్రూయతే. స్వాభావికీజ్ఞాన బలక్రియాచ (శ్వేతా 6 అ 8 వా) [పరబ్రహ్మయొక్కశ్రేష్ఠ మయిన దిగ శ్రుతులనుండి వినబడుచున్నది. ఆయనకు స్వభావసిద్ధమగు జ్ఞానమును, బలమును, క్రియయునుగలవు] అనియు, "సత్యకామస్సత్యసంకల్పః" (ఛా. 8 ప్ర. 1 ఖ. 5 వా.) [పరబ్రహ్మము సత్యకాముడును సత్య సంకల్పుడును] అనియు నీవిధముగ బ్రహ్మముగుణ ములుగలదియని ప్రతిపాదించు శ్రుతిప్రమాణము లెట్లు బాధింపబడదగినవి?

శ్రీయజ్ఞమూర్తి:- బ్రహ్మ గుణములేనిదియును లేనిదియని ప్రతి పాదించు శ్రుతిప్రమాణములచే బాధింపబడదగినవి. ఎటులనన "అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘం" (బృ. 5 అ. 8 బ్రా. 8 వా) [బ్రహ్మముస్థూలమయినదిగాదు సూక్ష్మమయినదిగాదు, పొట్టిదిగాదు, పొడుగైనది గాదు.] అనియు "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ (తై ఆనం 1 అను 1 వా) [మిథ్యాభూతముకానిదియు, జడముకానిదియు, పరిచ్ఛేదములేనిదియు బ్రహ్మము"] అనియు నిర్గుణం నిరంజనం (శ్వే. 6 అ. 19 వా) [బ్రహ్మము గుణములులేనిది అవయవములులేనిది] అనియు "సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం" (ఛా. 6 ప్ర. 2 ఖ. 1 వా) [సృష్టికిపూర్వము

జగమంతయునొక్కటిగా నుండినది అనగా రెండవదిలే నిదిగా నుండుసర్వాత్మయు బ్రహ్మముగనుండెను.] అనియు "ఆత్మావా ఇదమేకమేవాగ్ర ఆసీత్ (ఐత. 1 అ. 1 ఖ. 1 వా) [సృష్టికిపూర్వము జగమంతయు నాత్మగనేయుండెను.] అనియుదెల్పుచున్నవి. అనేక జన్మములు ఫలాపేక్షలేకయే యొనర్చిన యజ్ఞాదికర్మలవలన పాపమునశించినవానికి జ్ఞానసంపాదన విషయమై కోరికగలుగును. "అయమాత్మాబ్రహ్మ" (బృ. 6 అ. 4 బ్రా. 5 వా) [ఈయాత్మయేబ్రహ్మము] అనియు, "తత్త్వమసి" [ఆబ్రహ్మమునీవు] అనియు. ఈ మొదలుగాగల వేదాంతవాక్యములయర్థము దెలిసికొనుటవలన యట్టిమానవుని యవిద్యనివర్తించుచున్నది. అట్టివాక్యార్థజ్ఞానమునకు శ్రవణంబును మననంబును నిధిధ్యాసంబును మిక్కిలియుపయోగకరములు. ఆత్మయొక్కటియే యనుజ్ఞానమును వేదాంతవాక్యములు ప్రతిపాదించుచున్నవనెడి తత్త్వమునెఱింగినయాచార్యునివలన న్యాయయుక్తమగు నర్థమును గ్రహించుట శ్రవణ మనబడుచున్నది. ఇట్టిజ్ఞానమునకు విరుద్ధమైన అనాదిభేదజ్ఞానవాసనను పోగొట్టుకొనుటకై యీయర్థమునే యెల్లప్పుడు దలంచుచుండుట నిధిధ్యాసమనబడుచున్నది.

శ్రవణమనన నిధిధ్యాసములవలన భేదజ్ఞానము వా
సనతోఁగూడ నశించినమానవుని యవిద్యను వాక్యార్థ
జ్ఞానము పోఁగొట్టును. శ్రవణమునకు పూర్వముకలి
గియుండవలసిన వైవ్వియన నిత్యానిత్యవస్తువివేకము
శమదమాది సాధనసంపత్తియు, ఇహాముత్రఫలభోగ
విరాగంబును ముముక్షుత్వము ఇవి లేకున్న బ్రహ్మ
జిజ్ఞాసగలుగనేరదు. కావున వెనుకఁజెప్పఁబడిన యో
గ్యత సంపాదించి "అయమాత్మాబ్రహ్మ" "తత్త్వమసి"
ఇత్యాదివేదాంతవాక్యముల యర్థము[illegible]మట
వలన మననముజేయుటవలన యవిద్యానివృత్తియగు
చున్నది. అవిద్యానివృత్తియే మోక్షము.

శ్రీయతిరాజులు:- వేదాంతవాక్యముల యర్థములువినుట మన
నముచేయుటచేతనే ముక్తిగలుగునెడల వాక్యము
[illegible]వారు చదివినతోడనే యర్థము విశదమగు
చున్నదిగాన నిందుకై యుపాసనారూప శాస్త్రవిధు
లెందుకు? ఇంతియుగాక వాక్యార్థశ్రవణ మననాదులచే
నవిద్యనశించుటయుగూడ యసంభవము.

శ్రీయజ్ఞమూర్తి:- అవిద్యాకార్యమగు భేదజ్ఞానము వెంటనే
నివర్తింపకపోవుట యొకదోషముగాదు. చంద్రుఁడొ
కఁడే యనుజ్ఞానమున్నను కొందఱకు అనేకచంద్రు
లున్నటులగాఁ దోఁచును. అటులనే భేదజ్ఞానము [illegible]

ర్తింపబడకపోయినను దానికింగారణమగు యవిద్య, జ్ఞానోత్పత్తిచే నశించినది. కాబట్టి భిన్నమూలమగు భేదజ్ఞానము సంసారబంధమున కెంతమాత్రము హేతువుగానేరదు.

శ్రీయతిరాజులు:- మీయుపమానము సర్వదాచెల్లను. చంద్రదర్శకజే యనుజ్ఞానమున్నను అనేకచంద్రులుకనబడుట విరుద్ధముగాదు. అనేకచంద్రులుకనబడుట యనెడి మిథ్యాజ్ఞానమునకు సత్యమగు నేత్రజాడ్యము కారణము. ఇదిచంద్రదర్శకజేయను జ్ఞానముచేనివర్తింపదగినదిగాదు. రజ్జువును సర్పముగభ్రమించినవానికిదిరజ్జువుగాని సర్పముగాదనెడి జ్ఞానముచేభయపలాయనాదులు నివర్తించుచుండలేదా యందురేమో! అనేకచంద్రులగపడుట నేత్రజాడ్యముచే కలిగినది. ఇదిఔషధములచే నివర్తించువఱకు శాస్త్రోపదేశము నిరుపయోగమే. మీరుచెప్పినప్రకారము భేదజ్ఞానవాసన పోయిననే యవిద్యానివర్తకజ్ఞానము కలుగునను పక్షమున నట్టిజ్ఞానమెన్నడును కలుగనే గలుగదు. భేదజ్ఞానవాసన యనాదిగ వృద్ధిబొందుచు వచ్చినదిగాన నదియపరిమితమయియున్నది. కాబట్టి స్వల్పకాలములో నభ్యసింపబడు అద్వైతభావనవలన నది నివర్తించుటదుర్లభము. మీరుచెప్పి న...

నాదులు ధ్యానమునకు సహకారులగుచున్నవి. కావున వేదమునందు విధింపబడినది ఉపాసనారూపమగు జ్ఞానము. "నిధిధ్యాసితవ్యః" అను వాక్యము "అనువిద్య విజానాతి విజ్ఞాయప్రజ్ఞాంకుర్వీత" అనువాక్యములతో సమానార్థముగలది. ఇందులకు "ఓమిత్యానంధ్యాయథ" (ము. 2 ము. 2 ఖ. 6 వా) ఓమనియే పరమాత్మను ధ్యానము జేయుడనియు "నిచాయ్యతం మృత్యుముఖాత్ ప్రముచ్యతే" (క ఠ. 1 అ. 3 వ-15 వా) [అనగా పరమాత్మను బాగుగా ధ్యానించి మృత్యుముఖమునుండి విడువబడుననియు] "ఆత్మా వా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో నిధిధ్యాసితవ్యః"(బృ. 6 అ. 5 బ్రా. 6 వా) [అనగా పరమాత్మయే చూడదగినవాడు. విచారింపదగినవాడు ధ్యానింపదగినవాడు] అనియు "సోన్వేష్టవ్యస్సవిజ్ఞాసితవ్యః (ఛా. 8 ప్ర. 7 ఖ. 1 వా) పరమాత్మయే వెదకదగినవాడు, విచారింపదగినవాడు] అనియు బహుశ్రుతిప్రమాణబలముచే నుపాసనయే సిద్ధించుచున్నది. గుణముగలవాడే యుపాసింపదగినవాడు. పరమాత్మసర్వజ్ఞుడు. సకలకల్యాణగుణ స్వరూపుడు, హేయగుణరహితుడు. ఇతిహాస పురాణములలోను ఉపాసనారూపభక్తియే ముక్తికుపాయమని తెలుపబడియున్నది. మహాత్ములందరు నడచినసంప్రదాయపద్ధతి

నిదియేగావున నిదియే యవశ్య మనుసరణీయము.

యజ్ఞమూర్తి:- జ్ఞానమునుదోషరహితుండని మనముభయులము నొప్పుకొనుచున్నాముగదా. ఈజ్ఞానమే యాత్మయని యేలచెప్పగూడదు?

శ్రీయతిరాజులు:- "ఘటముం దెలిసికొనుచున్నాము. పటముం దెలిసికొనుచున్నాము" అనియిట్లు ఆత్మ జ్ఞాతగ(తెలిసికొనదగినదిగ) తెలియవచ్చుచున్నదేగాని కేవలజ్ఞానమాత్రము తెలియవచ్చుచుండలేదు. ఇదిగాక "నేను తెలిసికొనుచున్నాను." యనెడియనుభవ జ్ఞానమొక ధర్మముగాను "నేను" అనుదానిని ధర్మిగాను తెలుపుచుండుట ప్రత్యక్షసిద్ధము. మీరుచెప్పునది యనుభవమునకు విరోధము.

శ్లో॥ నిరస్తాఖిలదోషోహమ్ అనంతానందభాక్ స్వరాట్।
భవేయమితి మోక్షార్థీ శ్రవణాదౌ ప్రవర్తతే॥

తా॥ మోక్షముకు గోరువాడు "నేనుయీసంసారదుఃఖముల నన్నిటిని పోగొట్టుకొని యపరిమితమగునట్టి యానందమునుపొంది, స్వయంప్రకాశుడను కావలయును" యనెడి యభిలాషచేగదా శ్రవణమనన ఉపాసనాదులందు ప్రవర్తించుచున్నాడు.

శ్లో॥ అహమర్థవినాశశ్చేత్ మోక్ష ఇత్యధ్యవస్యతి
అపసర్పేదసౌ మోక్ష కథాప్రస్తావగంధతః॥

తా॥ అట్టిపురుషుఁడు "నేను" అనెడివస్తువు నశించుటయే మోక్షమని యెఱుఁగునట్లైన లేశమాత్రమయినను మోక్షమున్నకథయే యెత్తకుండును.

శ్లో॥ మయి నష్టేఽపి మత్తోన్యా కాచిద్ జ్ఞప్తిరవస్థితా
ఇతి తత్ప్రాప్తయే యత్నః కస్యాపి న భవిష్యతి॥

తా॥ నేను నశించిపోయినను నాకంటెను వేఱగు జ్ఞప్తి (తెలివి) అనెడువస్తువొకటియుండుననుకొని అందులకై యెవ్వఁడు ప్రయత్నించును?

శ్లో॥ స్వసంబంధితయా హ్యస్యాస్సత్తా విజ్ఞప్తితాదివత్।
స్వసంబంధవియోగేతు జ్ఞప్తిరేవ న సిధ్యతి॥

తా॥ నేను తెలిసికొనుచున్నాను అనియిట్లు "నేను" అనుదానితో సంబంధించియుండుటచేఁగదా జ్ఞప్తియనెడి వస్తువొకటికలదనియు, అది పదార్థములను తెలుపునదియనియు ఈ మొదలగునవన్నియు సిద్ధించుచున్నవి. నేనుయనునది నశించిపోవుటయే మోక్షమను పక్షమున అప్పుడు "నేను" అనుదానితో జ్ఞప్తికిగలసంబంధము గూడపోవునుగాన అట్టిసంబంధమునుబట్టి యున్నదిగ తెలియవచ్చునట్టి జ్ఞప్తియనునదియును లేనిదేయగును.

శ్లో॥ ఛేత్తృచ్ఛేద్యస్యభావే ఛేదనాదేరసిద్ధివత్।

అతోహమర్థోజ్ఞాతైవ ప్రత్యగాత్మేతినిశ్చితమ్।

తా॥ ఛేదించువాడును, ఛేదింపబడునట్టి పదార్థమును లేకపో యినపక్షమున ఛేదనమెట్లుండదగును? అటులనే తెలిసి కొనునదియు తెలియబడునదియు లేనట్లయిన జ్ఞానము (తెలిసికొనుట) సయితము లేకపోవును గావున జ్ఞాత (తెలిసికొనువాడు) ఆత్మయని నిశ్చయింపనగును. శ్రీ భగవద్గీతావాక్యములు పెక్కులిందు కుదాహరణము గానున్నవి. "ద్వావిమౌపురుషౌలోకే" త్యాది శ్లోకము లింమను ప్రజల ప్రమాణములేలగావు? గావున ప్రకృతి సత్యము. జీవులనేకులుండుట సత్యము పిరికి నియామకు డుండుటయు ఆయన నుపాసించినజీవులు ముక్తులై శాశ్వ తానందము ననుభవించుటయుసత్యము. ఉపాసనకు వివేకవిమోకాదులావశ్యకము. ఇటు శ్రీయతిరాజుల వారు శ్రీయజ్ఞమూర్తిగారి వాదమునంతయు ఖండించిరి. శ్రీయజ్ఞమూర్తిగారు శ్రీయతిరాజులవారు చెప్పిన దానినంతయు మఱలఖండించిరి. ఇటులవారిరువురికి పదునెనిమిదిదినములు వాదముజరిగినది. అచ్చటఁజేరిన వేదాంతశాస్త్రవేత్తలు కొన్నిదినములుమాత్రము వా రిరువురి యభిప్రాయభేదముల నవగాహనము జేసికొన గలిగియుండిరిగాని రానురాను వాదోపవాదములు హెచ్చుగుకొలది పరస్పరాభిప్రాయభేదము లిఁచుకైన

గోష్ఠీసభాసదులు చిత్రప్రతిమలవలె స్తబ్ధులయిరి. మఱు నాఁటి దినమున సాయంసమయమునకు "ప్రమాణాధీనః" అను వ్యాఖ్యానోపనిషద్వాక్యముపై వాదము పెఱిఁగి శ్రీయజ్ఞమూర్తిగారడిగిన ప్రశ్నలకు శ్రీయతిరాజులవారించుక యోచించి సమాధాన మియ్యవలసినవారలయ్యెను. అప్పుడిపరిస్థితినిబట్టి శ్రీయతిరాజులవారి కెద్దియుస్ఫురింపలేదు. సంధ్యాకాలమయినందున నికపైనవాదములు నిరమింపవలసియుండెను. రేపటిదినము ఈనాఁడు మీరడిగిన ప్రశ్నలకు సమాధానము పడయఁగలరని శ్రీయతిరాజులవారనిరి. రేపేగాదు మఱెంతకాలమైనను నాప్రశ్నలకు సమాధానముఁ జెప్పుట కవకాశముఁ బుచ్చుకొనవచ్చునని తమపాండిత్యగర్వమును సూచించుచు శ్రీయజ్ఞమూర్తిగారు లేచిరి. ఆనాటిసభ నిర్విఘ్నముగ ముగించి యెవరినివాసములకు వారరిగిరి.

రెండవగుచ్ఛము సమాప్తము.



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - మూడవగుచ్ఛము.

### శ్రీయజ్ఞమూర్తిగారు శ్రీయతిరాజులవారినాశ్రయించుట.

శ్రీయతిరాజులవారు, తామానాడడిగినప్రశ్నలకు సరియగుసమాధానము చెప్పజాలరని శ్రీయజ్ఞమూర్తిగారికి గట్టినమ్మకము గలిగియుండినది. ఇక శ్రీయతిరాజులవారో సకలప్రవృత్తినివృత్తులు శ్రియఃపతియధీన మను గట్టినమ్మకము గలవారైయుండుటచే, ఆనాటిసాయంకాలము భగవదాజ్ఞావిధులన్నియు నెఱవేర్చుకొని రాత్రిశయనించుసమయమున శ్రియఃపతిని "పరమపురుషా, వరద! ప్రభో! మీవిచిత్రశక్తి వాచామగోచరము. శ్రీకాంచీనగరమున మీయంతరంగభక్తులగు శ్రీకాంచీపూర్ణులమూలమున జీవులు మీకుపరతంత్రులని తెలియఁజేసితిరి. ఇందుకునిదర్శనముగా శ్రీ—

[illegible] వసిష్ఠ, పరాశర, కృష్ణద్వైపాయన, శుక, శౌనకాది మహర్షులును, శ్రీ[illegible]ల, పరాంకుశ, నాథ, యామునాది పరమ[illegible] శ్రీ[illegible]లును తమతమగ్రంథములలోను, అనుష్ఠానములలోను దేవరవారి శ్రీసూక్తుల కనుగుణముగనే వ్యాఖ్యానించి [illegible]ంచియుండిరి. ఇట్టులుండ నేడీయద్వై తఖండితుడు "[illegible]" అను నుపనిషద్వాక్యముపైగొంత మహావాదముచేసి నన్నుపరాజితు నొనర్పజూచుచున్నాడు. ఇతడుశ్రుతుల కపార్థముగల్పించుచున్నాడని తెలియవచ్చినను ఇత[illegible] కొన్నిప్రశ్నలకు సమాధానమింతవఱకు స్ఫురింప కున్నదని సర్వాంతర్యామియగు మీకీవిషయము తెలిసియు [illegible] యాశ్చర్యము. ఇకనైన [illegible] సమాధానము స్ఫురింప[illegible] [illegible]నమునుమాన్పి మన [illegible] ప్రార్థించుచు నిద్రితులోనైరి.

కరుణానిధియగు శ్రీకరిగిరీశుడు శ్రీయతిరాజులవారి స్వప్నమున సాక్షాత్కరించి మందస్మిత సుందరవదనారవింద మునుండి కర్ణపేయమధురోక్తుల "యతిరాజా! అధైర్య మునొందవలదు. నీపరమాచార్యుల "మాయావాదఖండన" మను గ్రంథముననే ఎటువంటి గొప్పప్రశ్నలకైనను సమా ధానమున్నది. ఆగ్రంథములోని యంశములు నీకుసమయ మునకు స్ఫురింపకుండుటకు నేనేకారణము. అదెట్టులందువా [illegible]మించు నీవంటిసామర్థ్యముగల శిష్యుడు నీకడనుండినగాని

ఏకీభవనమునైనను సిద్ధాంతప్రచారమువలనఁగ నొనర్పఁ సాధ్య
పడదు. ఇదికలియుగము గావున హేతువాద మాయావా
దములకు గురియగువారధికము. శ్రీ అన్నైస్, ఉపాధ్యాస్
మున్నగువారు ప్రబలవిద్వాంసులైనను పరమసాత్త్విక స్వభా
వులగుటచే వారిదృష్టి నామతమందే విశేషముగ మగ్నమై
యుండును. ఈ యద్వైతవాది యికమీద నావిశేషకటాక్ష
మున పరిపాకమునొంది ప్రపన్నకోటిలోఁజేరినను వాదముతట
స్థించినపుడుమాత్రము అప్రమత్తుడై మద్వాదమత్తేభ పంచా
ననుడై వర్తించుచుండును. ఇట్టివాడు నీకడనుండ సంకల్పిం
చియే, నీకుసమయోచిత సమాధానము స్ఫురింపజేయుచుంటిని.
ప్రణవధనుస్సున సంధానమొనర్పఁబడిన నాత్మశరము పరమా
త్మస్వరూప లక్ష్యస్థానముఁబొందునేగాని అంద్వైక్యమొందజాల
దనుటకు ప్రత్యక్షనిదర్శనమటుండ వలసినన్ని శాస్త్రప్రమా
ణములు నీకిప్పుడే స్ఫురింపగల"వని తమ శ్రీహస్తము శ్రీయ
తీంద్రమస్తకముననునిచి యాశీర్వదించి యంతర్ధానమైరి.

శ్రీకరిగిరీశుని కరాంబుజస్పర్శచే శ్రీయతీంద్రులు
మేలుకొని కన్నులువిచ్చిచూచి భగవానుని దివ్యమంగళ
విగ్రహమును తననుగుణమగు నపారకృపా ప్రవాహము
తనపైఁ బారలుట దలంచి యానందాంబుధిమగ్నులైరి. ఈ
యపారానంద పారవశ్యావస్థలో నెప్పుడో భల్లునతెల్లవారి
నది. శ్రీయతీంద్రులు ధ్యానానంద [illegible]

సూర్యోదయము కావచ్చుటఁగని సత్వరముగ బ్రాతఃకాల భగవదారాధనలు నెఱవేర్చుకొని శ్రీరంగనాథునిసేవించు కొని మఠాభ్యంతరమునకు విచ్చేసిరి. ప్రేక్షకు లనుక్షణము నను శ్రీయతిరాజ యజ్ఞమూర్తులవాదమును వినకుతూహలు లై [illegible] సమకూరుచుండిరి. శ్రీయజ్ఞమూర్తి గారును సకాలమున విచ్చేసి శ్రీయతిరాజులవారిరాకకై నిరీ క్షించుచుండుటసహజమే. కాని శ్రీయతిరాజులవారు రాగానే యవశముగ లేచి నిలుచుండి యంజలియొనర్చి సాష్టాంగ వందనం బాచరించుటయే యసహజమును, ఆశ్చర్యమునునైన విషయము. గడచినదినము తమవాదమిక నెగ్గెదను గర్వో త్సాహములుగల శ్రీయజ్ఞమూర్తిగారి కీవిధపరివర్తన మేల గలిగినదని తెలియనందుచే ప్రేక్షకవర్గము వింతగదోచెను. ఇందుకుగారణము మఱియొండుకాదు. ఆనాటి శ్రీరామానుజ దివాకరుని అపూర్వదుర్నిరీక్ష్యతేజమే. గడచినదినము తా మడిగినప్రశ్నల కేమిసమాధానమిచ్చెదరని యడుగుటకు దోచకుండ శ్రీయజ్ఞమూర్తిగారినిగని శ్రీయతిరాజులవారే మీరు నిన్న నన్నడిగిన ప్రశ్నలకు సమాధానము లివియని దెలుపుచుగాక శాంతించియున్న యజ్ఞేశ్వరునివలెజూపట్టు శ్రీ యజ్ఞమూర్తిగారిని కొన్నిదురవగాహములగు ప్రశ్నలనడిగిరి. ఇకవీరితో వాదముఁబెట్టుకొనిన తప్పక నోడుదుమనియు మన స్వశక్తియొక్కటైనను గలుగకున్న నాత్మోజ్జీవనము దుర్లభమనియు

తెలిసికొనికాబోలు శ్రీయజ్ఞమూర్తిగారు "జితోస్మి" యని శ్రీయతిరాజులవారిసన్నిధి నంజలిఘటించి పలికిమరియు "అజ్ఞాన అపరాధిని. దేవరవారి ప్రభావమెఱుంగక మహాగర్వమొనర్చి తిని. దాసునిసర్వాపరాధములు క్షమించి శిష్యునిగ నేలుకొమ్మని ప్రార్థించిరి. భగవంతునికృప బాగుగ ప్రసరింపని వానికి తానెంతయపరాధియైనను అహంభావమున్నపని లోని రాజసభావము తొలగకుండుటచే స్వదోషము తెలిసినను అపరాధక్షమాపణకై ప్రార్థింపనొల్లడు. శ్రీయజ్ఞమూర్తిగారికో శ్రీకరిగిరీశునికరుణ వెలసినంత ప్రసరించియుండుటచే స్వాభిమానమును తొలగద్రోసికొని నిండుసభలో "అపరాధములక్షమించి శిష్యునిగనేలుకొనుడని శ్రీయతిరాజులవారి పదాంబుజములపైవ్రాలి ప్రార్థించిరి. శ్రీయతిరాజులవారును, శ్రీయజ్ఞమూర్తి సాధుభావమునకుసంతసించి పూర్వము ఆయనకుండిన ఏకదండయత్యాశ్రమవిధులు ప్రాయశ్చిత్తపూర్వకముగ దొలగించి పంచసంస్కారసంపన్నునిగావించి శ్రీవైష్ణవయత్యాశ్రమమొసంగి ధన్యునిగావించిరి. శ్రీయజ్ఞమూర్తిగారును, శ్రీయతిరాజులవారి తిరునామము (పేరు) తమదాస్యనామమున నిమిడియుండునటుల ననుగ్రహింపుడని ప్రార్థింప కేవలము శ్రీకరిగిరీశునికరుణచే లభించిన శిష్యరత్నమితడనియు, తమయిష్టదైవమగు శ్రీకరిగిరీశునినామముగూడ దాస్యనామమునఁ జేర్చుటుచితమనియు నెంచి ఆయనకు "శ్రీ

యరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్" అని దాస్యనామ మనుగ్రహించిరి. "అరుళాళప్పెరుమాళ్" అను ద్రావిడనామమునకు శ్రీవరదరాజస్వామియనియర్థము. ఇక శ్రీయెంబెరుమానార్ అనుబిరుదనామము తనకు తమఆచార్యానుగ్రహమున లభించినదే. ఈరెండుద్రావిడపదములు చేరినప్పుడు శ్రీవరదరామానుజులను దివ్యనామమేర్పడును. ఈనామమునకే శ్రీయజ్ఞమూర్తిగారిని పంచసంస్కారసంపదనలభించినదాదిగ ద్రావిడభాషదెలియనివారు పిలుచుచుండిరి. భగవన్నామము, స్వాచార్యనామముతోఁజేరి తమదాస్యనామముగ నేర్పడియుండుట స్వర్ణాభరణమునకు దివ్యపరిమళముఁజేరినట్లైనది. భగవద్రామానుజకల్పతరువు నాశ్రయించిన నాటినుండి శ్రీవరదరామానుజాఖ్యవిఖ్యాతకల్పలత స్వధర్మజ్ఞాన, వైరాగ్య, పాత్ర్యభక్తి సౌరభమునల్లెడల వెదజల్లఁజొచ్చెను. ఆచార్యులును, శిష్యునకొక ప్రత్యేకమఠమేర్పఱచి "నాయిష్టదైవమగు శ్రీవరదరాజస్వామివారి యీయర్చామూర్తినారాధించుకొనుచు, భగవద్భాగవతాచార్యగుణానుభవంబొనర్చుకొనుచుండుమని యాజ్ఞాపించిరి. స్వాచార్య శ్రీపాదసన్నిధానముననుండుటే తమకభిరుచిగానుండినను శ్రీవరదరామానుజులు ఆచార్యాజ్ఞానువర్తులైయుండుటే తమ స్వరూపమున కౌజ్జ్వల్యకరమును సజ్జీవనహేతువును, నని తలంచి తమకేర్పఱచిన నూతనమఠమున నిర్విఘ్నముగ భగవ

ద్భాగవతాచార్య సంచారుభవంబొనర్చుకొనుచు నెమ్మదిగ
కాలముగడపుచుండిరి.

శ్రీకాంచీవరదరామానుజాది భాగవతోత్తము లనవ
రతము సేవింప శ్రీయతిరాజులవారొకనాడు తిరువాయిమొళి
కాలక్షేపమనుగ్రహించుచు, మూడవపత్తు, మూడవతిరువా
యిమొళిలో శ్రీవేంకటాద్రి శ్రీనివాసుల పరముగా శ్రీనమ్మా
ళ్వార్లచే ప్రసాదింపబడిన "ఒళివిల్ కాల మెల్లాముడనాంచ్
మన్ని" యను పాశురమునకు తాత్పర్యమతిరమ్యముగ నను
గ్రహించిరి. "ఒళివిలక్షుంబాడా! గంభీరధ్వానంతో సెలయేరు
లుపారుచుండు తిరుపతికొండయందు సౌందర్య, శీలభవ్యాను
లచే నన్నువశపఱచుకొని వేంచేసియుండు శ్రీనివాసమూర్తికి
సర్వదేశ సర్వకాలములందు సర్వవిధకైంకర్యము లొనర్పవల
యునని పైపాశురమునకు తాత్పర్యము. పాశురార్థము కడు
రమ్యముగ వాక్రుచ్చు నాయతీంద్రుల శ్రీసూక్తులాకర్ణించి
శిష్యు లమందానందమానసులైరి. యతీంద్రు లదిగమనించి
మీయానందము క్రియారూపముగ పరిణమించినయెడల శ్రీ
నమ్మాళ్వార్లకును, శ్రీశ్రీనివాసులకును మఱింతముఖోల్లాస
ముగ నుండగలదని బలుక నాభాగవతోత్తములలో నొకడగు
"శ్రీయనంతాళ్వాన్" అనువారు లేచి యంజలిఘటించి "దాసుడు
తిరుమలలో కైంకర్యమొనర్ప సిద్ధముగనున్నాడు. అనుజ్ఞనొసం
గుడని విజ్ఞాపనంబొనర్చిరి. శ్రీయతిరాజులవారందుకు సంతసించి

మంగళాశాసనంబొనర్చిరి. అందుండు శిష్యబృందమును శ్రీయనంతాళ్వానే ధన్యుండని కొనియాడిరి. మఱుదినమే శ్రీయనంతాళ్వాన్ భగవద్భాగవతాచార్య యనుజ్ఞవడసి తిరుమలకు వేంచేసిరి.

శ్రీమద్రామానుజ యతీంద్రులు తమశిష్యులగు శ్రీయనంతాళ్వాను కైంకర్యార్థమయి తిరుమలకు వేంచేసినపిదప, కొన్నిదినములుగడవ నొకనాటియుదయమున భగవదాజ్ఞావిధులనుముగించుకొని యేకాంతముగ వేంచేసియుండుతఱి తమమనంబున "నేనుయేకృపామయుని విశేషానుగ్రహమున పరమభాగవతులగు శ్రీతిరుక్కచ్చినంబిగారిచే బోధింపబడి శ్రీపరాంకుశదాసుల పదాంబుజము లాశ్రయించి జ్ఞానభక్తి వైరాగ్యసంపత్తిసంపదఁగలిగితినో, యేయఘటనా ఘటనసమర్థుని సత్యసంకల్పముచే శ్రీయజ్ఞమూర్తియనుపేరి యద్వైతియగు పండితోత్తముడు వాదాహవమునవోడి పాదాక్రాంతుడై యుజ్జీవింపగలిగెనో యట్టి నా నిత్యారాధనీయమూర్తియగు శ్రీకరిగిరీశుని కన్నులకఱవుదీర సేవించి బహుకాలమయ్యెను. నాకు సకలహితములుపదేశించిన శ్రీతిరుక్కచ్చినంబిగారిని దర్శింపనిచ్చ నానాటికి వృద్ధియగుచున్నది ఇదిగాక నామేనమామగారగు శ్రీపెరియతిరుమలనంబిగారికి పిళ్లై, పిళ్లాన్ అను నిరువురు పుత్రరత్నములలో పిళ్లానను ద్వితీయపుత్రుడు బాల్యమునుండియే బహుమేధావియై శ్రీవారి శ్రీసూక్తుల ననవరత మను

సంధించుకొనుచు తన్నుయునైయుండునని యు తిరుమల యాత్రా
వ్యాజమునన్నైనను వాక్షకజనులనుండు తమ్ముద్ధరామ్యించి
బాలుర నిరుపురవా కీర్తింపు రాజలయునవియు నిదివఱకెన్ని
మారులో చెప్పించుచుండిరి. శ్రీకిడాంబియాచార్యుల తనకు
పితృసోదరియగు నా మేనమామగారి దేవిగారిని చూచివత్తమని
కొన్నిమాసములక్రింద తిరుమల కరిగియుండినప్పుడుగూడా
నన్ను రమ్మని వర్తమానమంపియుంచిరి. దేహబాంధవ్య
ముటుండ ఆత్మబాంధవ్యముగల యాచార్యశిఖామణిని కన్నుల
కఱవుదీర దర్శించివత్తమను నాకు నాకుమాత్రము లేదా? శ్రే
యాంసి బహువిఘ్నానియనువటుల నెప్పుడుయత్నించినను ఎన్ని
యోవిఘ్నములు తటస్థించుచున్నవి. నాయనుంగు సోదరు
డగుగోవిందమిశ్రునిజూడ నామనంబనుదినంబును నువ్విళ్ళూరు
చున్నది. నన్నిదివఱలో నే కాంచిపురిలో నాశ్రయించి పంచ
సంస్కారముపడసిన శిష్యుల యాత్మోజ్జీవనమరసి యథాశక్తి
సమయోచిత పరిబోధ మొనర్చుటయు భగవన్మహోల్లాస
కైంకర్యము నుండక పోదు. శ్రీకాంచీపురి సమీపగ్రామము
లందేకదా వారుండునది" యని యాలోచించుచుండ వారి
దక్షిణనేత్ర మొకమారదరెను. ఈవర్యాచుము తమసంకల్పము
నెఱవేఱుననుట కిదియే శుభసూచకమని తలంచి కతిపయ
శిష్యులువెంటరా శ్రీరంగనాథుని సన్నిధికరిగి శ్రియఃపతిని
సేవించుకొని సేవాకాలము ముగిసి తీర్థశఠగోప ప్రసాదములు

లభించిన వెనుక తనయుద్దేశ్యము విజ్ఞాపనంబొనర్చి యనుజ్ఞ వేడిరి. శ్రీరంగనాథుఁడు నర్చకముఖముగా "యతిరాజా! నీయభీష్టము తప్పక నెరవేరును. సుఖముగాబోయిరమ్మ"ని యాశీర్వదించి యనుగ్రహించిరి.

మూడవగుచ్ఛము సమాప్తము.





# శ్రీ రామానుజ ప్రభావ కల్పకము.

## ఉత్తరభాగము. - నాల్గవగుచ్ఛము.

శ్రీయతిరాజులవారు భగవదాజ్ఞవడసి కోవెలనుండి మఠమునకు వేంచేసి శిష్యులలో గొందఱికి మఠమున భాగవత కైంకర్యమున్ను కోవెలలో భగవత్కైంకర్యమున్ను యేమఱక శ్రద్ధాభక్తులతో నొనర్చుచుండుడని యాజ్ఞాపించి కతిపయ శిష్యసమేతులై శ్రీకాంచీపురికి పయనమయిరి. మార్గమధ్యమున అష్టసహస్రమను గ్రామమున నిరువురాశ్రితులుండుటచే వారికొక పర్యాయము ప్రబోధమొనర్చి స్వరూపమును గాపాడుట యుచితమనితలంచిరి. వెంటవచ్చిన శిష్యులును నందుకు సంసిద్ధులైయుండిరి. కావున కొంతదవ్వు పయనము సాగించి యస్తమయసమయమున కష్టసహస్రినామ గ్రామ పరిసరమునందు నొకయారామమునకు వచ్చి చేరుకొనిరి. అప్పటికింకను రెండుగడియల ప్రొద్దుండుటచే శ్రీయతి

రాజులవారు "ఈయనగార సంపన్నవైశ్య డౌకడున్నాడు. అతడు కాంచీపురిని నిజసతీసమేతముగ కొంతకాలముక్రిందట పంచసంస్కారము మావద్ద పొందియుండెను. అతనిపేరు యజ్ఞేశుడు "మీరాతని కడకరిగి మారాక తెల్పుడు" అని యిరువురు శిష్యులనంపిరి యజ్ఞేశు డజ్ఞుడే గాక గురహంకారి. ఆచార్యాగమనవార్త వినిపింపవేంచేసిన యావైష్ణవోత్తము లిరువురు యతనిని గని ఫలమంతా త్రితనగాసంగి యాశీర్వదించి యాచార్యాగమనవార్తఁ దెలిపిరికాని, యతనావార్తవిని మొగము చిట్లించుకొని లోనికరిగి యెంతకాలము వేచియుండినను రాడాయె. శిష్యులిచట నిక కాలహరణముఁజేయరాదని విఫలమనోరథులై స్వాచార్యసన్నిధి కరిగిరి.

సహజ మదిరాపానమత్తులకు కైపుదిగువజకే విస్మృతి. ఐశ్వర్యాహంకారమదిరాపానమత్తులకో స్మృతి గలుగుట గగనకుసుమమే. ఇందుకు కారణము సుఖాభాసను సుఖమనుకొనియుండినభ్రమ. ఆసుఖానుభవము కేవల ద్రవ్యార్జన చేతనే కలుగుననునది మఱియొకభ్రమ. మితిమీరిన దురాశచే ద్రవ్యార్జనకై కొంతకాలము భూతద్రోహ మొనర్చుట. అది విఫలముకాగా, ఐశ్వర్యమదమత్తుల నాశ్రయించుట. ఆశ్రయణ మనుకూలమయ్యెనా, వారి సారూప్య, సామీప్య సాయుజ్యములు. ప్రతికూలమయ్యెనా క్షుద్రోపాయములు వెదకుచుండుట. తుదకు భగవన్నిగ్రహమున నిరయము నొందుట.

భాగవతనిగ్రహమున్ను కలిగెనా. యిక తద్దోషపరిణామము
క్రిమికీటకాది నీచాతినీచ జన్మములే నిరయానంతరము దెప్పు
ననుట శాస్త్రప్రమాణసిద్ధము. "అత్యుత్కటైః పుణ్యపాపైః
ఇహైవఫలమశ్నుతే" "పుణ్యపాపములు మితిమీరిన తత్ఫల
మిప్పుడనే యనుభవించుచున్నారు." అను ప్రమాణమున్నది.
భగవద్గీతాశాస్త్రమున శ్రీకృష్ణభగవానుడు దైవాసురసం
పద్విభాగయోగమున నాసురస్వభావము, తత్ఫలము యన్నిన
వ్యాజమున నఖిలజనులకుఁ దెలిపియు నుపగమింప్రను. ఈ
బోధామృత మద్వైతావస్థయను సోపానము గడచినవారికే
రుచించునుగాని యందుగడవనివారి కజీర్ణస్థితిలో భుజించుట వంటి
దేయగును. ఈసోపానమున నానావిధ ఉపద్రవముల ననుభ
వించి విసిగియార్తులైనవారికి అభిముఖ్యసోపానమొకటి యున్న
దని తోచును. ఈయాభిముఖ్య సోపానస్పర్శ కలుగగనే యా
ధ్యాత్మిక బోధామృతము చవిచూతమనుకోర్కె జనించును.
ఏసాత్త్విక ప్రారబ్ధానుభవమునో ఈ వైశ్యపోతకుఁడు
శ్రీరామానుజయతీంద్ర పదాబ్జము లాశ్రయించియుండెను.
కాని తామస రాజస ప్రారబ్ధవాసనలింకను ననువర్తించి
మనంబును తారుమారొనర్చుచుండెను. అందువలననే స్వా
చార్యాగమనవార్త వినియు, నుపేక్షతోనుండెను. అయి
నను భగవద్విశేషానుగ్రహరూప ప్రపన్నానుష్ఠానశాఖను
చేఁత వాడగుటచే "క్షిప్రంభవతిధర్మాత్మా" యను భగ

వ దాస్యైక్యము సార్థకమగునట్లు అనుతాపమునవోతుదకు లఘు కాలమునకో నితని భగవంతుడు బాగుపఱచును గాని కొందికి జారనివ్వడని మున్ముందు మనకే తెలియవచ్చును.

ఇంటికి రుదెంచిన నిరువురుభాగవతు లరుగువఱకు లోన నుండిన వైశ్యుడు వెలుపలికివచ్చిన వాడేగాదు. భాగవతులు తన యిల్లు దాటిపోయినసంగతి తెలిసికొని వెలుపలికి వచ్చెను. ఇప్పుడు గోసిపోవచ్చినవారిలో నొకరు "నీకొఱకెవరో యిరువురు శ్రీవైష్ణవస్వాము లింతవఱకు గాచియుండి నీవెంత కాలమునకును రాకుండుటచే విసుగుకొనుచు యిప్పుడే యరిగిరని పలికిరి. అందుకతడు "శ్రీవైష్ణవస్వాముల కేమి! రాహు కాలమువలె ననుదినము నెద్దియో యొకసమయమున రాపన్న మగుచునేయుందురు. బెల్లముండినచోట నీగల కేమికొదువ? ఇంటిపట్టున హాయిగబేరము చేసుకొనుచునుండకవ్వక నా భార్య కంచితిరునాళ్లకు బోవలయునని పొరుగమ్మగారి ప్రోత్సాహమున పట్టుబట్టడము, కంచితిరునాళ్ల జూపనంతట కబళము నోటబడుటయభావమని విధిలేకసమ్మతించి తిరునాళ్ల మూడునాళ్లు చూచిరానొప్పుకొని పిలుచుకొనిపోవడము, పోయినవారము కంచితిరునాళ్ల జూచి కొంపజేరుకొనక యొక శ్రీవైష్ణవమఠము జూడబోవడము, అచ్చట నొకసన్యాసిచే కొండలు తప్తశంఖచక్రముద్రలు భుజముల వేయించుకొనును

చుండుటదిజూచి వారివలె భుజములు కాల్చించుకొనిన నే వైకుంఠద్వారము మనకును దెరవబడుననియు, శాశ్వతానంద మానల బొందవచ్చుననియు చెప్పుడు మాటలువిని మా యిల్లాలు నాచెవికెక్కించుటచే నందుకు నేనొప్పుకొనక తప్పినదిగాదు. సన్యాసిచే ముత్తిముద్రి వేయించుకొని లేవబోవ నాయన మమ్ములనాపి చెవిలో నెవ్వియో మూడుమంత్రములు చెప్పుటయు, సన్యాసిని సత్కరించి, బ్రదుకు జీవుడా యని మఠము దాటి బయటపడుటయు జరిగినది. ఇంటికి వచ్చి చేరినదాది యడుగడుగునకు శ్రీవైష్ణవులదాడి చెప్పశక్యముగాకున్నది. "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" అను పెద్దలవాక్యము వ్యర్థము గాదని తోచుచున్నది." యని సందెదీపము వెలిగించుచు నింక నేమియో జెప్పబోవుచుండ పక్కలబేర మొక్కడినుండియో వచ్చుటచే మంచి గిరాకి యొక్కడ తప్పిపోవునోయని కాబోలు నొక్కనిమిషమైన నాగక గోచియూడి నేల జీరాడుచుండుట సహితము గమనింపక చెంతకువచ్చినవారిని గని చేటంత మొగముచేసుకొని "దయచేయుడు దయచేయుడు" అని పలుకుచు వారిని లోనికి గొనిపోయెను.

విఫలమనోరథులైన భాగవతులు వైశ్యుని వైముఖ్యము శ్రీయతిరాజులవారి సన్నిధిలో విన్నవించిరి. అప్పుడు శ్రీయతిరాజులవారు వారితో "సమాశ్రయణ కాలమందే యా వైశ్యునివైఖరి గమనించియుంటిని కాని సాధ్వియగునతని సతీ

మణి యనువర్తనముఁబట్టి యంగీకరింపవలసివచ్చెను. ఆను
పాలుఁ వేళ జిగిమూలుచెట్లు మరల మధుమాసమున జిగిరించక
పోవ్రగదాయఁ పలికి ద్విస్త్ర్యైపత్తిగలవాడని, భార్యమూల
మునకైనను కొంతవఱకు తెలివితేటలలవఱచుకొని సాధు
సత్కారమొనర్పు మందునని యింతదూరమువచ్చితిమి." మా
ధవార్చితముగ మనని మానవుసిరి వనదుర్గచంద్రికా వైభము
వంటిదే యగును. ఈరాత్రియింటేగడపుదము వేకువజాము
ననే మీరు శ్రీకాంచీపురికి పయనముగండు. మీలో నెవరై
నను నల్వురు నావెంట నుండిన జాలునని పలికిరి.

రాత్రి యారామ్యారామముననే వారందఱు గడిపిరి.
వేకువజామున నలుగురు శిష్యులు తప్ప తదితరులందఱు
శ్రీయతిరాజులవారి యనుజ్ఞవడసి శ్రీకాంచీపురి కరిగిరి. శ్రీ
యతిరాజులవారు వుదయమున నిత్య కర్మానుష్ఠానములు నిర్వ
ర్తించుకొని తిరువారాధన సంపుట్యాది సకల పరికరములతో
నచ్చటినుండి గ్రామములోనికి శిష్యులు వెంటరా బయలు దే
రిరి. గ్రామమున కొంతదూరమరిగినపిదప తమ కెదురుగ వచ్చు
చుండు నొకభూసురునితో శ్రీయతిరాజులవారి శిష్యులలో
నొకరు ద్రవిడభాషతో నేమియో యడిగిరి. ఆభూసురుడు
శ్రీయతిరాజులవారికి మ్రొక్కి యొక తాటియాకుల కుటీరము
వారికి జూపియరిగెను. యజమాని యింటలేని సమయము
గాబోలు! తడకతలుపుమూసి లోన గడియ వేయబడియున్నటుల

వోచెను. గృహయజమానిని శ్రీయతిరాజులవారి శిష్యులలో నొకరు "వరదాచార్యా" యని బిలిచిరి. లోనుండి యెవ్వరును బలుకలేదుగాని ముమ్మారు కరతాళధ్వని మాత్రము వినవచ్చెను. మనయతిరాజులవారా సంకేతము గుర్తెరిగి తమ తిరుమేనిపై గాషాయశాటినిగోడ యావలికి విసరివైచిరి. లోనికి శాటిని విసరివైచిన కొన్నినిమిషములకు తలుపు తెరవబడెను. తిలకము నొసటధరించిన యొకసతీతిలకము సౌందర్యవారాశివలె గన్పట్టుచు తలుపుగడియ దీసి వెలుపలికి వచ్చి, వైరాగ్యవారాశివలె గన్పట్టు శ్రీయతిరాజులవారిని వారిశిష్యులను గనుగొని ఆనందభక్తిసంభ్రమము లుప్పతిల్ల వినమ్రురాలై యంజలిజోడించి "మహాత్మా! లోనికి వేంచేయు"డని బలికెను శ్రీయతిరాజులవారును, శిష్యులును లోనఁ బ్రవేశించిరి. అపుడాయిల్లా లుల్లాసమున నొక కృష్ణాజినము గొనివచ్చి కార్పాసవృక్ష (ప్రతిచెట్టు) చ్ఛాదితమగు నొక తిన్నెపై నునిచి స్వాచార్యులనందుఁ గూర్చుండ బ్రార్థించెను శిష్యులకును నొకచాపవైచి కూర్చుండు డని వినమ్రయై బలికెను. ఆచార్యులును, శిష్యులును, నాసాధ్వీమణి సత్కారమునకు సంతసించుచు నాతిన్నెపై సుఖోపవిష్టులైరి. శ్రీయతిరాజులవారపుడామెతో "అమ్మా! నీభర్త వరదాచార్యు లెచ్చట" యని యడుగ స్వామీ! దేవర వారిగుడిసెకు వేంచేయుటకు కొంచము ముందుంఛవృత్తికై (భిక్షకై) యరిగిరి. అపరా

స్థా వేంచేసియుండురు. ఈ దాసికి దేవరవారిని దేవస్థలవం యీభాగవతోత్తములను దర్శించు భాగ్యము నేటికివచ్చినది దేవరవారి నాశ్రయించి బహుకాలమయ్యు ప్రారబ్ధశేషముగ ప్రబలదారిద్ర్యబాధ యీగుడిసెదాటి దేవరవారి దర్శ మొనర్ప నవకాశమిచ్చినదికాదు. కుంటివారిపై శ్రీ భాగీరథి వారలి ప్రవహించి ప్రనీతులఁ గావించినట్టుల దేవరవారి యవ్యాజకృపా ప్రవాహ మీనాటికీదాసదంపతుల ధన్యుల గావించినది" యని ప్రార్థవాక్యజూచి "పెరుమాళ్ళ తళిహైకై కాలాతీతముగాకుండ యథోచితకైంకర్య మొనర్ప దాసికనుజ్ఞ నొసంగు"డనగనే, శ్రీయతిరాజులవా రాసాధ్వీసుధామధు రోక్తుల కలరి. "మంచిదటులనే కాని"మ్మని బలికిరి. ఇటుల శ్రీయతిరాజులవారి యనుజ్ఞ వడసి యామె లోనికరిగెను. తిన్నెపైనుండు ప్రత్తిచెట్టు గుబురుగా బెరిగియుండుటచే శ్రీయతి రాజులవారును, శిష్యులును, విశ్రమించుటకు మిక్కిలి యను కూలముగనుండెను. శిష్యులాకలిబాధ మఱచి శ్రీ శఠగోప దివ్యప్రబంధములోని యమూల్యబోధామృతమును యాచా ర్యులవారనుగ్రహింప శ్రోత్రాంజలులచే ద్రాగుచుండిరిగాన పెరుమాళ్ల తళిహై యాపరమసాధ్వి పరమభోగ్యముగ నొన ర్చుటకు వలసినంత యవకాశముగూడలభించెను. పెరటిలోని బావినీరుచేదుకొని పోవచ్చిన యొకనారీమణి నీటిబిందె (చంక నిడుకొని పోవుచు లోనికితొంగిచూచి "నాంచారమ్మా! మీ

యింటికి కంచి స్వాములెవరో వచ్చియున్నారే. వంట వాళ్ళులోనవున్న నింకను స్నానము చేసినట్లు లేదని కోప్పరించి వెడలెను. గాని వంటకు వలసినన్ని పరికరము లోనకూర్చ వలసియుండునుగదా.

నాల్గవగుచ్ఛము సమాప్తము.





# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - ఐదవగుచ్ఛము.

### అష్టసహస్రగ్రామమందున శ్రీమతి నాంచారమ్మగారి గురుభక్తి వైభవము.

అష్టసహస్రనామ గ్రామమున నాబాలగోపాలములీ శ్రీమతి నాంచారమ్మ నెఱుంగనివారరుదు. వారింటిలో నన దినంబును హరిభజన జరుగుచుండెడిది. మోడుమ్రాకుల సైతము చిగిర్చునటుల కలకంఠకలనాదమును మించిన కోమల కంఠస్వరమున శ్రీమతి నాంచారమ్మ భగవత్సంకీర్తన మొనర్చుచుండెడిది. ఆమెభర్తయు నాటికనుగుణముగ దాళము వేయుచుండుట వాడుక. ఈపాటలు విన పలువురు వారి ముంగిటం జేరుచుండిరి. భక్తిగలవారు నలుగురు జేరిన రక్తిగల వారు నలుబదిమంది జేరుట సహజమేగదా! రక్తి యెవరి యందుండదేమో! శ్రీ నాంచారమ్మ రూపలావణ్యాదుల దర్శించు

టుందును, కోకిలస్వరమున, నామె పాడు పాటలను వీనుల
విందుగ వినుటకుం దనుగల యనురక్తియే పలువుర రసిక
వరుల నాకర్షించుచుండినది. ఎందరో భక్తులాడంబరులను
కనకరత్నమయ భూషణంబులను చీనీచీనాంబరములనుం దెచ్చి
యియ్యఁబోయినను గాఢవైరాగ్యయుతులగుటచే వారెవ్వి
యు నాశింపకుండిరి. కేవల గ్రామ్య సుఖేచ్ఛాపరతుత్రై
శృంగారశృంఖలలఁ దగుల్కొన్న శునకప్రాయులు కొందఱా
పరమసాధ్వి పాతివ్రత్యము జెరుపఁ జూచుచుండిరి. భోగలాల
సుడై ద్రవ్యమును తృణప్రాయముగ జూచు నొక సంపన్న
వైశ్యుడు జ్ఞానలాలసుడై ద్రవ్యమును తృణప్రాయముగఁ
జూచు నరుంధతివంటి యాసతీమణికడకు తనకోర్కె నీడేర్ప
పరిచారికలెందరితోనోఁ జెప్పి పంపుచుండుటఁ గమనించి
యాకసమున నరుంధతివలె నామె వారికంటికే యగుపడకుండ
గాలముఁ బుచ్చుచుండెను.

ఈవిషమకాలమున శ్రీమతి నాంచారమ్మగారింటికి
శ్రీయతిరాజులవారి యాగమనము తటస్థించి యామె మనో
దార్ఢ్యమును కొంత సడలించెను. ఈదినమా మానినీమణి
శ్రీయతీశ్వర భిక్షకై తన యామలిన దేహము నామలినవ్యాద
యున కొకరాత్రి యొప్పగించియైన ద్రవ్యము సేకరింపక తీరదు"
అని నిశ్చయించుకొని తనయింటినుండి కొంతదవ్వరిగి" అగ్ని
సాక్షిగ పెండ్లాడిన భర్త ను వంచించి యధోగతిపాలొనరిన

నారికి కడగోగతియే గదా" యని పాపమునకు వెఱచి మఱల నింటివంక మరలి కొన్నియడుగులిడి "నీటిబుగ్గవలె క్షణభంగురమగు నీమలినదేహముపై యభిమానముచే మనుజలోకము నుద్ధరింప నవతరించిన శ్రీశేషాంశసంభూతుడగు నీయతీంద్రు నుపేక్షించుటకన్న నాత్మకధోగతి వేఱొకటి కలదా" యని మరల మనంబు సమాధానపఱచుకొని కడువడిగ వైశ్యు నింటికరిగి యతని ముంగిటిగదియొద్ద నిలిచెను. తలవంచుకొని యొంటరిగ తప్పు లెక్కలు వ్రాయుచుండిన యతడడుగుల చప్పుడువిని లెక్కలు పరిశోధింప వచ్చిన ప్రభువర్గమువారే మోయని యులికిపడి తలయెత్తిచూచెను గాని వచ్చినది తాను వలచిన వనితామణియేయని తెలిసి మురియుచు లేచి యామె చెంతకు వచ్చెను. అప్పుడు వైశ్యునకు వనితామణికి నీక్రింది విధముగ సంభాషణ జరిగినది.

వైశ్యుడు- నేడు నీయపూర్వాగమన మాశ్చర్యానందముల గొల్పుచున్నది. కారణమూహింపజాలకున్నాను.

నాంచారమ్మ- కాలము మారుచు రాగా మనంబును మారు చుండుట సహజమేగాని నాకొఱకై వేళపాళలు గుర్తెఱుంగక తొందరపడి చెప్పిపంపుటలోగలుగు ప్రమాదస్థితులు నీవు గమనించినట్లులేదు.

వైశ్యుడు- (చిరునగవుతో) "కామాతురాణాం నభయంనలజ్జా" అని గదా నీయభిప్రాయము. నీవొకమారు తల

యుంచి సమయము దెలిపియుండిన పలుమారులు మను
కు చెప్పిపంపుచుండును.

నాంచారమ్మ- మాయింటికి అయిదుగురు మీరాకొనిబంధు
వులు వచ్చియున్నారు. ఇంట చేరెడు గింజలుగాని
చేతనొక చిల్లిగవ్వగాని లేదు. ధనవంతులకు దరి
ద్రులకష్టము లెట్లు దెలియును?

వైశ్యుడు- నాపై నీదయయుండవలయునుగాని ద్రవ్యమునకా
కొరత. ఎందఱకు సామగ్రి కావలయును?

నాంచారిమ్మ- ఏడ్వరికి.

వైశ్యుడు- పిచ్చిదానా! ఎంత యమాయకురాలవు. బంధువు
లయిదుగురు, నీవు, నీభర్తయునని గదా నీయభి
ప్రాయము. ఇంత యమాయకురాలవు గనుకనే
యింతటి దారుణ దారిద్ర్యబాధ ననుభవించుచు
న్నావు. నీవిల్లు చేరులోపలనే వచ్చినంత పదార్థ
ము మీయిల్లుచేరును కానినాసంగతియేమి?

నాంచారమ్మ- నేటిరాత్రియే యనిబలుకుచు కడువడిగా నిల్లు
జేరెను. ఆమె తనయింటిలో నడుగిడెనో లేదో
యొకబండి వచ్చి దొడ్డివాకిటివద్ద నిలిచెను. నాల
దినములుపయోగించుకొనినను నింకను మిగిలి
యుండునంత పదార్థము వైశ్యుడు పంపియుండెను.

పాఠకమహాశయులారా! చూచితిరా! కలి

కాలమున కామినీకాంచనములకున్న మహిమ! కా
వుననే శ్రీమదాంధ్ర మహాభారతమున "అన్న
విక్రియమొనరింతు రఖిలజనులు వేద విక్రియ
మొనరింతు రి విబుధవరులు, పణ్యామోనుల జరి
యింతు రి పద్మముఖులు, కష్టతరమైన యిక్కలి కా
లవేళ" యను పద్యమున నీకలికాలపరిస్థితులు తె
లుపబడియున్నవి. మరియొకగ్రంథమున "ధర్మార్థ
కామమోక్షములను నాలుగు గణువుల చెరుకు
గడలో మొదటితుది గణుపులగు ధర్మమోక్షములు
సారహీనములనియు, మధ్యగణువులగు నర్థకామ
ములే సారవంతములనియు, కుత్సిత రసాస్వాదన
తత్పరులు జలంతురనియు తెలుపబడియున్నది.

ఆ కాంతాతిలకము కాలాతీతముగాకుండ పెరుమాళ్ల
తళిగ (వంట) సిద్ధపరచి శ్రీయతీంద్రులవారదివఱకే
శిష్యసహితులై యాగ్రామపరిసరముననుండు నొకతటాకమున
నిత్యకర్మానుష్ఠానము నెఱవేర్చుకొని వచ్చియుండిరి కావున
వారు భగవదారాధన మొనర్చి శ్రీపాదతీర్థము, పెరుమాళ్ల
తీర్థము, ఆశ్రితబృందమున కొసంగిరి. శ్రీమతి నాంచారమ్మయు
శుచిత్వ, భోగ్యత్వయుతమగు పాయసాపూపాది పదార్థము
లచే యాచార్యులవారిని భాగవతులను పరితృప్తులఁ గావించె
ను. శ్రీమతి నాంచారమ్మగారి భర్తయగు శ్రీవరదాచార్యుల

వరాహ్ణావేళకిల్లుజేరి శ్రీయతిరాజులవారిని, వారిశిష్యులను గని, పట్టరానియానందమున వారికి ప్రక్రమ ప్రణామాభివాదనాను లర్పించి యంజలిబద్ధులైనిలువ శ్రీయతీంద్రులు "వరదాచార్యా! శ్రీవరదరాజానుగ్రహముచే నీభార్య యత్యాదరమున మమ్మా రాధించి మాకత్యంతానందము గూర్చినది. నీవును శ్రీ పాద తీర్థమును పెరుమాళ్ల తీర్థమును స్వీకరించి యారగింపుము. ఇప్పటికే కాలాతీతమైనది" యని యనగనే "దేవరవారిని, యీభాగవతోత్తములను దర్శించినంతనే దాసుల కాకలి దప్పులు దీరినవి. దేవరవారి శ్రీపాదసంస్పర్శచే నీగుడిసె పావనమైనది. బహుకాలార్జిత పాపపుంజమంతయు పటాపంచలై అనిష్టపరిహారమైన నపవర్గములభింప నభ్యంతరముండదుగదా. ఇంతకన్నను నీదాసదంపతులకుఁ గావలసినదేదియని వినయ మున బలికి వారియనుజ్ఞవడసి లోనికరిగి భార్యవలనఁడి యా రాధనోపాయాద్యఖిల వృత్తాంతములు విని యత్యంతానంద మునొంది "నీవు నిక్కముగ నన్నుతరింపచేయ నవతరించిన సత్యదేవతవుగాని నాసతీమణివిగావు ఇంతటి నిరభిమాన నిరుపమాన త్యాగము కరుణామయులగు శ్రీయతిపతుల య వ్యాజ కటాక్షమునను, సాక్షాచ్ఛ్రీయనంతాంశజులగు మన యాచార్యులవారి పరిపూర్ణానుగ్రహమునను లభించినదియని బొప్పము లొలుకబలికి శ్రీయతీంద్ర శ్రీ పాదతీర్థము పెరు మాళ్లతీర్థము స్వీకరించి భగవద్భాగవతాచార్య భుక్త శేషము

సత్యాదరభావమున నారగించిరి. భర్త యారగించిన వెనుక యాయన "నియమనముచే" శ్రీమతి నాంచారమ్మయు నార గించెను.

సాయంసమయమువఱకు శ్రీయతిరాజులవారి సన్నిధిలో నాదంపతులు భగవద్భాగవతగుణామృతము తనివిదీర ననుభవించిరి. శ్రీయతిరాజులవారును, శిష్యులును సాయంకాల భగవదాజ్ఞావిధులు ముగించుకొనిరి. రాత్రి భగవదారాధనయు, శ్రీయతీంద్రులకు ఫలోపహార సకలోపచారములు ము గిసినవెనుక కొంతకాల మాచార్యసన్నిధిలో నాదంపతులు స్వాహావగ్రింథకాలక్షేప మొనర్చిరి శ్రీ యతిరాజులవారు, "వరదాచార్యా! శ్రియఃపతి యనుగ్రహముచే నేడు మీ గృహమున ఆరాధన తృప్తికరముగ నెఱవేరినది. మీరిరువురు నార్యభావముచే మిక్కిలి యలసియుందురు. పోయి శ్రమింపుఁడని గనె దేవర వారి దివ్యసేవచే యీనాడు సమ్మదిగ కాలము గడిపి ధన్యులమైతిమి. శ్రమయావంతయు గానవచ్చుట లేదు అని దండము సమర్పించి యాదంపతులు శ్రీయతిరాజుల వారి "నియమనము" బొంది, లోనికరిగి, తలుపులుమూసి గడియవాకిరి. శ్రీయతిరాజులవారును శిష్యులును ముంగిటి వసారాలో నుచితస్థలమున విశ్రమించిరి. ఆవల శ్రీ వరదాచార్యులు భార్య వైశ్యునికొసంగిన వాగ్దానము జ్ఞప్తికిదెచ్చుకొని భార్యను హెచ్చరింప, నామెయు భర్తపాదపద్మములకు

ప్రారంభిల్లెను. వారిరువురును, స్వాచార్య తీర్థప్రసాదములు గాని దొడ్డితలుపు మూసికొని సందుపీధిలోనుండు వైశ్యునింటికి పోయిచేరిరి.

వైశ్యుని భార్య పుట్టినింటి కరిగి యుండినది. అతని వృద్ధ మాత తప్ప నొరు లెవ్వరును నింటలేరు. కొమారుడు భు జించినవెనుక తల్లి లోని కరిగి తలుపులు మూసికొని గడియ దాపి, నిద్రించుచుండెను. కాలాతీతమగుటచే నాసందుపీధిలో మనుష్యసంచార మాగియుండెను. బయటి వసారాగదిలో వైశ్యుడు భోగైకచింతాపరుడై తాను వలచియుండిన వనిత నత్తరు వాసనలచే నాహ్వానించుచుండినట్లగపడెను. వైశ్యుడు శ్రీవరదాచార్యులఁ గని విస్మితుడై విధిలేక గూర్చుండుడని పలికి లోనికరిగి కాంతకు కనుసంజ్ఞజేసెను. ఆమె లోనఁ బ్ర వేశింపగనే యతడు తలుపుమూసి గడియదాపబోగా "గడియ వేయ నవసరములేదు. నాభర్త నీకు మా యాచార్య తీర్థ మొసంగి పోవవచ్చియున్నాడు. తీర్థప్రసాదములు స్వీకరించిన వెనుక గడియవేయవచ్చునని యామె బల్కె. ఉదయమున నామె యింటికి వచ్చినవారు గురువులని యపుడు తెలిసికొని, యామెచేతనుండు బుట్టినిగైకొని యందు పరిమళించు నదేది యని చూడబోయెను. అపుడామె యాతని యాతురముగని, "ఇది మాయాచార్యులారగించిన ప్రసాదమని కొంత దీసి యాతని చేతిలో నుంచెను. అతడు తాను నోటిలోనుంచుకొని

మింగిన ప్రసాదము కడుపుచేరెనో లేదో కామాంధకారము
మాటు మాయముకాగా నతడు "తల్లీయపరాధిని రక్షింపు"మని
యామె పాదములపై వ్రాలి విస్మృతుడయ్యెను. మరల
స్మృతివచ్చి చూడ శ్రీమతి నాంచారమ్మ, ప్రసాదపు బుట్టిచే
బూని తలుపువద్ద నిలిచియుండెను. ఆమె చెంతనే తీర్థపాత్రతో
నామె భర్తయు నిలిచియుండెను. అప్పుడా వైశ్యుడు శ్రీ వరదా
చార్య పదాంబుజములపై వ్రాలి "మహాత్మా! మీరును,
మీ సతీమణియు నాబోటి కామాంధకారకూపపతితుల
రక్షింప నవతరించిన దివ్యదంపతులగు శ్రీవరదరాజ పెరుమా
ళ్లను శ్రీ పెరుందేవితాయార్లుగా నిమరొకరుగారని యీదీనా
ధమున కిప్పుడు స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. కామాంధ
కారముచే కన్నుగానక, కన్నతల్లివంటి కాంతాశిరోమణి పాతి
వ్రత్యముఁ జెరుపఁబూనియుంటిని. ఈయధమాధమునకు మీ
యుభయుల శ్రీపాదములే శరణ్యము" అని దీనుడై ప్రార్థింప
జొచ్చెను. శ్రీవరదాచార్యులతని కపుడభయమొసంగి చెంత
కూర్చుండబెట్టుకొని, "అయ్యా! పూర్వజన్మప్రారబ్ధశేషమెంత
వారికైన ననుభవింపక తీరదు. అవివేకమున జరిగిన కార్యముల
కనుతాపమే ప్రాయశ్చిత్తము. ఇకముందిట్టి ప్రమాదములకు
గురిగాకుండ మా యాచార్య శ్రీపాదతీర్థము కాపాడును. స్వీ
కరింపు"మని యతనికి స్వాచార్య శ్రీపాదతీర్థము ముమ్మాఱొ
సంగిరి. శ్రీపాదతీర్థము స్వీకరింపగనే యతనికి మరింత జ్ఞానోద

యమై, "మహాత్మా! ఈదీనుని మీ యాచార్యపదాబ్జము లాశ్రే
యింపజేయు"మని ప్రార్థించెను. శ్రీవరదాచార్యులవారు "ఉద
యమున యాపని తప్పక నెరవేఱును. నీవిక నిర్వికారముగ
నిద్రింపు"మని పలికిరి. అపుడా వైశ్యదంపతులు గొంతదూ
రము సాగనంపి, వారి యనుమతి నిల్లుజేరుకొని తనయపరా
ధములనుదలంచుకొని పశ్చాత్తాపములనొందుచు తుదకొకనిష
మగు కలతనిద్రకు లోనయ్యెను. ఆదంపతులును శ్రీయతీంద్ర
శ్రీపాదతీర్థప్రసాద ప్రభావమునను గొనియాడుచు ప్రొద్దైనాకిట
నిల్లు జేరుకొని సుఖముగ నిద్రించిరి.

మఱుదినముదయమున, పరోజ్జీవన తత్పరులును, పరమ
భాగవతోత్తములును నగు శ్రీ వరదాచార్యులవారు వైశ్యు
నింటి కరుగువఱకే యతడు స్నానసంధ్యలు ముగించుకొని
యాకలిగొన్న క్రొప్పునైవడి యాచార్యులవారికొఱకై యను
క్షణమును నిరీక్షించుచుండెను. అతడు వారిని గన్నంతనే
యంజలిఘటించి ప్రోత్కంఠుడై నమస్కరించి యుచితాసన
మున నుపవిష్టులఁ గావింపబోవ వారతనితో "ఆవంతయు నవ
కాశము లేదు. రెండుఘడియలలోఁగా మాయింటికి రమ్ము,
ఇంతలోనే ఇంటికరిగి ఆచార్యసన్నిధిలో కైంకర్యమొనర్చు
చుండెదను" అని పలికి వైశ్యుడు శ్రీయతీంద్రుల నాశ్రయించు
టకు వలయు పరికరము "లివి" యని తెలిపి, శ్రీవరదాచార్యులు
స్వగృహమున కరిగిరి. శ్రీరామానుజయతీంద్రులను తత్పాదా

శ్రోతులును భగవదాజ్ఞాదిభులు నెఱవేర్చుకొని, భగవద్గుణా నుభవ మొనర్చుచుండిరి. శ్రీవరదాచార్యులును వారి పత్నియగు శ్రీమతి నాంచారమ్మయు, పత్తిచెట్టు తిన్నెపై మృదాస్తరణమున ప్రశాంతచిత్తముతో నుపవిష్టులైయుండు శ్రీయతిరాజులవారి సన్నిధిలో సేవించి యంజలి బద్ధులై నిలుచుండ వారు వారికుపరి నాశీర్వదించి తమసన్నిధిని గూర్చుండబెట్టుకొని కొన్నిదర్శన రహస్యము లనుగ్రహించుచుండ వైశ్యుడు, పంచసంస్కారములకు వలయు పరికరములతో లోనికి వచ్చి శ్రీయతిరాజులవారికిని, శ్రీ వరదాచార్యాది తత్పదాశ్రితులకును, సాష్టాంగ ప్రణామము లర్పించి తాను దెచ్చిన ఫల పుష్పాదుల శ్రీవారిసన్నిధిలో సమర్పించి యంజలి బద్ధుడై నిలుచుండెను. అపుడు శ్రీ వరదాచార్యులవారు, స్వాచార్యులతో "మహాత్మా! ఇతడీగ్రామమున నొకవైశ్యుడు,ఉపపత్తియు నుదారతయుగలవాడు. బహుమృదు స్వభావుడు. ఇతడు దేవరవారి శ్రీపాదము లాశ్రయింపనుండి దాను నందుకు ప్రథమకార మొనర్ప బ్రార్థించియుండుటచే నందుల కియ్యకొని ఈయాత్మను సంరక్షించుటకు దేవరవారిని ప్రార్థించుచున్నాడను" అని విజ్ఞాపనం బొనర్పగనే "మీరు పేర్కొనిన సుగుణ సంపత్తి యితని వర్తనముననే దెలియవచ్చుచున్నది. మీవంటి వారిని ప్రేమవిశ్వాసములచే నాదరించుటయే, భగవన్ముఖోల్లాసమునకు హేతువగును" అని శ్రీయతిరాజుల వారతని

నుచితస్థలమున గూర్చుండ నియోగించి "అయ్యా! ఇట్టి భాగ వతులయెడ నపచారలేశమును జేయక నను దినంబును యను వర్తించుచు అర్థకామపరుఁడవైయుండక భగవత్పరుఁడవైయుండ వలయును, దేవతాంతరభజనముగాని, దేవతాంతరనిందా తిర స్కారముగాని లేకవర్తింపవలసియుండును. అశాశ్వత, అత్య ల్పభోగాభాసకు జిక్కిన, శాశ్వతమై యపరిమితమగు ఆనంద ము ఆనందనిలయమున ననుభవించు భాగ్యము గోల్పోవుటే గాక అపరిమిత యమయాతనలు, నీచాతినీచ జన్మపరంపరలు అనుభవింపవలసి యుండును. పంచసంస్కారము లభించిన వెనుక నీవిషయము విపులముగ బోధింపబడు"నని వాకృచ్చి నంతనే, "మహాత్మా! దేవరవారి దర్శనమాత్రముననే దాసుఁడు ధన్యుఁడుకాగలఁడని ధైర్యమంకురించుచున్నది. అటుపై తలి దండ్రులవలెనే యాదివ్యదంపతులు దాసునిపై ప్రతివాత్స ల్యముచే స్వరూపజ్ఞానము వృద్ధినొందఁ దోడ్పడుచుండురు. దాసునికడ తేర్పు భారమిక దేవరవారిదే"యని యతిదైన్యముగ విజ్ఞాపనంబొనర్చెను. ఆచార్యులవారును "ఆనమ్మకమే గా వలసినది"యని సుముహూర్తమానాఁడే యాదృచ్ఛికముగ లభించుటచే నావైశ్యోత్తమునకు పంచసంస్కారాది సకల హి తము లనుగ్రహించి ధన్యుని గావించిరి. అటుపిమ్మట అను వర్తన క్రమమును తెల్పిరి. ఆవైశ్యోత్తముఁడును సంతుష్ట స్వాం తుఁడై యాచార్యులవారిని, భాగవతబృందమును నుచితరీతి

పత్కరించెను. ఆనాడు భగవద్భాగవతాచార్యారాధన బహు
తృప్తికరముగ నెఱవేరినది. మఱుదిన మిదివరలో శ్రీ యతిరా
జులవారి నుపేక్షించియుండిన యజ్ఞేశుడను వైశ్యుడును నిజ
సతీమణిచే యాచార్యపరిభావమును, భాగవత పరిభావమును
బాగుగా నెఱింగి, యామె ప్రోత్సాహ పురుషకారముచే
శ్రీయతిరాజులవారి సన్నిధికివచ్చి ప్రదక్షిణ ప్రణామము లొ
నర్చి తాను గొనివచ్చిన పూజాద్రవ్యము లర్పించెను. అతని
భార్యయు శ్రీరామ కైంకర్య ముపేక్షించుటచే కినుక బూనిన
శ్రీలక్ష్మణస్వామి సన్నిధిలో, శ్రీసుగ్రీవుని యపరాధము క్ష
మించి యేలుకొమ్మని ప్రార్థించిన తారవలె, తాను భర్త
తప్పులు క్షమించి యేలుకొమ్మని ప్రార్థించెను. ఆ రామాను
జులే యీ రామానుజులగుటచే దాసునితప్పులు దండముతో
సరిపోయెనను సామెత ననుసరించి యతనితో "నీవీవరదా
చార్యులను అతనిపత్నిని మాకు మాఱుగా యపచార రహిత
కైంకర్యములతో ననువర్తించుచు వారినుండి స్వరూప జ్ఞాన
ముల పొందుచు, నూతనముగ పంచ సంస్కారసంపత్తి
లభించిన నీవైశ్యోత్తమునితో సహపాఠిగనుండుమని నియమించి
వారందరిని నాశీర్వదించి మఱుదినముదయముననే శిష్యసమే
తులై శ్రీయతిరాజులవారు శ్రీకాంచీపురికి వేంచేసిరి.

ఐదవగుచ్ఛము సమాప్తము.



# శ్రీ రా మా ను జ ప్ర భా వ క ల్ప క ము.

## ఉత్తరభాగము. - ఆరవగుచ్ఛము.

### శ్రీకాంచీపురి తిరుమలయాత్రలలోని శ్రీయతిరాజులవారి ప్రభావము.

శ్రీమద్రామానుజ యతీంద్రులు శ్రీకాంచీపురి కరుదెంతురనువార్త శ్రీవారి శిష్యులమూలమున నఖిలభాగవతులకును యిదివఱకే తెలిసియుండినందున, ఆచార్యదర్శనమునకై చాలకాలమునుండి యువ్విళ్లూరుచుండిన వారందఱు వారి రాకకై యనుక్షణమును నిరీక్షించుచుండిరి.

వేగవతీనదిలో నెవ్వరో కొందఱు శ్రీవైష్ణవస్వాములును, ఒకయతీశ్వరుడును, స్నానసంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తించుకొనుచుండఁ జూచితిమని, ఉదయముననే నదినుండి తీర్థముగొనిరా నరిగియుండిన నారీమణు లనుకొనుచుండ నిదివరకే యాగ్రామమునకు వచ్చియుండిన శ్రీ రామానుజ

శిష్యులు కొందరా వార్తవిని తమయాచార్యులే వచ్చియుందు
రని నిశ్చయించుకొని మిగతశిష్యుల కీవార్త దెలిపి, అందఱును
గుమిగూడి వేగవతీనదివద్ద కరిగిరి. వారు నిశ్చయించియుండి
నటులనే కొందఱు యతీంద్రశిష్యులును, శ్రీయతీంద్రులును
వారికగపడగనే యాచార్యులకును భాగవతులకును ప్రణ
మిల్లి యంజలిబద్ధులై నిలిచిరి. తమరాక గ్రామములోని భక్తుల
కు భాగవతుల కెఱుకపఱుప్రమని యాచార్యులవారు "నేమన"
యొసంగగనే శిష్యులలో కొందఱు పోయి శ్రీవరదరాజస్వామి
కోవెలయధికారులకును, భాగవతోత్తములకును శ్రీవారి రాక
దెలియపరిచిరి, శ్రీవరదరాజస్వామివారి యర్చక, పరిచార
కులు ఆలయాధికారి యనుజ్ఞచే నొకపల్లకిలో శ్రీశఠారిని
వేంచేపుచేసికొని భాగవతబృందముతోను, మంగళ వాద్య
ములతోను, వెడలి వేగవతీనదీతీరమున శిష్యసమేతులను
శ్రీవారిని దర్శించి సాష్టాంగ ప్రణామము లర్పించి యంజలి
బద్ధులై నిలుచుండిరి. శ్రీవారు పల్లకికి ప్రదక్షిణ మొనర్చి,
శ్రీశఠారిసన్నిధిలో దండము సమర్పించిరి. శిష్యులును అటులనే
యొనర్చినవెనుక ఆలయాధికారులతోను, యర్చక పరిచార
కులతోను, భాగవతులతోను, యోగక్షేమములు ముచ్చ
టించి భగవద్భాగవతాచార్య కైంకర్యసమృద్ధినిగుఱించి విని
మిక్కిలిసంతసించిరి. కోవెల కైంకర్యపరులు శ్రీశఠారికి హారతి
సమర్పించి శ్రీయతిరాజులవారిని వారిశిష్యులను నుచితరీతి

సత్కరించిరి. శ్రీకరాదివెంట శ్రీవారును, శిష్యులును, వేం చేయుచుండ వేదప్రబంధ పారాయణములతోను, మంగళ తూర్యారావములతోను శ్రీవరదరాజ పెరుమాళ్ల సన్నిధిలో నికి, ఆలయాధికారులు వారినందరిని వెంచేపుచేసుకొని పో యి, వొకవిశాల భవ్యమంటపము జూపి, అందుండ బా ర్థించిరి శ్రీవారును శిష్యసమేతులై యా దినమప్పటనే విశ్ర మించిరి. మరుదినము దయమున శ్రీయతిరాజులవారు భగవదా జ్ఞావిధులు ముగించుకొని, తమ యాధ్యాత్మిక జ్ఞానవృద్ధి కెుత్త మో నుపకరించిన శ్రీతిరుకచ్చినంబి కాంచీపూర్ణుల)గారిని దర్శింప, వారును శ్రీయతిరాజులవారి రాక కానందాంబుధి మగ్నులై శ్రీవారి నుచితరీతి సత్కరించిరి.

శ్రీకాంచీపూర్ణులు, శిష్యసహితులగు శ్రీయతిరాజుల వారును, శ్రీవరదరాజస్వామివారిని సేవించుకొన దలంచి, శ్రీ అనంతపుష్కరిణిని దర్శించి తీర్థము శిరమున జల్లుకొని ఆచమన మొనర్చి, బలిపీఠధ్వజస్తంభములకప ప్రణమిల్లి శ్రీపుణ్యకోటి విమానమునకు బ్రదక్షిణమొనర్చి, శ్రీ శ్రీకరి గి రీశుని మందిరంబుజొచ్చి, యాదివ్యమంగళమూర్తి నాపాద మస్తకము కన్నులకరవుదీర సేవించి, నుతించి తాము గొని వచ్చిన ఫలపుష్పాది పూజాద్రవ్యములు సమర్పించిరి. అర్చ కులు వారు గొనివచ్చిన ద్రవ్యములచే శ్రీయుఃపతి నారా ధించిరి. ఉత్తరసీరాజనమర్పించుతరి శ్రీయతిరాజులవారు

శ్రీకరిగిరీశుని పలువిధముల నుతించి మంగళాశాసనం బొనర్చిరి.
ఆరాధనానంతరము శ్రీయతిరాజులవారిని, వారిశిష్యులను
శ్రీతిరుకచ్చినంబిగారిని యర్చకులు తీర్థ, శఠగోప, ప్రసాద
ములచే నుచితరీతి సత్కరించిరి. శ్రీపెరుందేవీతాయారు సన్ని
ధిని కూడ ఆరాధన జరిగినవెనుక ఉచిత సత్కారములు శ్రీ
యతిరాజులవారు స్వీకరించిరి. తాయారుసన్నిధి నిటుల సేవ
ముగించుకొని శ్రీలక్ష్మీనృసింహస్వామిసన్నిధిలోను, ఆళ్వారా
చార్యుల సన్నిధులలోను, ఆయా దివ్యమూర్తుల యారాధనా
సమయమున నుచితరీతి మంగళాశాసనంబొనర్చి, యనుజ్ఞ
వడసి శ్రీకాంచీపూర్ణ "నేమనము" బొంది శ్రీయతిరాజులవారు
తాము విడియుండిన స్థలమునకు వేంచేసి విశ్రమించిరి. మరు
దిన ముదయమునను భగవత్సన్నిధులలోను ఆళ్వార్ల సన్నిధు
లలోను సేవనొనర్చి కొంతకాలము శ్రీకాంచీపూర్ణుల సన్ని
ధిలో భగవద్భాగవతగుణానుభవముచే గడిపిరి. శ్రీకాంచీపూ
ర్ణులును దేశాంతరగతుడగు పుత్రుని బహుకాలమునకుచూచి
యానందించు తండ్రివలె, శ్రీయతిరాజులవారిని జూచినదాదిగ
ఆనందాంబుధి నోలలాడుచుండిరి. శ్రీరంగమున భగవద్భాగ
వత వైభవమును గుఱించియు, తామష్టసహస్రగ్రామ గ్రామ
మున శ్రీవరదాచార్య గృహమున త్యాగశీలయగు తత్పత్నిచే
బొందిన సత్కారవైభవమునుగుఱించియు, శ్రీకాంచీపూర్ణు
లకు (తిరుకచ్చినంబి) వినిపించి సంతోషస్వాంతులంగావించిరి.

మూడవ దినంబునగూడ భగవద్భాగవత సన్నిధుల సేవించు
కొని ఉచితసత్కారములు వడసిరి. శ్రీకాంచీపూర్ణుల "నేమన
మున" భగవద్భాగవత ముఖోల్లాసముగ శ్రీశఠగోప దివ్యప్ర
బంధములోని కొన్ని పాశురములకు వ్యాఖ్యముగ విశేషార్థ
మనుగ్రహించి, ఆళ్వార్ల ప్రభావమత్యద్భుతముగ నుపన్య
సించిరి. శ్రీకాంచీపురిని శ్రీయతిరాజులు వేంచేసియుండిన
మూడుదినంబులలో నచ్చటి భాగవతుల యానందము వా
చామగోచరము. ఇట్టుల మూడుదినంబులు గడిపి శ్రీయఃపతుల
యొక్కయు, శ్రీకాంచీపూర్ణుల యొక్కయు యనుజ్ఞ వడసి
శ్రీయతిరాజులవారు శ్రీకాంచీపుర పరిసరదివ్యదేశముల నైత
ము సేవించి, ఆయాభగవదర్చామూర్తుల మంగళశాసనం
బొనర్చి, అందందు కాలగతిచే లోపించుచుండిన కైంకర్యముల
చక్కదిద్ది, ఉత్తరోత్తరాభివృద్ధికై ప్రబోధసహితముగ తగు
నేర్పాటులు గావించి యాదివ్యదేశమునుండి శిష్యసహితులై
తిరుమలకు పయనమైరి. ఆకాలమున తిరుమల ప్రయాణము
తగుమార్గవసతులు లేనికారణమున కష్టసాధ్యముగ నుండెను.
దారితెలియక మార్గమధ్యమున శ్రీయతిరాజులవారికి గొంత
శ్రమ గలుగనున్నతరి శ్రీయఃపతియే యాటవిక రూపమున
వచ్చి తిరుమలమార్గము జూపిపోయెను. శ్రీయతిరాజులవారు
ను శిష్యసమేతులై శ్రీశేషాచల పర్వతారోహణ మార్గము
లో నొకచోటికరిగి, అదియే కపిలతీర్థమనియు, పదుగు

రాళ్వార్లకును అభిమానస్థలమిదియేయనియు, స్ఫురింప అచ్చట కొంతకాలముండ నిశ్చయించుకొని, యారాత్రి యంతయు ఆళ్వార్లప్రభావము ననుసంధించుచు, కాలము నెమ్మదిగ గడిపిరి. శ్రీరామానుజయతీంద్రులు కపిలతీర్థము కడకు వేంచేసి రను సువార్త కర్ణానందముగొల్పి, దిగువ తిరుపతివాసులగు పలువురు భాగవతులు ఫలపుష్పాది పూజా ద్రవ్యములతో, అందురెంచి శ్రీవారిని దర్శించి పూజించి ధన్యులైరి. శ్రీపెరియతిరుమలనంబిగారును, శ్రీయనంతాళ్వానుగారును తిరుమలలో కైంకర్యనిమగ్నులైయుండుటచే కాబోలు వారికి శ్రీయతిరాజాగమనవార్త దెలియుటకు గొంత యాలస్యమయ్యెను. ఇంతలో నాకాలమున తిరుపతిప్రాంతముల నేలుచున్న విఠలరాజేంద్రుడు, పరివారసమేతుడై, శ్రీయతిరాజుల వారిని దర్శించి యనుదినంబును గొంతయు కొరంత లేక సత్కరించుచుండెను. భాగవతకటాక్షముచే కాలము పక్వమై యారాజేంద్రుడు భృత్యామాత్య సహితముగ శ్రీవారి నాశ్రయింపగోరి అచ్చటనుండు కొందఱు భాగవతుల పురుషకారమున తన మనోగతాభిప్రాయమును శ్రీవారిసన్నిధిలో విజ్ఞాపనం బొనర్చెను. శ్రీయతిరాజులవారా రాజేంద్రుని వినయ విధేయతల కలరి. ఆశ్రయణమునకు సమ్మతించిరి.

శ్రీపెరియతిరుమలనంబిగారును, శ్రీఅనంతాళ్వాను గారును, సకాలమునకే విచ్చేసిరి. పరస్పరము భగవద్భాగవతా

చార్య వైభవములు కొంత తడవు ముచ్చటించుకొని యానం
దాంబుధి మగ్నులైరి. ఒకనాటి సుముహూర్తమున విఠల రా
జేంద్రుడు పరివారసమేతముగ శ్రీయతిరాజులవారిచే పంచ
సంస్కారసంపత్తి వడసి ధన్యుడయ్యెను. ముప్పది శ్రీవైష్ణవ
కుటుంబములు సుఖముగ జీవించుట కుపయోగపడునటుల
"ఇళమండియం"అను గ్రామమును ప్రభువే శ్రీవారికాచార్య
దక్షిణగా సమర్పించెను. - శ్రీయతిరాజులవారును ముప్పది
శ్రీవైష్ణవకుటుంబములకు దిగువ తిరుపతిలోనుండ తగువసతు
లేర్పరచి ఇళమండియము గ్రామములోని భూమినంతయు
వారివారి కుటుంబజీవనముకై పంచియిచ్చిరి. శ్రీఅనంతాళ్వార్
తిరుమలలోని కొందఱు భాగవతులను వెంటగొనివచ్చి శ్రీ
యతిరాజులవారి సన్నిధిని దండముసమర్పించి మీరు దాసుని
పై యనుగ్రహముంచి తిరుమలకు, వేంచేయుడని ప్రార్థించిరి.
అందుకు వారు శేషస్వరూపమునందు నీపర్వతమును,
వెనుకటి యాళ్వారాచార్యులే స్పృశింపవెఱచియుండినపుడు
నావంటి యల్పుడీసాహసమున కొడిగట్టదగునా యనిరి.
అందుకు వారు అపచారమురాని సదుపాయమూహించి మీరు
తిరుమలకేటులనైన వేంచేసి దాసుల కైంకర్యలోపము లరసి
దిద్దుబాటొనర్పకతీరదని పలువిధముల ప్రార్థించిరి. శ్రీయతి
రాజులవారపుడు శ్రీశేషాచలపర్వతమునకు మ్రొక్కి యొక
నాడు పవిత్ర పడిచే గడపి, మరుదినము శిష్యులు యాచార్య

"సేమనము" చే మెత్తలుసిద్ధపఱుపమో కాళ్లకుమెత్తలు ధరించి అయిదవకొండవఱకువచ్చి, అయిదవకొండమధ్యమున నొకచో విశ్రాంతిగైకొనిరి. అప్పుడు తిరుమలనుండి ఒకానొక బ్రహ్మచారి బాలుడు కొన్నిచూత (మామిడి) ఫలములు గొనివచ్చి శ్రీవారిసన్నిధి నర్పించి యంజలిబద్ధుడై "స్వామి నేననంతాచార్యులవారిశిష్యుడ. మా యాచార్యులవారు మీకీ ఫలములర్పించి సత్వరముగ రమ్మనిరి. గావున సేమనమొసంగుడని పలికి మఱుమాటాడులోపలనే యదృశ్యుడయ్యెను. శ్రీయతీంద్రులును వారిశిష్యులును బ్రహ్మచారి బాలకుని సౌందర్యమును, యతనినోటినుండి వెడలిన సుధామధురోక్తులను దలచి దలచి చోద్యమందుచుండిరి. కాని యతనిజాడ నరయరైరి. ఇంతలో నొకవృద్ధ వైష్ణవశిఖామణి కొండదిగివచ్చి శ్రీవారిసన్నిధానమున తాము గొనివచ్చిన చూతఫలములను తీర్థమును నర్పించి మార్గాయాసముచే గాబోలు వానిని స్వీకరింప సంజ్ఞజేయుచు సమీపతరుచ్ఛాయ నుపవిష్టులైరి. ఈ పర్యాయము ఫలములర్పించిన పరమభాగవతోత్తములు శ్రీవారి పూర్వాశ్రమమున మేనమామగారగు శ్రీ పెరియతిరుమలనంబిగారే. తమవార్ధకదశనైన సరకుజేయక భాగినేయునిపై వాత్సల్యముచే నట్టిసాహసకార్యమున కొడిగట్టిన యాభాగవతశిరోమణికి శ్రీవారిశిష్యులందఱు ప్రణమిల్లిరి. కొందఱు పదశ్రమవాయ విసరుచుండిరి. కొందఱు వారి సౌలభ్య,

శౌహార్దాదిగుణంబుల నుతించుచుండిరి. శ్రీశైలపూర్ణు (శ్రీ పెరియతిరుమలనంబి)లత్యంతపూర్ణమనస్కులై శ్రీవారికికటాక్షించప వారును మేనమామగారి తిరువడిత్తామరుల (శ్రీపాదముల) నొత్తుచూ "మహాత్మా! ఈ వార్ధకదశలో దాసునిపై యవ్యాజ కరుణచే నిట్టి సాహసకార్యమొనర్చినందుకు దాసుడాజన్మాంత ము దేవరవారిసన్నిధిలో దాస్యమొనర్చినను ఋణముతీరదు గదా. దేవరవారి నెరుఁగనిన యాబ్రహ్మచారి బాలుని వెంట నీఫలోపహారాదులు పంపి మీరు మజలియుండ గూడ దా" యనగనే శ్రీశైలపూర్ణులాశ్చర్యమున "ఏబ్రహ్మచారి బాలుడును నన్నెదుర్కొనలేదే"యనిరి. అందుకు "శ్రీఅనంతా చార్యులవారి శిష్యుడను. మీకీఫలములు మాయాచార్యులు సమర్పించి రమ్మని"రని ఇప్పుడిపుడేగదా ఆబాలుడు చెప్పిపో యెననగనే. "ఇదేమి వింతగనున్నదే. నాకుఁ దెలిసినంతవఱకు శ్రీఅనంతాచార్యులవారికి శిష్యులెవ్వరును లేరు. నాల్గు తిరు వీధులలో నాకంటె బాలుడు గానరాకుండుటచేతనే నేనే యీఫలములను గొనివచ్చితిని. చిరకాలమునుండి మిమ్ము జూడ నువ్విళ్లూరుచుండిన నాకిది యానందదాయకముగనే యున్నది" యనుచునించుక నిమీలిత నేత్రులై ఆనందబాష్ప ములొలుక "ఆబ్రహ్మచారిబాలుడు నాపెన్నిధియగు శ్రీ తిరు వేంగడముడయానే (శ్రీనివాసులె) యని స్పష్టముగ వ్యక్తో చరమగుచున్నది. ఆహా! పరమపురుషా! దయానిధే యీ

వృష్టము యూకొన్న నాభక్తునకు నీఫలోపహారాదులు శీఘ్ర
ముగ నందజేయ నాయాసపడ నేటికి? నేనే ముందుగ నర్పింప
వలెనుమనిగదా నిటుల నీయవ్యాజకరుణా కార్యరూపముగ
వెలిబుచ్చితివి" యని గద్గదకంఠులై పలికిరి. యతిరాజులవా
రును "సాధుల నేను రక్షింతును, సాధులెల్లరు గురువులు నా
చరిత్రము విచిత్ర"మని శ్రీఅంబరీషుని విషయమున దూ
ర్వాసమహర్షిని మన్నించిన భగవానుని శ్రీసూక్తి జ్ఞాపక
ముంచి యానందమున నోలలాడించిరి. పిమ్మట శ్రీయతిరాజుల
వారు తమ యిష్టదైవమునకు కరిగికొనునకు, గురుపంక్తికి యాఫల
ములు, తీర్థము నివేదించి శ్రీతిరుమలనంబిగారి కర్పించి,
యనుజ్ఞవడసి శిష్యులును, తామును సంతృప్తిగ నారగించిరి.
శ్రీవారారగించిన చూతఫల బీజములలో నొకటి పెద్దమ్రానై
యాత్రికుల కిప్పటికిని విశ్రమస్థానముగ నేర్పడియున్నది.
సంప్రదాయజ్ఞులగు శ్రీవైష్ణవులు పవిత్ర తరుపత్రములు సేక
రించి గొనిపోవుచుందురు. ఈకథ జరిగిన కొంతకాలమునకు,
భక్తులు కొందఱు యతిరాజులవారచట విశ్రమించియుండి
నందుకు జ్ఞాపకార్థమొకగుడి కట్టించి యందు వారి నర్చామూ
ర్తిగ ప్రతిష్ఠించి పూజించుచు వచ్చిరి. నేటికిని భక్తులలో
కొందఱా గుడిని యైదవకొండమధ్య దర్శించి శ్రీవారిని సేవించి
కృతార్థులగుచున్నారు.

శ్రీశైలపూర్ణులవెంట శ్రీయతిరాజులవారు శిష్యబృంద

ముత్తో తిరుమలచేరి. యానందనిలయ విమానము పరమా
నందమున గని యంజలి ఘటించి, వెలుపలి ప్రాకారమునకు
ప్రదక్షిణమొనర్చి, స్వామి పుష్కరిణిని దర్శించి, "శ్లో॥ ధను
ర్మాసేసితేపక్షే ద్వాదశ్యాం మరుణోదయే, ఆయాంతి సర్వ
తీర్థాని స్వామి పుష్కరిణీజలే" (ప్రతిసంవత్సరము ధను
ర్మాసమున శుక్లపక్ష ద్వాదశి యరుణోదయంబున సర్వ
పుణ్యతీర్థము స్వామిపుష్కరిణీతీర్థమునకు వచ్చి చేరుచున్నవి.)
అను శ్లోకము ననుసంధించుచు యాదివ్యపుష్కరిణీతోయమును
తీర్థీకరించి శ్రీ ఆదివరాహస్వామిని సేవించుకొనిన యనంతరము
శ్రీ శ్రీనివాసుని కోవెలలోనికి వేంచేసిరి. శ్రీమద్రామానుజ
యతీంద్రుల యాగమనవార్త నిదివఱకేవిని నిరీక్షించుచుండిన
వారందఱు వచ్చి శ్రీవారిసన్నిధిని పరిక్రమ ప్రణామము
లాచరించి వారివెనువెంటనే కోవెలలోని కరిగిరి. శ్రీయతి
రాజులవారును బలిపీఠ ధ్వజస్తంభములకు ప్రణామములర్పించి
విరజాతీర్థము బంగారుబావి సేవించి, శ్రీయానందనిలయ
విమానమున కంజలిబద్ధులై ప్రదక్షిణమొనర్చి, తొట్టితీర్థము
స్వీకరించి, గర్భాలయములోని కరిగి శ్రీ శ్రీనివాసుని దివ్య
మంగళ విగ్రహములు సేవించి నుతించి పూజాద్రవ్యము
లర్పించిరి. ఆరాధనానంతర మర్చకులొసంగు తీర్థ, శఠగోప,
ప్రసాదాది సత్కారములు స్వీకరించి మరికొంతకాలము
శ్రీ శ్రీనివాసుల సన్నిధానమున తనివితీరని యానందమున

నుండి యనుజ్ఞవడసి (మేనమామగారగు) శ్రీశైలపూర్ణు గృహమునకువిచ్చేసి విశ్రమించిరి. శ్రీశైలపూర్ణుల దేవిగారును వారియిరువురు పుత్రులును, తమ పినతల్లిపుత్రుడగు గోవింద మిశ్రులును, తిరుమలలో వేం చేసియుండిన మూడుదినములును నుచితసత్కారాదుల శ్రీవారిని సంతృప్తిపరచిరి. నాలుగవ దిన ముదయమున నిత్యకర్మానుష్ఠానములు ముగించుకొని, శిష్య బృందము వెంటరాగ, కడసారి మనసార శ్రీ శ్రీనివాసుని సేవించి, నుతించి యుచితసత్కారములు వడసి, యనుజ్ఞవేడ, యర్చకముఖముగ "యతిరాజా! ఉభయవిభూతి నిర్వాహ కత్వము నీయధీనమునందుంచితిని. "ఉడయవర్" అను సార్థక నామమున విలసిల్లుము; ముముక్షువుల కుజ్జీవనోపాయము గలుగునటుల ప్రచారము" యని శ్రీయఃపతియనుగ్రహించి పంపిరి. ఇట్లు స్వామిని భగవదనుజ్ఞవడసి, ఉడయవరులు (శ్రీరామా నుజులు) శిష్యబృందముతో దిగువ తిరుపతికి విచ్చేసిరి. శ్రీవారు తిరుమలలోనుండిన మూడుదినంబులలో శ్రీ అనంతాళ్వాన్ చే వృద్ధిజేయబడి, నానావిధ దివ్య తరులతాశోభితమై తులసీ పుష్పఫల సౌరభమును వెదజల్లు దివ్యారామమును గని యా నందించియు, అందందు లోపించుచుండిన కైంకర్యములను పరిష్కరించియు, ఉత్తరోత్తర కైంకర్యాభివృద్ధి యగునట్లు య ర్చక, పరిచారకాదులకు స్వరూపజ్ఞానవృద్ధికరమగు ప్రబో ధము గావించియు, తమ యపారకరుణ నెఱపినందుకు సమ

క్రమముగ నేగాక పరోక్షమునకూడ వారు దిగువ తిరుపతికి వేం చేసిన వెనుక చిరకాలము శ్రీ శ్రీనివాససన్నిధి కైంకర్యపరు లందఱు వేనోళ్ల గొనియాడుచుండిరి. దిగువ తిరుపతిలోకూడ శ్రీశైలపూర్ణులకు గృహవసతిగలదు. శ్రీగోవింద మిశ్రాదు లచే నిచ్చటగూడ నుచితరీతి సత్కరింపబడుచుండిరి. ఒకా నొకదినము శ్రీశైలపూర్ణులు తిరుమల దిగివచ్చి, శ్రీరామా నుజ యతీంద్రులతో విశ్రాంతిగ ముచ్చటించుచుండ యతీంద్రు లంజలి ఘటించి "దేవరవారి సన్నిధిని ద్వయార్థ ప్రతిపాదకమగు శ్రీమద్రామాయణములోని విశేషార్థములు వినవలయునని దాసునికోరిక. అస్మదాచార్యులగు శ్రీపెరియ నంబి (మహాపూర్ణులు) గారును ఇటులే నియమించియున్నా రు. పితామహబిరుదముగల దేవరవారికి సర్వలోకపితామహ మానసపుత్రుడగు శ్రీనారదభగవానుని యనుగ్రహంబుచే వడసిన శ్రీవాల్మీకిమహర్షి హృద్గతాశయములు కరతలామల కములని ప్రసన్నశిఖామణులందఱు ప్రశంసించుచుందురు. దాసుని హృదయపేటిక నాయర్థరత్నముల నింపిన ధన్యుడ నౌదు"నని ప్రార్థించిరి. యుగాంతరమున శ్రీరామచంద్ర మూర్తి (చక్రవర్తి తిరుమగన్) యనుంగు సోదరుడగు శ్రీ లక్ష్మణమూర్తియే యీలక్ష్మణాచార్యులని హృదయాకాశ మున మెరుపువలె గోచరింప స్మితాననులై నేడే లోకోత్తర శుభముహూర్తమున్నది. గావున తప్పక కాలక్షేపం బారంభింత

మఱి ఇలికి కాలక్షేపప్రారంభమున శ్రీసీతాలక్ష్మణ, భరత, శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రమూర్తిని, శ్రీవాల్మీకిమహర్షిని, గురుపంక్తిని షోడశోపచారముల పూజించి నుతించి శ్రీమద్రామాయణ కాలక్షేప ముపక్రమించిరి. అనుదిన మపరాహ్ణవేళ తిరుమలకరిగి కైంకర్యముముగించుకొని మఱదినముదయము కొంత పొద్దెక్కినప్పటికి శ్రీశైలపూర్ణులు శైలరాజముదిగి వచ్చి, కాలక్షేప మనుగ్రహింపవలసి యుండునది. దీనిని గ్రహించి శ్రీయతిరాజులవారు, వారు నేంచేయుకాలమునకే పర్వతసోపానముల చేరువనుండు నొక తింత్రిణీ వృక్షముకడ పూజాపరికరములతో వేంచేసి నంబిగారి రాకకై నిరీక్షించుచుండు వారట. శ్రీతిరుమలనంబిగారు రానే వారిని యతీంద్రులు యథోచితముగ పరిశ్రమవాయ నుపచరించి, వారు సుఖోపవిష్టులైనపిదప నిరువురను శ్రీకోశమునకు (గ్రంథమునకు) ఆరాధన మొనర్చి, యాతింత్రిణీ తరుచ్ఛాయనే కాలక్షేపమొనర్చుచుండిరి. దిగువ తిరుపతి వాసులగు కొందఱు భాగవతులును నున్నంతలో తీరికచేసి కొనివచ్చి కాలక్షేపము వినుచుండిరి. విద్యావినయ సంపన్నులగు భాగవతుల కిది సహజమేగాని, విద్యాగంధలేశమైన లేకున్నను వినయ మనునట్టిదో యెఱుంగకున్నను, నవిగలవారి కన్నను మిన్నయై యొకవ్రజ (గొల్ల) వనిత కాలక్షేపారంభమునుండి సాంతముగ శ్రీమద్రామాయణములోని మనోహర

మధురోక్తుల ననుభవించుచుండినదే విశేషము. ఆమె శ్రీశైల
పూర్ణుల శ్రీసూక్తుల కర్ణపేయముగ ననుభవించి తాను గొని
వచ్చిన దధిక్షీరములు వారి కర్పించి దండము సమర్పించి
సంతసమున నరుగుచుండెడిది. శ్రీశైలపూర్ణులును, వారామెని
గొప్పదీసముగ భావించిరాటిన మాయుశీకటాక్షముగల వారి
కీలాటి శ్రద్ధా భక్తులు నారికేళమున నీహారినటుల సమృద్ధి
ననుదినంబును వృద్ధియగుచుండుట గాంచి సంతోషస్వాంతు
లగుచుండిరి. శ్రీవాల్మీకి వదనారవిందగళిత శ్రీమద్రామా
యణాఖ్య మధువు శ్రీశైలపూర్ణ వాక్సుధా పానీయ పాత్రి
నుండి, సంపూర్ణముగ గ్రోలుచుండినప్పుడు, పూర్వము పుత్రో
త్పత్తికై శ్రీహవ్యవాహనదత్త దివ్యపాయసము ననుభవించి
యానందపరవశలగుచున్న శ్రీ దశరథనరేంద్రపత్నీ రత్నత్రి
యముకన్నను, విజ్ఞానోత్పత్తికై యువ్విళ్లూరుచుండు మన
రామానుజ యతీంద్రులవారి కానందమధికమున్నటుల చూ
పట్టుచుండెనని వ్రాయుటలో నతిశయోక్తి యావంతయు లేదు.
అదెటులనిన, నరేంద్రపుత్రోత్పత్తి నిగ్రహానుగ్రహములు
రెండింటికిని కారణమయ్యెను. యతీంద్రజ్ఞానోత్పత్తియో కేవల
మనుగ్రహమునకే కారణమై మీదు మిక్కిలి పరోజ్జీవన
కారియయ్యెను.

“సతాంమధ్యేనావసీదంతిసంతః” (మంచివారు మంచి
వారిసన్నిధానమున వ్యాకులత నొందరు) అను శ్రీసూక్తి

కనుగుణముగ నాగోపవనితకు శ్రీరామకథామృతము కర్ణపేయ
ముగ గ్రోలినప్పుడు యాశలిదప్పుల విచారమావంత యు
దోపదయ్యెను. ఆ సౌభాగ్యవిశేష మెట్టిదోగాని కాలక్షేపము
సాంతముగ వినునప్పటికి, కాలపరిపాకమునకు కర్మపరిపాకము
తోడై జన్మ, రోగ, జరా, మరణముల కునికిపట్టగు నీభూలో
కము దుఃఖాలయమనియు, నసుఖము మాత్సనొందుచుండు
టచే నశాశ్వతమనియు, గ్రహించి విరక్తి నానాటికి వృద్ధి
యగుకొలది నార్తియునానాటికి తీవ్రముకాగా, రక్తమాంస
మలినస్థూలదేహ మెప్పుడెప్పుడు వదలునా, యప్రాకృతానంద
లోకమున దివ్యదేహములభించి భగవత్సాయుజ్యానందము
నెప్పుడెపు డనుభవింతునాయను నాశాలత శ్రీశైల పూర్ణ
కరుణాకటాక్షమున పెఱిగి, పుష్పించి, ఫలోన్ముఖమయ్యెను.
పరోక్షైవనవరతగల శ్రీమద్రామానుజ యతీంద్రు లది గమ
నించుచునేయుండిరి. ఆమె తనమనంబున సమస్తలోక జననీ!
జానకీదేవి! నీపురుషకారము, ముముక్షువుల కత్యంతావశ్యక
మనియు, నాబోటి పాపజీవులయెడనైతము నిగ్రహమననెట్టిదో
యెఱుగని పరమదయాస్వరూపిణివై యాశ్రితకల్పతరువువంటి
శ్రీపతి సాన్నిధ్యమున నిత్యానపాయినివై వెలయుచు భగవ
ద్రక్షణ కార్యముగ సమయము గనిపెట్టి, తోడ్పడుదువనియు,
ఆదిశేషానుగ్రహమున ప్రాకృతిక మోహమువదలి పరమాత్మ
సేవచేయువిధానమున్ను, ఆదిలక్ష్మివగు నీయనుగ్రహమున

ప్రాకృతకామమువదలి పరమాత్మ సేవచేయ సర్వసిద్ధియు కలుగునని శ్రీశైలపూర్ణుల శ్రీసూక్తులవలన దెలిసికొంటి, యీదీనురాలి యాశాలత ఫలించుకాలము సమీపించి యుండక పోదని యత్యాశాపూరితనైతి. సిద్ధిస్వరూపావస్థితము గోరుచుండు నదీనురాలెన్నటికిని జారవిడువని దృఢముగనమ్ముకొని యున్నదాన తల్లీయని అనుదినంబును శ్రీజానకీదేవిని ప్రార్థించుచుండెను.

శ్రీరామానుజయతీంద్రులొకనాడు కాలక్షేపానంతరము, శ్రీశైలపూర్ణులువినుచుండ నాబ్రాహ్మణవనితతో "అమ్మా నీవు మాకనుదినంబును నొసంగుచుండిన పాలుపెరుగునకు క్రియమొత్తము యివ్వవలసియుండునో తెల్పుము. శ్రీమద్రామాయణ కాలక్షేపము నేటితో నాచార్యకటాక్షమున తృప్తికరముగ ముగిసినది. సత్వరముగ స్వస్థలము జేరవలసి యున్నది" అనిరి.

అపుడాసాధ్వీమణి సర్వచేతనోజ్జీవన తత్పరులగు మీబోటిమహనీయు లెచ్చటనుండిన నదియే స్వస్థలముగదా. దాసికిదేవరవారి యనుగ్రహముచే నీభౌతికశరీరముపై విరక్తి జనించినది. ఆనందలోకము జేరవలెనను నాశాలత తీవ్రముగ వృద్ధియగుచున్నది. ఇట్టిస్థితిలో దేవరవారికర్పించుచుండిన యీ యల్పపదార్థమునకు మూల్యముపుచ్చుకొనిన అమూల్యమగు నాస్వరూపము నాకుదక్కునా మహాత్మా! పరమపదము జేరి

నిత్యానందమున నిత్యసూరులుగొలువ శ్రీభూనీళాది దేవేరు లోవెలయు నీరజాక్షుని నిత్యసాన్నిధ్యమే దాసియాశించునది యది శీఘ్రముగలభింప ననుగ్రహింపు"డని ప్రార్థించెను అప్పుడు శ్రీయతిరాజులవారు "అమ్మా శబరివంటి పరమభక్తురాలవు నీవు. నీలోకోత్తరమనోరథ మత్యంతప్రశంసనీయమే కాని, పరమపదములభించుట పరవాసుదేవుని పరమకృపైక సాధ్యముగదా"యనిరి. అపుడా సాధ్వీమణి యంజలిజోడించి "పితామహా" లని బిరుదనామమున వెలయు శ్రీశైలపూర్ణాచార్య పరిపూర్ణకటాక్షము మీదాసిపై విరివిగ బ్రసరించి నపుడు సర్వలోక పితామహుడను శ్రీచతురాననుడు చతుర్దశ భువనముల నేలజాలకున్నాడు? దేవరవారికర్పించుచుండిన దధిక్షీరములచే మీరు తృప్తినొందుచుండినపుడు దధిక్షీరార్ణవములదాటి దాసికేలవైకుంఠమగును? శ్రీమద్రామాయణ కథాసుధాంబుధి ననుదినంబును నోలలాడుచుండిన యీదాసికి విరజానదిని గ్రుంకుభాగ్యమేల లభింపదు? ఇక దేవరవారి నిత్యసాన్నిధ్యప్రభావము, శ్రీయాదిశేష పర్యంత సాన్నిధ్యముఁజేర్చి యందు దివ్యపరివారసమేతులై వెలయు శ్రియఃపతి నిత్య నిరవద్య నిరతిశయ కైంకర్యానందమేల ననుభవింపజేయదు? గావున దాసిని దోషముక్తురాలినిగ నొనర్చి శ్రీశ్రీనివాసమూర్తికొక విజ్ఞాపనపత్రిక నొసంగుడు" అని శ్రీయతిరాజులవారిని బ్రార్థించుచు వారిపదాంబుజములపై

వ్రాలెను. శ్రీశైలపూర్ణులకు పూర్ణనమ్మకమై యీ సాధ్వి ప్రార్థన సమాదరణీయమగుట కావంతయు సందియము లేదని పలికిరి. అపుడు శ్రీయతిరాజుల వారా గోపవనిత ధృతాధ్యవసాయమునకలరి యామెకోర్కె శీఘ్రముగ నెరవేర్ప శ్రీశ్రీనివాసమూర్తికొక విజ్ఞాపనపత్రిక వ్రాసియిచ్చి దీనిని భద్రముగఁగొనిపోయి యర్చకముఖముగ శ్రీతిరువెంగడముడయాను శ్రీపాదారవిందసన్నిధి జేర్పుమనిపలికి మంగళాశాసనము నర్పిరి. శ్రీశైలపూర్ణులును ఈ విజ్ఞాపనపత్రిక ముంగొంగు పసిడివంటిదిసుమా! భద్రముగ శ్రియఃపతిసన్నిధిఁజేర్చి యా దయామయుని విశేషానుగ్రహమువడసి సుఖింపుమని యాశీర్వదించిరి. ఆసతీతిలకము శ్రీయతిరాజుల వారికిని, శ్రీశైల పూర్ణులకును కడసారి మనసార ప్రదక్షిణ ప్రణామములర్పించి యనుజ్ఞవడసి శరవేగమున నేడు కొండలగడిచి తిరుమల జేరెను

నిత్యకల్యాణము. పచ్చతోరణము ననునార్యోక్తి శ్రీ తిరుపతి వేంకటేశ్వరులయెడ ముఖ్యవృత్తిగ నన్వయించును. కనుకనే గోపవనిత శ్రీయతిరాజులవారినుండి విజ్ఞాపనపత్రిక గొనివచ్చిననాడుకూడ యుత్తరదేశవాసియగు నొకసంపన్న గృహస్థుడు లోకోత్తరవైభవముతో గరుడోత్సవము గరుడ ధ్వజమును జరిపించుచుండెను. ఉత్సవమూర్తిని వాహనము పైనుంచి వేంచేయజేసి బహువైభవమున గర్భాలయముఁజేర్చ

సమయమునకే గోపవనిత యానందమున యానందనిలయమున
ప్రదక్షిణము నొనర్చివచ్చి గర్భాలయద్వారముకడ నొకప
క్కన నంజలిఁ జోడించుకొని నిలుచుకొనియుండెను. ఆమెకు
చిరపరిచితుఁడగు నొకభగవత్పరిచారకుఁడు కోవెలలోని కరుగ
చుండె. ఆయనను పిలిచి యామె యింపెరగున భద్రపరచియుం
చిన విజ్ఞాపనపత్రికను వినయముననొసంగెను. ఆయన దానిని
చదువుచుండ యర్చకపరిచారకులు కొందఱుగుమిగూడిరి.
వారందఱును నాపత్రికాభిప్రాయమును గ్రహించి యాశ్చ
ర్యమున నామె సాధ్వీమణివంకఁ జూడసాగిరి. పత్రికనుతీసికొనిన
పరిచారకుఁడు లోనికరిగి శ్రీయఃపతికారాధన సమర్పించు
చుండిన యర్చకశిఖామణికి దానినొసంగెను. గోపవనితయు
ఫలపుష్పాది పూజాద్రవ్యము లర్చకునికడ నర్పించి యంజలి
బద్ధయై నిలిచి శ్రీశ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహము సేవించు
కొనుచుండెను. అర్చకుఁడు యామె యర్పించిన పూజాద్ర
వ్యములచే శ్రీయఃపతి నారాధించి ఆనందబాష్పములొలుక
నాపత్రికను శ్రీయఃపతికడ చదివి శ్రీపాదసన్నిధి నర్పించి
నీరాజనము సమర్పించెను. ఆనాటి నీరాజన సమయమున శ్రీ
శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహము నాపాదమస్తకము
సేవించినవారికన్న భాగ్యాధికులుండుటయరుదు. శ్రీవత్స
కౌస్తుభాది దివ్యాలంకారములచే వెలయువిశాలవక్షమునలంక
రించిన తరుణతులసీమాలిక నుండి కొన్నిదళములు శ్రీవారి

కృతార్థురాలాయెను. అర్చకు లత్యాశ్చర్య మగ్నులైరి. ఇక గోపవనిత యానందమునకు మేరయే లేదు. అర్చకు లామెకు తీర్థ శఠగోప ప్రసాదములొసంగి "అమ్మా! నీ భాగ్యమే భాగ్యము. తిరువేంగడముడయాను కృప నీపై పరిపూర్ణముగ ప్రసరించినది." అని యాశీర్వదించిరి. అవనితాశిరోమణి "స్వామీ! ఇదంతయు మీవంటి పరమ భాగవతోత్తముల యొక్కయు, శ్రీయతిరాజ, శ్రీశైలపూర్ణులవంటి యాచార్యోత్తముల యొక్కయు పురుషకార ఫలమే గాని మఱెద్దియుఁ గాదని వారికి మ్రొక్కి భగవదనుజ్ఞ వడసి నిజనిలయమునకుఁ జేరెను. నిలయము జేరిన యొకముహూర్త కాలమునకే యాసాధ్వి యానంద నిలయముగూడ జేరుకొనగలిగెను. అందుకు నిదర్శనముగ కడసారి యామెనోటినుండి "శ్రీనివాసా! స్వర్ణరత్న దివ్యవిమానము! దివ్యతేజోమూర్తులు. వందనము" అను నాలుగువాక్యములు వెలువడెను. జ్ఞాన భక్తి వైరాగ్యసంపన్నయగు నాయింతి ఆకాలపు సీమంతినీరత్నమాలలో నాయకరత్నమై యాదర్శప్రాయమగు మేలుబంతియై యలరారెను.

ఆరవగుచ్ఛము సమాప్తము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - ఏడవగుచ్ఛము.

### శ్రీగోవిందమిశ్ర, వరదరామానుజ, కూరేశుల వైభవము.

శ్రీరామానుజ యతీంద్రులు మేనమామగారగు శ్రీ తిరుమలనంబి (శ్రీశైలపూర్ణులు) గృహమునయుండు దినంబులలో గోవిందమిశ్రుల సుగుణములుకొన్ని కనుగొన నవకాశమేర్పడెను. అదియెటులనిన శ్రీగోవిందమిశ్రులొక నాటిరాత్రి తనమేనమామగారు శయనించుటకై మృదుశయ్యనమర్చి శయ్యపై తానొకసారి పరుండి యటునిటు పొరలి శయ్యాసవరించిపోయిరి. శ్రీరామానుజయతీంద్రులిదిగమనించుచుండి గురుతల్పముపై గోవింద మిశ్రునివంటి జ్ఞానసంపన్నుడు శయనించి లేచుటకు కారణమూహించియు నతనిస్వభావము లోకమునకుఁ దెలియవలెననుతలంపుచే నంబిగారి కాయన నడవడికఁ దెలిపిరి. అపుడువారు మేనల్లునిఁ

బిలిపించి "గోవిందా! నాకుశయ్యనమర్చుతరి నీవొనర్చిన చర్య మిక్కిలి గర్హితముగనున్నటుల మీాయన్నగారివలన దెలియవచ్చెను. గురుతల్పగతుడగు వానిగతి పరలోకమున నెటులుండునో నెఱుంగుదువా?" అనిరి. ఆయనకాయన ఘోర యమదండనయేయని బదులుజెప్పెను. "అదితెలిసియు నేలం నటులంజేసితి" వని యడుగ "దేవరవారి కుసుమకోమల శరీర మునకు సహజస్థూలదృష్టికి గోచరింపని క్రిమికీటకాదులుగాని, సికతాకంటకాదులుగానియుండిన బాధగలిగించునుగదా! ఇది యుపేక్షించుటమాత్ర మపచారముగాదా? దేవరవారికి బాధ గలిగిన దాసునిమనస్సు తాళగలదా? అట్టిబాధలు లేకుండ నుండవలెనని యే స్వయముగపరుండి పరీక్షింప సాహసించితిని. దాసుని నరకబాధ సరకుగొననుగాని దేవరవారి తిరుమేను (శరీరము) నొచ్చిన నోర్వజాల" ననెను. శ్రీగోవిందమిశ్రు లొసంగిన సమాధానమున కెంబెరుమానారు(రామానుజులు) లక్కజపడి మిక్కిలియానందించిరి. మఱియొకనాడు శ్రీగోవిం దమిశ్రులు పరుగుపరుగునవచ్చి శ్రీయతీంద్ర పదాబ్జములపై వ్రాలిరి. శ్రీవారాశ్చర్యమున వారినిలేపి కూరుచుండబెట్టు కొని అటులొనర్చుటకు కారణమడిగిరి. అప్పుడువారాచార్యా! నేడుదయమున తిరునందనవనమున తులసీపుష్పములు సేకరించు చుండ నొకదొడ్డనాగసర్పము నోటిలో ముల్లుగుచ్చుకొనుట చే బాధపడుచుండినది. దానిబాధ చూడజాలక పామునోటి

నుండి ముల్లుఁదీసి స్వామిప్రదక్షిణిలో నీరాడి సాహసకార్య మొనర్చినందుల కహంకారము పైకొనకేమో యను భీతిచే దేవరవారి శ్రీపాదముల సంబంధముచే దానినివారింపదలంచి నిట్లు జేసితిని. ఆచార్యకటాక్షముచే నీయుపాయము స్ఫురించినది. కాని నాస్వశక్తిచే గాదు. "అనియంజలిబద్ధులై నిలిచియుండిరి. శ్రీగోవిందమిశ్రుల యాచార్యపారతంత్ర్యమునకు స్వార్థత్యాగమునకు దయార్ద్రహృదయమునకు శ్రీరామానుజ యతీంద్రులు మిక్కిలి సంతసించిరి.

శ్రీపెరియతిరుమలనంబిగారికి యిరువురు పుత్రులుండిరని వెనుక దెలుపబడినదికదా? వారిలో ప్రథమపుత్రుడు పిళ్ళై తిరుమలనంబి అసదృశ పితృభక్తియుతుడు. ద్వితీయపుత్రుడు తిరుక్కురుహైపిరాన్ పిళ్ళాన్ (కురుకేశులు) అసదృశఆచార్య భక్తియుతుడు. వీరికి శ్రీనమ్మాళ్వారులయెడగల యపార భక్తియేగాక మేధాశక్తికూడ యపారమని యఖిలభాగవతులనుదినంబును ప్రశంసించి యానందించుచుండిరి. శ్రీశైలపూర్ణులు తమపుత్రుల యాత్మరక్షణ శ్రీయతీంద్రులకొప్పగింపదలచి వారిరువురిని శ్రీయతీంద్రులచే పంచసంస్కారసంపన్నులుగా నొనరించిరి. శ్రీయతిరాజులవారును వారిరువురి యాత్మరక్షణాభారము వహించుట తాముస్వరూపానురూపముగ శ్రీపెరియతిరుమలనంబివంటి యాచార్యశిఖామణికి జేయవలసిన కృతజ్ఞతాసూచక కైంకర్యముగ భావించిరి.

ఇట్లుకొన్నిదినములుగడవ "శ్రీయతిరాజులవారు శ్రీనంబెరు
మాళ్లసన్నిధినిడిచి బహుకాలమైనది. అప్పటి భగవద్భాగ
వత కైంకర్యము లెట్టుల శిష్యులచే నిర్వహింపబడుచున్నవో
తెలియదు. శ్రీకస్తూరిరంగని కన్నులంగట్టినట్టులున్నది." అని
మనంబున దలంచుకొని "శ్రీశైలపూర్ణులతో శ్రీమద్రామా
యణములోని ద్వయార్థప్రతిపాదక రహస్యార్థములన్నియు
దేవరవారికృపచే దాసునిహృదయఫలకమున నంకితము
లైనవి. ఇక శ్రీనంబెరుమాళ్లసన్నిధికరుగ ననుజ్ఞనొసంగుడు"
డని ప్రార్థించిరి. శ్రీపెరియతిరుమలనంబిగారప్పుడు "మీరిన్ని
దినంబులు నాకత్యంతసంతసము గూర్చినందుకు యథాశక్తి
నుపకరింప దలచితిని. మీయభీష్టమెద్దియో తెలుపుడ"నిరి.
అప్పుడు శ్రీయతిరాజులవారంజలిఘటించి "గోవిందమిశ్రుడు
నాకుచిన్నతనమునుండి బహుకాలము చేదోడువాదోడుగ
నుండినవాడు. కాలగతిచే కొంతకాలము మాకిరువురికి విశ్లే
షముకలిగినను దేవరవారియనుగ్రహముచే మరల నిరువురము
కలుసుకొను భాగ్యముగలిగినది. అతనికి సుగుణసంపత్తియు
వృద్ధియైనది. గావున నతనినావెంట శ్రీనంబెరుమాళ్లసన్నిధి
కంపుటే యభీష్టము"అనిరి. "నేనును నదియే నుచితమని తలం
చుచుంటిని "అని శ్రీనంబిగారు శ్రీగోవిందమిశ్రుల బిలిచి
వారిని శ్రీయతిరాజులవారిసన్నిధిలో పరిగ్రహపరిణామము
లర్పింపజేసి యుదకధారాపూర్వకముగ స్వాధీనమొనర్చి

"గోవిందా నీవీనాటినుండి మీయన్నగారిని పరదైవముగ భావించి వారియందే నేమఱకయుండి యుజ్జీవింపు"మని యాజ్ఞాపించి మంగళాశాసనంబొనర్చిరి. శ్రీగోవిందమిశ్రులు గోరుచుండినవియు నిదియేగావున మహాభాగ్యమని యంగీకరించిరి. మఱుదినముదయముననే ప్రాతఃకాల భగవదాజ్ఞావిధులు ముగించుకొని శ్రీయతిరాజులవారు శ్రీశైలపూర్ణులకు ప్రక్రమ ప్రణామములర్పించి యనుజ్ఞవడసి శిష్యసమేతులై శ్రీనంబెరుమాళ్ళసన్నిధికరిగిరి. దిగువతిరుపతి విడిచినపిదప శ్రీయతిరాజులవారు శ్రీఘటికాచలక్షేత్రంబునకరిగి యచ్చటి శ్రీలక్ష్మీనృసింహస్వామిని శ్రీరామకార్యధురంధరుడని విఖ్యాతిగాంచిన శ్రీ సిరియతిరువడి (శ్రీఆంజనేయులు)ని సేవించి మంగళాశాసనంబొనర్చి తిరుపుట్కూరునందు గృధ్రపుష్కరిణీతీరస్థ శ్రీవిజయరాఘవ స్వామిని సేవించి మంగళాశాసనంబొనర్చి యచ్చటినుండి శ్రీకాంచీపురికివచ్చేసిరి. చిరకాలమునుండి తన్ను మిక్కిలి ప్రేమతో పెంచి పెద్దచేసి స్వరూపజ్ఞాన మలవరచిన మేనమామగారి విశ్లేషము శ్రీగోవిందమిశ్రుల యాచార్యకైంకర్యమున కడ్డుతగులుచుండెను. శ్రీయతిరాజులవారది గమనించి "గోవిందా! నీముఖవైఖరి దైన్యభావమును సూచించుచున్నది. ఇందుకు కారణము మాతులవిశ్లేష దుఃఖమేగదా!" యనిరి. అప్పుడువారు "సర్వజ్ఞులగు దేవరవారికి తెలియనిదేమున్నదియని తలవంచుకొనిరి. శ్రీయతిరాజులవారు తిరు

మలయాత్రకరుగుచుండు కొందఱు శ్రీవైష్ణవస్వాములజతపఱచి "నీవు మేనమామగారి నొకపర్యాయము మాఱడీర సేవించుకొని రమ్మ"ని పంపిరి. శ్రీగోవిందమిశ్రులును, శ్రీయతిరాజుల వారికిమ్రొక్కి యనుమతివడసి. యాశ్రీవైష్ణవస్వాములవెంట తిరుమలకరిగి శ్రీపెరియతిరుమలనంబిగారికిని, వారిదేవిగారికిని సాష్టాంగ వందనంబాచరించి యంజలిజోడించి నిల్వ, నంబి గారు మేనల్లునిచూచియు చూడనటుల నుపేక్షించియుండిరి. "మనగోవిందుడు యంజలిబద్ధుడై దైన్యమున మనవుంచగాచి యుండ మీరిట్లుపేక్షించియుండదగునా?యని భర్తను వారి దేవిగారడిగిరి. అప్పుడువారు" ఇతనిని నాడే యుదకధారా పూర్వకముగ రామానుజులకర్పించితిమిగదా! విక్రయమూల మునగాని, దానముగగాని ఒకమారర్పింపబడినవస్తువు అర్పింప బడిన వానివశమునయుండదగినదే. ఇందు చేతనాచేతనపదార్థ వివక్షలేదు. అటులగాక ఇతనినాదరించిన విక్రీతపశువును మచ్చికజేసినదైన నదియిల్లువిడిచి యెటులకదలదో యటులనే యితడొనర్చి తనకును, మనకును మహాదోషముసంప్రాప్తించు గతి కలుగజేయును. అని ధర్మసూక్ష్మము విశదపరచి "గోవిందా మాపైమరలుకొని శ్రీరామానుజులయెడ గొప్ప యపచారము గావించితివి. మాపై ప్రేమ, విశ్వాసములు మనంబుననిమిడియుండినజాలు. సాధ్వీమణియగు కులకాంత మనంబున తలిదండ్రులయెడ కృతజ్ఞతగలిగి కాంతునివశముండి

కలకాలము కాపురముజేయుచుండునుగదా! అటులనే ప్రస
న్నుడును వర్తింపవలసియుండును. గావున శీఘ్రముగభుజించి
మరల మీ యన్నగారిసన్నిధిని జేరుకొమ్మ"ని తీవ్రపఱచిరి.
శ్రీగోవిందమిశ్రులు "అపరాధిని క్షమింపుడని మేనమామ
గారికిని, వారిదేవిగారికిని ప్రణమిల్లి యనుజ్ఞవడసి శ్రీయతి
రాజులవారి సన్నిధిజేరి దండముసమర్పించి అపచారక్షమా
పణవేడి తిరుమలలోజరిగిన వృత్తాంతమంతయు దెలిపిరి. శ్రీ
యతిరాజులవారును అభయమొసంగి స్వరూపోజ్జీవనకరముగ
ప్రబోధముగావించుచుండిరి. ఆనాడు మొదలు తమసర్వస్వము
శ్రీయెంబెరుమానారే యని దృఢనిశ్చయులై సర్వకాల సర్వా
వస్థలందును శ్రీరామానుజ పాదచ్ఛాయవలె యనువర్తించు
చుండిరి. శ్రీయెంబెరుమానారు శ్రీకాంచీపురిని, శ్రీకాంచీ
పూర్ణులను శ్రీపెరుందేవిసహితుడగు శ్రీకరిగిరీశుని అనుదినంబును
సేవించుచు భగవద్భాగవతాచార్య గుణానుభవంబొనర్చుచు
కొన్నిదినములుగడపి యర్చకముఖముగ శ్రీకరిగిరీశుని అనుజ్ఞ
వడసి శ్రీకాంచీపూర్ణులకడ ప్రణమిల్లి యనుగ్రహమువడసి
శ్రీనంబెరుమాళ్లసన్నిధికి వేంచేసిరి. శ్రీయతిరాజులవారి
యాగమనవార్త వినగనే భాగవతోత్తములందఱు మంగళ
వాద్యములతోడను సకలమర్యాదలతోడను వారినెదుర్కొని
ప్రదక్షిణప్రణామాది సత్కారములచే వారిసపూజించి తిరు
మల శ్రీకాంచీపురమాదిగాగల క్షేత్రములలోని భగవ

భాగవత వైభవములనడిగి తెలిసికొని సంతోషస్వాంతులైరి. శ్రీయతిరాజులవారును, శిష్యులతోడను, భాగవతబృందము తోడను, కోవెలలోనికరిగి శ్రీప్రణవవిమానమున కంజలిఘటించి శ్రీవిష్వక్సేన, బలిపీఠ, వైనతేయాదులకు ప్రణమిల్లి ద్వారపాలకులగు జయవిజయులకు చేమోడ్చి ఫలపుష్పాది పూజాద్రవ్యములతో గర్భాలయము జొచ్చి శ్రీరంగనాథుని దివ్యమహిషీవర్గమును ఆకొన్నవాడు సిద్ధాన్నమునుగని నటుల దర్శించి నుతించి మంగళాశాసనంబొనర్చి ఆరాధనానంతరము యర్చకులొసంగు తిరుపరివట్టు తీర్థ శఠగోప ప్రసాదములు స్వీకరించి భగవన్మననముబొంది స్వమఠముబ్రవేశించిరి. అపుడు కైంకర్యపరులందఱు శ్రీవారిని సేవింపరాగా తాము శ్రీరంగమున లేనికాలమున కోవెలలోను మఠమునందును కైంకర్యములన్నియు సక్రమముగ జరుగుచుండుటను గురించి విచారించిసంతసించిరి. శ్రీయెంబెరుమానారు లిట్టుల త్రికాలములందును శ్రీరంగనాథుని, దేవేరులను, ఆళ్వారాచార్యులను సేవించుకొనుచు శిష్యులకు స్వరూపగ్రంథములు వ్యాఖ్యముగబోధించుచు కాలక్షేపమొనర్చుచుండిరి. (శ్రీ)గోవిందమిశ్రులకు నానాటికి జ్ఞాన, భక్తి విరక్తులు తీవ్రముగ వృద్ధియగుచుండెను. వారు శ్రీరామానుజ యతీంద్రుల దివ్యమంగళవిగ్రహము నాపాదమస్తకము ధ్యానించుకొనుచు వారి శ్రీసూక్తులసదా యనుసంధాన మొనర్చుకొనుచు తమకు నియ

మింపబడిన కైంకర్యముల శ్రద్ధాభక్తులతో నిర్వహించుచు సెమ్మదిగ కాలముగడుపుచుండిరి. భాగవతులలో కొండ ఱొకనాడు శ్రీగోవిందమిశ్రులతో "మహాత్మా! శ్రీయతిరాజు లవారి కృపాప్రవాహము మీపైపొరలి ప్రవహించుచున్నటుల మీానడవడికయే స్పష్టముగఁ దెలుపుచున్నది. మీా భాగ్యమే భాగ్యము"అని కొనియాడుచుండ శ్రీగోవిందమిశ్రులానంద మున మైమఱచి "మీాపలుకులు ముమ్మాటికి నిజము"నిరి. స్వ ప్రశంసభాగవతులు జేయుచుండ నైచ్యమునావంతయు నగ పరచకుండుటను శ్రీయతిరాజులవారు గమనించి "గోవిందా! భాగవతులు నీసుగుణములు ప్రశంసించుచుండ నైచ్యము నణుమాత్రమైన నగపఱపకుండుట స్వరూపహానికరముగదా" యనిరి. అపుడు శ్రీగోవిందమిశ్రులంజలిఘటించి "దాసుని గుఱించి వారొనర్చినస్తుతియంతయు దేవరవారికేగదా యన్వ యించును. స్పర్శవేది సంబంధముచే ఇనుము హేమమగు చునగది ఆదినుండియు యచిత్ప్రాయుడనైయుండిన నీదాసుని దేవరవారి దివ్యకటాక్షముచే నాకర్షించి స్వరూపజ్ఞునిగ నొన ర్చితిరి. దేవరవారికిని దాసునికిని శరీరసంబంధముండకున్న నిటుల సర్వదాజరిగియుండదని నిశ్చయించుకొని యుండుటచే శరీరపరిశంస శరీరపర్యంతము అన్వయించుననుకొని నైచ్య మును జూపకుంటిని"అనిరి. వారిసమాధానమునకు శ్రీయతీం ద్రులును, భాగవతులును, మిక్కిలిత్రుప్తినొందిరి. మఱియొక

నాఁడు వేకువజామున కాలకృత్యములు నిర్వర్తింప కావేరి కరుగుచు మార్గమధ్యమున నొకవేశ్యాగృహమునుండి పాట వినవచ్చుటచే శ్రీగోవిందమిశ్రులచ్చటనే యాగిరి ప్రక్కన వచ్చుచు బోవుచుండినవారిని సహితము వారుగమనించి నటుల లేదు. "ఈయన వేశ్యాలోలుఁడు గాకున్న నిచటపాటలు వినుట కై నిలుచుండునా"యని కొందఱు భాగవతు లనుకొనుచు పోయి శ్రీయతిరాజులవారిసన్నిధిలో నాసంగతి విన్నవించిరి. శ్రీయతిరాజులవారు శ్రీగోవిందమిశ్రుల బిలిపించి "గోవిందా! ఈనాటియుదయము నీవునిత్యకర్మానుష్ఠానములు సహితము మఱచి యొకవేశ్యవాకిటియొద్దనిలిచి యుండినటుల దెలియ వచ్చుచున్నది. ఇట్టివిపరీతచర్యకు నీవేమందువు?"అనిరి. అందు కువారు "స్వామీ! భాగవతులు వాస్తవముగనే వచించిరి. దేవరవారి దివ్యకల్యాణగుణ సంకీర్తన మొకవేశ్యాగృహమున నెవ్వఁడో యొకపురుషుఁడు చేయుచుండ నదిదాసునినొకయుఁడు నైన నావలనుంచుట కశక్తునిగావించి మంత్రముగ్ధునివలె నొనర్చినది. సంకీర్తనము ముగియఁగనే నదివేశ్యావాటికయని దెలిసి మఱుక్షణమే యందుండి కావేరీనది కేగి నిత్యకర్మాను ష్ఠానములు ముగించుకొని యిప్పుడిప్పుడే వచ్చియుంటిని."అని విజ్ఞాపన జేయుచుండ నచటనుండిన మఱికొందఱు భాగవతులు "పిరన్నదివ స్తవము. యెవఁడోయొక గాయకోత్తముఁడు భగ ద్భాగవత సంకీర్తనము సలుపుచు నీనగరమున వేకువజామున

లేచి తిరుగుచున్నాడనియు అతనికి నృత్యగీతములందును విశేష పరిచయముగలదనియు ఆకారణముచే భక్తిగలవేశ్యలుసహిత మతనిమాటలువిని సత్కరించుచున్నారనియు వినియున్నాము" అనిరి. వింటాకోపణజేసిన భాగవతులదివిని మోమున విన్న దనముదోప నక్షతచేకొనచ్చిన యుపచారమున కనుతాపపడి శ్రీయతిరాజులవారిని, శ్రీగోవిందమిశ్రులను తమయపరాధము క్షమింపప్రార్థించిప్రణమిల్లి వారిరువురిని సుప్రసన్నులఁగావించియరిగిరి.

శ్రీగోవిందమిశ్రులకు కొంతకాలముక్రిందట వివాహము జరిగియుండినది. వారిమామగారొకనాడు శ్రీయతిరాజులవారి సన్నిధిని ప్రణమిల్లి యంజలిఘటించి "తమకొమార్తె రజస్వల యై కొన్నివారములైనదనియు ఒకసుముహూర్తమున శోభన కల్యాణము నిశ్చయింపబడినదిగాన తమయల్లుడగు శ్రీగోవింద మిశ్రుల నమవెంటతోడుకొనిపోవ నేమన మొసంగుడనియు ప్రార్థించిరి. శ్రీయతిరాజులవారందు కంగీకరించి "శ్రీగోవిందమిశ్రులతో నీవు మీ మామగారివెంటనరిగి శోభనకల్యాణము ముగించుకొనిరమ్మని యాజ్ఞాపించిపంపిరి శోభనకల్యాణము జరిగిన మూడురాత్రులందును శ్రీగోవిందమిశ్రులసతీమణి భర్తనెన్నివిధములనో శయ్యాగృహమున యుపచరింపయత్నించెనుగాని వారామెజేయు నుపచారములు గమనించకుండుట చే విఫలమనోరథయయ్యెను. ఆమె వారి శ్రీపాదములొత్తు

నప్పుడు శ్రీయతిరాజ స్తోత్రపాఠముదక్క మంత్రము వారి వాక్కునుండి వెలువడినది గాదు. యజమానునికిగల ఘన భక్తి కాపాత్త్వమునే యత్యద్భుతమంది మామగారును వారి సన్నిధినుండే గడిపెను. యీగొందిలిదాసుల ద్రుగ్గస్థవైఖరి తెలిసి వ్యాకులపడజొచ్చిరి. అప్పునాపాత్త్వయుని వారితో “పరమభాగవతోత్తముడగు పతిదక్కన, స్వర్గన, పొన్నిక్కి ము లేచాలును. ఈమూత్రైనను భగవదనుగ్రహము వీరివిగ నుండబట్టియే లభించినదని మనంబున కెంతయో తృప్తికరముగ నున్నది. ఇట్టిపరమభాగవతోత్తము డల్లుడయ్యెగదా యని సంతసింపక వ్యాకులపడదగునా? యనివానిని మందలించెను. ఆమెతండ్రి తృప్తినొందక శ్రీయతిరాజులవారిసన్నిధి కరిగి తమయల్లునివైఖరిదెలిపి, యెటులనైన నాయనను చక్క దిద్దమని ప్రార్థించెను. శ్రీవారు శ్రీగోవిందమిశ్రుల పిలిచి నీవు నీయిల్లాలి నుపేక్షించితివని మీమామగారనుచున్నారు. ఇందుకు నీసమాధానమేమి” అని యడిగిరి. అందుకు శ్రీ గోవిందమిశ్రులు, దాసుడేవైపు జూచినను దేవరవారి దివ్య మంగళవిగ్రహము దక్క మఱొకటిగానవచ్చుటలేదు. ఆకారణముచే నావర్తనము వారికటులదోచియుండుట సహజమే” అనిరి. అటులైన “నీ నిశ్చితాభిప్రాయమేమి”యని యడుగ “విహితవిషయ విరక్తునికి సన్న్యాసమేగదా! స్వీకరించదగినది” అనిరి. దానిననుగ్రహించిన ధన్యుడనయ్యెద”ననిరి. మామగారు

చుచుమాటాడక యితనిని దిద్ద సాధ్యపడదనుకొని శ్రీయతి
రాజులవారికి మొక్కించెను. శ్రీయతిరాజులవారును
వారి జ్ఞాన శాస్త్ర వైరాగ్య సంపత్తికి సన్యాసమే యుచితమని
యెంచి వారిని శ్రీరంగనాథసన్నిధికి గొనిపోయి శ్రీయః
పతిని ప్రార్థింపజేసి భగవన్నియమన మర్చకముఖముగ నంది
శాస్త్రోక్తముగ సన్యాసాశ్రమము స్వీకరింపజేసి యెంబారను
దాస్యనామ మనుగ్రహించిరి. శ్రీయెంబారు సన్యాసాశ్రమము
స్వీకరించిన దాదిగ శ్రీయెంబెరుమానారులనే ధారక, పోషక,
భోగ్యముగ ననుసంధించుకొనుచు, కాలము నెమ్మదిగ గడుపు
చుండిరి.

పాఠకమహాశయులారా! శ్రీ అరుళాళప్పెరుమాళ్
(వరదరామానుజులు) యాచార్యానువర్తన వైలక్షణ్యమిక
కొంతవివరింతము. వీరు తమకేర్పరుపబడిన మఠమున
భగవద్భాగవతాచార్యగుణానుభవ మొనర్చుకొనుచుండ
మేలుకోటప్రాంతమునుండి కొందఱు శ్రీవైష్ణవులు యాత్రా
ర్థము శ్రీరంగమునకు వచ్చియుండి శ్రీరంగనాథుని సేవించుకొని
స్వాచార్యమఠ మెచ్చటనున్నది విచారించుచుండ ఆనగర
వాసులలో నొకడు వారినిగని యావీధికి ప్రక్కవీధిలో యెత్తగు
నరుగులతో కొత్తగ నగపడునదియే శ్రీయెంబెరుమానారు
మఠమని జెప్పిపోయెను. ఆ శ్రీవైష్ణవులు ఆయనచెప్పిన గురుతు
ననుసరించి ప్రక్కవీధిలో మొట్టమొదటనే యగపడుచుండు

మకరములోనికరిగి క్రిందనొక యతీశ్వరునిగని ప్రణమిల్లి యంజ
లిబద్ధులై నిలుచుండిరిగాని వారిమోమున విస్మయచిహ్నములు
మాత్రము గాన రాకపోలేదు. అప్పుడచ్చో నివసియుండు యతీ
శ్వరు లది గమనించి వారివిస్మయమునకు కారణమడిగిరి.
అప్పుడు వారు "స్వామీ! మేము మాయాచార్యులగు యెం
బెరుమానారుల సేవింపవచ్చితిమి. వారిందు గానరాకుండు
టచే సంశయచిత్తులమై మాయాచార్యులవారినిగుఱించి దేవర
వారినడుగ జూచుచుంటిమి." అనిరి. అప్పుడాయతీశ్వరులు
"నేనును మీవలెనే శ్రీయెంబెరుమానారుల తిరువడి నాశ్ర
యించినవాడనే. నన్ను ద్రావిడనామమున "అరుళాళప్పె
రుమాళ్ యెంబెరుమానార్" అని పిలుచుచుందురు. మనయా
చార్యులవారిని "ఇళయాళ్వార్ యెంబెరుమానార్" అని పిలుచు
చుందురు. మీకిది తెలియక యెంబెరుమానారుల మకరమె
చ్చట నున్నదనియడుగ పొరబాటున నీమకరము జూపించి యుం
దురు." అని విశదపరచి వారిసంశయము బాపి, వారికి తీర్థ
ప్రసాదములొసంగి స్వయముగనే తమయాచార్యులసన్నిధికి
గొనిపోయి సేవింపజేసిరి. ఈలాటిప్రమాదము లికనెన్ని
మాఱులో తటస్థించి భాగవతాపచారమునకు గుఱియగు
నటుల నొనర్చునని తలంచి శ్రీయెంబెరుమానారుల కెదురు
తట్టుయ ప్రత్యేకమకరమున నుండినందున కనుతాపపడి స్వా
చార్యసన్నిధిలో సాష్టాంగవందనంబాచరించి యంజలిబద్ధులై

నిలిచి "మహాత్మా రెండుమఠము లొకేరామమున నుండుట
చే నాగంతుకులకు భ్రమ, దాసుల కందుచే నపచారము
కలుగునటుల నేర్పడినది. దేవరవారిసన్నిధిలో నుండుటే
దాసుని స్వరూపమున కనురూపము. ఇందుకంగీకరింప దేవర
వారిని బ్రార్థించుచున్నాను" నని వినయమున విజ్ఞాపనంబొ
నర్చిరి. శ్రీ యెంబెరుమానారులును ఔచిత్యమునుగమనించి
యందుకు సమ్మతించిరి. అప్పుడు శ్రీవరదరామానుజులు (అరు
ళాళప్పెరుమాళ్ యెంబెరుమానార్) తాముండిన నూతనమఠ
మును నేలసమముఁగావించి స్వాచార్యసన్నిధిలోఁ జేరి సకల
కైంకర్యము లేమఱక నడుపుచుండిరి. ఇంతేగాక స్వాచార్య
ముఖోల్లాసముగను, పరోజ్జీవనకరముగను నుండునని "జ్ఞాన
సారము" "ప్రమేయసారము" అను రెండుగ్రంథములు రచించి
వాటిని తమయాచార్యసన్నిధియందర్పించి సాగిలబడి మ్రొక్కిరి.
శ్రీవారారెండుగ్రంథములు సాంతముగ కటాక్షించి, సంత
సించి మంగళాశాసనంబొనర్చిరి. ఇటుల శ్రీయరుళాళప్పెరు
మాళ్ యెంబెరుమానార్, శ్రీకూరత్తాళ్వాన్, శ్రీముదలి
యాండాన్, శ్రీకిడాంబియాచ్చాన్, శ్రీ యెంబార్ మున్నగు
శిష్యులు తమతమ నియమిత కైంకర్యములొనర్చుచుండిరి.

శ్రీరంగమునకు సమీపముననుండు నొకదివ్యక్షేత్ర
మున జరుగుచుండు నొకదివ్యోత్సవమున కాక్షేత్రవాసులచే
నాహ్వానింపబడి శ్రీరామానుజయతీంద్రులు శిష్యబృందముతో

వేంచేసి యుత్సవానంతరము మరల శ్రీరంగమునకు వేంచే
యుచుండ మార్గమధ్యమునందు నొకభీకరారణ్యమున కడు
వృద్ధుడగు శ్రీవైష్ణవ భాసురుడొక డొంటరిగ నొకచెట్టు
క్రింద గూర్చుండి కన్నీ రంగవస్త్రముచే దుడుచుకొనుచుం
డెను. శ్రీయతిరాజులవారావృద్ధుని దైన్యస్థితిగనుగొని
శ్రీకూరేశులతో నేకాంతముగ "శ్రీవైష్ణవు డేలకో విషాద
చిత్తుడై యున్నటులఁ దెలియవచ్చుచున్నది. ఆతనివిషాద
మునకు కారణమరసి, సాధ్యమైన శాంతపఱచిరమ్ము. మే
మందఱము తిన్నతిన్నగా బోవుచుందుము" అనిరి. శ్రీకూరే
శులు శ్రీవారి యాజ్ఞచొప్పున నావృద్ధభాసురుని కడకరిగి
మ్రొక్కి యంజలిఘటించి "స్వామీ తమదేగ్రామము? ఏల
యీ యరణ్యమున నీచెట్టుక్రింద నొంటరిగ గూర్చొనియు
న్నారు? మీముఖలక్షణముజూడ నొకగొప్పవిపత్తులోనై
దుఃఖించుచున్నటుల దాసునికి దోచుచున్నది. విషాదకార
ణముదెల్పిన యథోచిగ ముపకరింప యత్నింతు" ననిరి. అప్పు
డాయన కన్నీరుగార్చుచు నాకొకకొమార్తెగలదు ఆమెకు
పెండ్లియీడువచ్చుటచే నాతురమున నాచిన్నదాని జాతక
మొకదైవజ్ఞునికిజూపితిని. ఆయనజాతకము బరిశీలించి "అయ్యా
యీజాతకవిషయమై యున్నదున్నట్లు బలికిన చిన్నబోవుదు
వేమో. తెలిసినదానిని దాచుట మహాదోషము. అందుచే
నిజముజెప్పకతీరదు. ఈచిన్నదాని జాతకములో భర్తస్థాన

మున శనిరాహువులుండుటచే నీచిన్నదానిని వివాహమాడిన భర్త తాళికట్టి పెండ్లిపీటనుండి దిగినవెంటనే ప్రాణము విడుచును. ఇది గ్రహశాంతిచే నణఁగునదిగాదు. శనిదశా రాహుభుక్తియే యిప్పుడుజరుగుచున్నది. కాలవిలంబమున గురుభుక్తివరకు వేచియుండిన నీయనిష్టము తొలగిపోవచ్చునని పలికెను. ఈవిషయము చెవినిబడినది మొదలు ఈడుమీర వచ్చిన కన్యకువివాహముచేయకున్న దోషము, అపకీర్తి, చేసిన నీఘోరవిపత్తు సంభవించుననుభయము, ఈయుభయసంకటస్థితిచే నిద్రాహారములుమాని దుఃఖించుచు తుదకు ప్రాణత్యాగముజేయ నిశ్చయించుకొని యిల్లువిడిచివచ్చి ఈ చెట్టుక్రింద కూర్చుండి దుఃఖించుచున్నవాడ. ఈవిషయమంతయు మాయింటిలో నాభార్యమున్నగువారికి దెల్పిన అని యింకను యేమియో తెలుపబోవుచు “కొమార్తె జాతకము ఇదియేయని శ్రీకూరేశులకిచ్చెను. తానును దానినొకమారు కటాక్షించి, స్వామీ! ప్రాణత్యాగము మహాపాపహేతువు. మీరువిచారపడవలదు. మీకొమార్తెను దాసునికొసంగుడు మీవిపత్తు తప్పకతొలగిపోవు”ననిరి. అప్పుడాశ్రీవైష్ణవుడు యాశ్చర్యపడి “అయ్యా! ప్రాణభయము మీకుమాత్ర ముండదా”యనెను. “ఆవిచారము మీకక్కర లేదు అది తొలగించుకొను నుపాయముఁ దెలిసియే యిట్టుల ధైర్యమున బలికితి”ననిరి. అప్పుడావృద్ధుడు సంతసమున “అయ్యా నా

పాలిటి శ్రీరంగనాథుడే మీరూపమునవచ్చి నాదుఃఖముం తమొందించి దరిజేర్పదలచెను. ఈదినమున కయిదవదినమున శుభముహూర్తమున్నది. ఆదినము వివాహముజరిపింప నిశ్చయింపవచ్చునుగదా" యనెను. శ్రీకూరేశులు "తప్పక జరిపింపవలసినదే. మీరునన్ను పిలువ రానక్కరలేదు. "నేటికి మూడవదినమున ప్రాతఃకాలముననే మిమ్ముదర్శింతుము. ఇక మీరు నిర్విచారముగ నుండుడు" అనిరి. ఆభూసురుడు, తమ గ్రామము పేరు శ్రీకూరేశులకు దెలిపి సంతసమున నరిగెను. శ్రీకూరేశులును శ్రీయతిరాజులవారిని కలిసికొని జరిగినవృత్తాంతమంతయు విజ్ఞాపనంబొనర్చిరి. శ్రీయతిరాజులవారు "నీ వేయుపాయమున నీగ్రహదోషము దప్పించుకొనందలచితి" వనిరి. అప్పుడు శ్రీకూరేశులు శ్రీవారికి రహస్యముగ నేమియో విజ్ఞాపనంబొనర్చి తృప్తిపడిరి. తాముజెప్పిన ప్రకారము శ్రీకూరేశులు శ్రీరంగముజేరిన రెండవదినమే శ్రీరామానుజయతీంద్రుల యనుజ్ఞవడసి యావృద్ధవైష్ణవ భూసురుడుండు గ్రామముజేరి ఆయనను సంతసింపజేసిరి. వివాహము సుముహూర్తమున యథావిధిజరిగెను. భూసురాశీర్వచనము ముగియగనే యఖిలభాగవతబృందమధ్యమున యంజలిఘటించి శ్రీకూరేశులు "త్రికరణశుద్ధిగ నే నీక్షణమునుండి వానప్రస్థాశ్రమము స్వీకరించితినని బలికి పెండ్లిపీటమీదినుండిదిగి మామగారికి ప్రణమిల్లి నేనాశ్రమాంతరము స్వీకరించుటచే నాకు

ప్రాణభయము లేదు. దైవజ్ఞుడు మీకొమార్తె జాతకములో
భర్తృభావమునకు బలమగు గురుదృష్టియుండుటఁ గమనించిన
వాఁడగాన. ఇకమీఁదు నిర్విచారముగనుండుఁడని వారి
నంబజీని సంతోషపరచి తనకుఁ బ్రియమల్లిన పెండ్లికొమార్తె
నాశీర్వదించి శ్రీరంగమునకువిచ్చేసి శ్రీయతిరాజులవారి
సన్నిధినంతయు విజ్ఞాపనంబొనర్చిరి. శ్రీయతిరాజులవారును,
శ్రీకూరేశుల దయార్ద్రహృదయమునకును సమయోచితజ్ఞాన
మునకును చాలసంతసించిరి. అవలకొన్నిదినములుగడవ నొక
నాఁడు శ్రీకూరేశాది భాగవతోత్తములగని శ్రీయతిరాజుల
వారు, పరమాచార్యులగు శ్రీయాళవందార్ ముఖోల్లాసముగ
శ్రీవేదవ్యాసరచిత బ్రహ్మసూత్రములకు భాష్యమొండు
రచింపవలసియున్నది. మహర్షియభిప్రాయము తచ్ఛిష్యులకే
కరతలామలకముగనుండును. గనుకనే వారిశిష్యులలో నొక
రగు శ్రీబోధాయనమహర్షి స్వాచార్యరచిత బ్రహ్మసూత్ర
ములకు వృత్తియను నొకగ్రంథము విశదముగరచించి, తమ
యాచార్యులకుజూపి వారిమెప్పువడసినటుల పెద్దలువాక్రుచ్చు
చుందురు. ఆవృత్తిగ్రంథము కాశ్మీరదేశస్థ శ్రీనగరమున
శారదాపీఠాఖ్య గ్రంథాలయమున నున్నటుల ఆప్తులెందఱో
దెల్పియున్నారు. దానినెవ్వరైన సేకరింపగలిగితిమేని భాష్య
రచన సులభమగును. ఈకైంకర్యముముముక్షువుల కుపకరిం
చుటచే శ్రీయఃపతికి విశేషముఖోల్లాసకరముగ నుండకపోదు.

దీనిపై విూయభిప్రాయ మేమి"యని యడుగ శిష్యులందఱు దేవ
రవారి తిరువక్త్రము (విూయభిప్రాయము) ననుసరించియే యీ
విలక్షణ కైంకర్యమున దేవరవారు సేవించినపిదప సర్వాంగ
సంసిద్ధులమైతిమి. శ్రీవరదరామానుజులు (శ్రీఅనంతాళ్వారు
మాళ్వార్ యెంబెరుమానార్, లేచి యంజలిఘటించి "దాసుడుత్తర
దేశమున చిరకాలముండుటనుబట్టి విూవెంటవచ్చి ఆగ్రంథ
మును సేకరింప తోడ్పడుదునని విజ్ఞాపనంబొనర్చిరి. అప్పుడు
శ్రీయతిరాజులవారు శిష్యులప్రోత్సాహమునకు సంతసించి
ఫలపుష్పాది పూజాద్రవ్యములతో శ్రీరంగనాథుని సన్నిధాన
మునకరిగి ప్రణవవిమానమున కంజలిఘటించి ప్రదక్షిణము
నర్చి శ్రీవిష్వక్సేన, బలిపీఠ, ధ్వజస్తంభములకును ప్రణమిల్లి
గర్భాలయముజొచ్చి పూజాద్రవ్యములు శ్రీరంగనాథుని
సన్నిధి నర్పించి సేవించి ధ్యానించుచుండిరి. ఆరాధనానంత
రము, శ్రీయతిరాజులవారికిని, శ్రీకూరేశాది భాగవతోత్తము
లకును సంప్రదాయానుసారము తీర్థ, శఠగోపాది సత్కార
ములు జరిగినవెనుక తమకాశ్మీరప్రయాణోద్దేశము శ్రీరంగ
నాథుని సన్నిధిలో విజ్ఞాపనంబొనర్చి యనుజ్ఞ వేడిరి. శ్రీరంగ
నాథుడును యర్చకముఖముగ "యతిరాజా! శ్రీకూరేశ, వరద
రామానుజాది భాగవతులసహాయముచే నీవ్రదలంచినకార్య
ము తప్పక నెఱవేరును. సుఖముగపోయిరమ్మ"ని యనుజ్ఞ
నొసంగిరి. శ్రీయతీంద్రులిట్లుల భగవదనుజ్ఞవడసి శ్రీకూరే

స్వాములతో స్వమతమును చెప్పి తాము నుకమున లేనిసమయమున మఠమునను, కోవెలలోను, భగవద్భాగవత కైంకర్యము లేమఱక నడుపుచుండ కొందఱు శిష్యులనేమించి మఱుదినమే శ్రీయతిరాజేశ, శ్రీవరదరామానుజాది కతిపయశిష్యులతో ఉత్తరదేశమునకు పయనమై వేంచేసిరి.

పదవగుచ్ఛము సమాప్తము.



శ్రీమతే రామానుజాయ నమః.



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - ఎనిమిదవగుచ్ఛము.

### భగవద్రామానుజ యతీంద్రులకు కాశ్మీరదేశమున భగవద్బోధాయనవృత్తి లభించుట.

కాశ్మీరదేశము భారతమాతకు శిరమువంటిది. మాత శిరమున ప్రతుష్ఠిల పురోవృద్ధికి వలయు సంకల్పశక్తి లెల్లకొదువలేకయుండునో ఇచ్చటను మానవప్రవృత్తి నివృత్తిమార్గములకు వలయుపరికరములన్నియుఁగలవు. ఇహాభోగపరికరములకై వేకారువారు ప్రవృత్తిమార్గావలంబకులు. పరభోగపరికరములకై వేకారువారు నివృత్తిమార్గావలంబకులు. "ఆవిరించాదమంగళ"మనునట్లు సత్యలోకపర్యంతము ఇహభోగములకై ఏర్పడిన పరికరములుగలవే. విరజానది కావలనే నిజముగ సర్వమంగళకరమగు దివ్యభోగ పరికరములుండులోకములు. మనకాశ్మీరదేశమున నిహాభోగపరికరము

లగు తియ్యని పల్లపునీరము, కమ్మనిఫలము, ధాన్యము, పుష్పములు సువాసనను నలుదిక్కుల వెదజల్లు నానాజాతితరు లతానికుంజములు, విశ్రాంతి విహారముల కుపకరించు క్రీడా రామశైలములు, నేత్రశ్రోత్రముల కానందము గొల్పు నవరస భరిత నృత్యగీత కళాశాలలు మొదలగు పరికరములెన్నియో గలవు. ఇదిగాక పన్నీరు, పచ్చకర్పూరము, కేసరి, కస్తూరి పునుగుజవ్వాది శ్రీగంధము మొదలగు సుగంధ పరిమళద్రవ్య ములకు నిధి యాదేశము. అశాశ్వత దేహభోగములకే ఇన్ని పరికరము లుండఁగ ఆర్యావర్తము కర్మపృథ్వీభూమియని అనాదిగ నెన్నికగాంచిన యీదేశమున నాత్మోజ్జీవన పరికర ములకు నేమికొఱత? కేవల నాత్మానుభవజ్ఞానులై భగవ ద్ధ్యాన తత్పరులును వివిక్తస్థలముల గానవచ్చుచుందురు. కర్మ జ్ఞాన భక్తి ప్రబోధకములగు గ్రంథములును, అట్టిగ్రంథసా రము గ్రోలి తన్మాధుర్యమును తదీయులకందఁజేయు నితాం తాపారదయాపరులును ఆగంతుకులగు ముముక్షువుల కుపక రించు గ్రంథాలయములును, స్నానసంధ్యాద్యనుష్ఠానములు నిర్విఘ్నముగ నెఱవేర్చుకొనుటకు ప్రశాంతసరోవరములును, భగవదర్చారాధనా తత్పరులును వారికుపకరించు రమ్యా లయములును వలసినన్ని గలవు. ఆ దేశమందంతటను ఇట్టి ఇహపరసుఖ పరికరములున్నను భారతమాతశిరమున చూడా మణియై యలరారు ముఖ్యపట్టణమున అవి విరివిగఁగానవచ్చు

వని యీనగరనామమే చెప్పఁబడుచున్నది. అదియే శ్రీనిల
యమగు శ్రీనగరము. ఈదేశమునకిది ముఖ్యపట్టణమగుటచే
పరమధార్మికులగు ఆదేశాధిపతు లీనగరమందే నివాసముండు వా
రగుచుండు కలిమికర్త్రైయోయన నొకయద్భుత గ్రంథా
లయమునాదిగ నచ్చట నెలకొనినది. అదియే శారదాపీఠమని
యభిజ్ఞులచే పిలువఁబడుచున్నది. ఈనగరాధిపతి యాస్థాన
మున నాకాలమున నిఖిలశాస్త్రపురాణేతిహాసములం దారితేరిన
విద్వాంసులెందరో నిర్విచారముగ కాలముగడుపుచుండిరి.
ఇట్టిపండితులపాలిటి పారిజాతమగునొక్క నృపవరేణ్యుని
ప్రాసాదమువద్ద నొకనాఁటియుదయమున వానప్రస్థాశ్రమి
యుంబోలె దీర్ఘశ్మశ్రు జటామండితుఁడును, అసితవర్ణుఁడును,
స్థూలకాయుఁడును, హ్రస్వదేహియు, ద్వాదశోర్ధ్వపుండ్రా
లంకృతుఁడును శంఖచక్రాంకిత బాహుమూలుండును, తులసీ
నళినాక్షమాలావక్షస్కుఁడును సంతత చతురక్షరీ మంత్రజప
స్ఫురితాధరుండును నగునొక శ్రీవైష్ణవశిఖామణి యరిగి యీ
రాజుగారిని దర్శించుటకిది యనుకూలసమయమేనాయని ద్వార
రక్షకులనడిగెను. వారాయనగంభీరాకారముగని యెవ్వఁడో
గొప్పవిద్వాంసుఁడై యుండునోపునని యెంచి క్షణకాలమా
గుడు. లోనికివెళ్లి కనుగొనివచ్చెదమని రాజాంతఃపురము
లోనికివెళ్ళి ప్రభువునకు నమస్కరించి యొకదాక్షిణాత్య
శ్రీవైష్ణవుఁడు తమదర్శనార్థమై ద్వారమువద్దకాచియున్నాఁడని

సన్నవింపగనే యానృపవరేణ్యుడు తప్పక వారినితోడి తెండని యాజ్ఞాపించెను. భృత్యులును ద్వారముకడ కాచియున్న యావైష్ణవోత్తమునకీవార్తఁదెలిపి ఆయనను లోనికి గొనిపోయిరి. అంతఃపురమున రాజును, రాజునకు ఆనాటి తిథివార నక్షత్రములు వినిపింపవచ్చిన రాజపురోహితుఁడును తప్ప మఱెవ్వరును లేనిసమయమది. రాజును పురోహితుడును ఆశ్రీవైష్ణవశిఖామణినిమూడఁగనే లేచి వినయవినమ్రులై నమస్కరించిరి. రాజు వారినున్నతాసనాసీనులంజేసి వారియాజ్ఞచే తానును తనసింహాసనమున గూర్చుండెను. పురోహితుఁడు రాజాజ్ఞగొని తనగృహమునకరిగెను. పిమ్మట రాజుగారికిని శ్రీవైష్ణవశిఖామణికి ఈక్రిందిసంభాషణము జరిగినది.

రాజు:- స్వామీ తామీప్రాంతములకు క్రొత్తవారుగతోచెదిని. తమదేశము?

శ్రీవైష్ణవుడు:- చోళదేశము.

రాజు:- గ్రామము.

శ్రీవైష్ణవుడు:- ఉభయకావేరిమధ్యస్థ శ్రీరంగనగరము.

రాజు:- భాగ్యము. తమనామధేయము?

శ్రీవైష్ణవుడు:- కూరనాథాచార్యుఁడందురు.

రాజు:- ఆదివ్యదేశమునుండి తామొక్కరే ఇంతదూరము మార్గాయాసమునకోర్చి విచ్చేయవలయునన్న నెద్దియో గొప్పఉద్దేశముండకపోదని దలచెదను.

శ్రీవైష్ణవుడు:- నేనొక్కఁడనే యిప్పటికిఁ రాలేదు. మాఆచార్యులును వారియంతేవాసులు మఱియనేకులును మీ రన్నట్టు లోకఘనకార్యమునిమిత్తమే యిందు రావలసి వచ్చినది.

రాజు:- తమయాచార్యులును మిగతవారును ఎందున్నారు? వారినామధేయమేమి?

శ్రీవైష్ణవుడు:- శ్రీమద్రామానుజయతీంద్రులు మా యేలినవారు. గోవిందదాశరథులనువారు వారిశిష్యులు. మీగ్రామపరిసరమున ఆగంతుకులకు మీరునిర్మించిన ధర్మశాలలో వేంచేసియున్నారు.

రాజు:- (శ్రీమద్రామానుజయతీంద్రులనగనే ప్రభువు పులకీకృతగాత్రుఁడై యతీంద్రులరాకకు ఆశ్చర్యానందమగ్నమానసుఁడై) యతీంద్రులును, తదీయులగు మీవంటి మహాత్ములునువిచ్చేసి మాదేశము పవిత్రము నర్చితిరి. మాతండ్రితాతలనాటినుండి మాకు బ్రాహ్మణభక్తి అధికము. ఇప్పటికిని భాగవతపురాణశ్రవణము నిత్యవ్రతముగ నేర్పఱచుకొనియున్నాను. దీనికంతకును బ్రాహ్మణాశీర్వాదమే కారణము. అని రాజు సేవకునిపిలిచి మనధర్మశాలలో శ్రీవైష్ణవస్వాములు దిగియున్నారు. వారియారాధనకు వలయుపరికరములను సిద్ధపఱచివుంచ ప్రధానామాత్యునకు నాయాజ్ఞగాదెల్పుము.

శ్రమనుగ పొమ్మని సేవకునిపంపి తమరాకకు కారణము
తెలిపిన్నన యతోచితముగ ఉపకరించి ధన్యుండనగుదునని
యా శ్రీ వైష్ణవశిఖామణితోఁ బల్కెను.

శ్రీవైష్ణవుడు:- మీనగరమున అనాదినుండి మీపెద్దలచే స్థాపి
తముగు పుస్తకభాండాగారముగలదనియు, అందుబుషి
ప్రోక్త ప్రాచీనగ్రంథములెన్నియో గలవనియు మీ
నగరమునకు వచ్చెడు యాత్రికులెందరినుండియో
వినియుండి అందుమూలక మహర్షిప్రోక్త గ్రంథము
కావలసియుండి యింతదూరము రావలసివచ్చెను.
ఇందుకు మీపుస్తకభాండాగారములోని గ్రంథము
లనుచూడ మీయాజ్ఞ అవసరముగదా?

రాజు:- మహర్షిప్రోక్తమగు నేగ్రంథము మీరు జూడఁగో
రెదరు?

శ్రీవైష్ణవుడు:- భగవద్బోధాయనస్మృతి.

రాజు:- మీరుకోరిన గ్రంథములు పోయిచూడవచ్చును.
అందుండు మాయుద్యోగి కిదేచీటియిత్తునని ఒకచీటి
వ్రాసి ఇదిగోనిపోయిచూచిన తప్పక మీకువలసిన
ట్లుపకరింపఁగలఁడు. రేపటియుదయము నేనును శ్రీ
యతీంద్రులవారి దర్శనమునకైవచ్చెదను. అనిఒక
సేవకునిపిలిచి అతనిచెవిలో నేమియోచెప్పెను. వెంట
నే వాఁడుపోయి ఒకబంగారుతట్టలో ఫలపుష్ప

తాంబూలముల గొనివచ్చెను. రాజనియర్పించి సాష్టాంగముగ నమస్కరించి యా శ్రీవైష్ణవ శిఖామణి యాశీర్వాదముఁబొందెను. అనంతరము రాజువారిని ద్వారముకడకువచ్చి సాగనంపి శేషదినమున తానే ధర్మశాలలో ప్రసద్దర్శనము చేసికొందుననిపలికి నమస్కరించి లోనికరిగెను. కూరనాథాచార్యులును తాముదిగియుండిన ధర్మశాలచేరి జరిగినవృత్తాంత మంతయు యతీంద్రుల కెఱింగించి రాజిచ్చిన పత్రి చూపిరి. వారందులకు సంతసించి భగవదారాధ నాది నిత్యవిధులు ముగించుకొని యపరాహ్ణవేళ సుముహూర్తమున గోవింద కూరేశ దాశరథులను వెంటఁ గొని శ్రీసరస్వతీభాండాగారమున కరిగిరి. భాండాగా రమున నానామతములకుఁజేరిన పండితులు తమతమ మతావబోధకములగు గ్రంథములు పరిశీలించుచుండిరి. కూరేశులు తాము ప్రభుప్రకడ గొనివచ్చిన యధికార పత్రమును భాండాగార రక్షకునికి చూపగనే ఉచిత మర్యాదతో ఆవచ్చిన నల్వురు వైష్ణవోత్తములను లోనికిఁగొనిపోయి వేదాంతశాస్త్రగ్రంథరాజములున్న ఒకవిశాలభవనములోనికిఁ గొనివచ్చి గ్రంథముల జాబి తాయొకటి వారికొసంగిపోయెను. యతీంద్రులవా రాజాబితాచూచుకొని తాముకోరిన భగవద్బోధా

యనవృత్తియను శ్రీకోశమునందు కనపడిచియుండుట
ను శిష్యులకుజూపి శ్రియఃపతి సంకల్పముచే తామను
కొన్న కార్యముకొఱవేఱవచ్చునని పల్కిరి. బోధా
యనవృత్తియేగాక కేవల మహర్షిప్రణీత స్మృత్యాగ
మేతిహాస పురాణగ్రంథముల యొక్కయు, శ్రీపరాం
కుశ పరకాలనాథ యామునేయాది పరమభాగవత
ప్రణీత గ్రంథములయొక్కయు నామములు జాబితా
లోఁగానవచ్చెను. శ్రీకోశముతో నిండియుండు బీరు
వాలన్నియు పరిశీలించి అందు బోధాయనవృత్తిగల
తాళపత్రగ్రంథము లభింప దానిని బహుగ్రంథపరిశీ
లన కార్యవిముక్తులైయుండు శిష్యులకుఁజూపిరి. ఆ
తాళపత్రగ్రంథ మతిప్రాచీనమైనదగుటచే కాఁబోలు
ఒక కొంచెకాలమునకు సంపూర్ణముగ శిథిలమగులాగున
గానవచ్చెను. ఈ గ్రంథమును సావధానముగ సేవింప
కాలవ్యవధి చాలకుండుటచే తాముదిగియున్న బసకు
దానినిగొనిపోయి చూడవచ్చునాయని గ్రంథాలయ
రక్షకునడిగిరి. అందుకు ప్రభువుగారియాజ్ఞ గావల
యునని యాతఁడు పల్కెను. మరికొంతకాలముదా
మాగ్రంథము పరిశీలించి సూర్యాస్తమయసమయము
గావచ్చినందున మరుదినము పరిశీలింపవచ్చునని యను
కొని గ్రంథమును రక్షకునకొప్పగించి యతీంద్రులు

శిష్యసమేతముగ తాముదిగియుండిన బసకువచ్చి చేరి
కొనిరి. మరుదిన ముదయమున శ్రీమద్రామానుజ
యతీంద్రులు నిత్యకర్మానుష్ఠానములు తీర్చుకొని
విశ్రాంతిగ శిష్యులతో సంభాషించు సమయమున
రాజభటుడొకడువచ్చి యతీంద్రులకు మ్రొక్కి మా
ప్రభువుగారు తమదర్శనార్థము వచ్చుచున్నారనియు
ఈసంగతి తమకు ముందుగ మనవిచేయుమన్నారనియు
పలికెను. రామానుజు లందుకు సంతసించిరి. శిష్యులు
ప్రభువురాకకై ద్వారముకడ నిరీక్షించుచుండిరి. కతి
పయపరివారముతో రాజవిష్వేశి రామానుజ శిష్యు
లకు మ్రొక్కి లోనికివెళ్ళి శ్రీమద్రామానుజ యతీం
ద్రులసన్నిధిలో తాముకొనివచ్చిన ఫలపుష్పాది
పూజాద్రవ్యములర్పించి సాష్టాంగ దండప్రణామమిడి
అంజలిబద్ధుడై నిలుచుండెను. ప్రభువువెంటవచ్చిన
వారును "యథా రాజా తథా ప్రజా" అను న్యాయము
ననుసరించిరి. శ్రీమద్రామానుజులును ప్రభువులను త
త్పరివారమును ఆశీర్వదించి యుచితస్థలములకూర్చుండ
నియోగించిరి. పిమ్మట శ్రీయతీంద్రరాజేంద్రుల కీ
క్రింది సంభాషణజరిగినది.

ప్రభువు:- సకలవేదాంత విద్యాపారీణులని విఖ్యాతిగాంచిన
తమదర్శనభాగ్యము నావంటియల్పజ్ఞుని కబ్బుట పర

మదయాపకుడగు పరమేశ్వరుని కటాక్షఫలమే గాని వేరుగాదు.

యతీంద్రులు:- ధార్మికులగు ప్రభువులకడను నెందరో మావంటివా రనుదినంబును వచ్చుచునేయుందురు. దానికేమి గాని వీరును మీదేశవాసులును వ్యాధిదుర్భిక్ష తస్కరాద్యుపద్రవములు లేక నెమ్మదిగ నుందురని తలంచెద.

ప్రభువు:- తమయాశీర్వచనబలముచే నందరము నెమ్మదిగ కాలము త్రోసిపుచ్చుచున్నారము.

యతీంద్రులు:- మీరాజ్యము లక్ష్మీకటాక్షమునకుతోడు సరస్వతీకటాక్షమునకును నిలయమై యుండుటనుగని సంతసించుచున్నాను.

ప్రభువు:-వంశపారంపర్యముగ మాపెద్దలు కేవల వైదికవిద్యాభిమానులగుటంబట్టి బహుగ్రంథములు సేకరించి గొప్ప గ్రంథాలయమును నెలకొల్పి దానికి శారదాపీఠమను పూజ్యనామమేర్పచిరి. అందునకు వెన్నెలవైభవము వలె నావంటివారికి నిగ్రంథసార్వరస్యము భావము. పరోజ్జీవన పరత్వముగల మీవంటిమహాత్ము లున్నప్పుడుగదా ఆగ్రంథకర్తల ప్రయాసము సార్థకమగును.

యతీంద్రులు:- సంగీతసాహిత్యాది లలితకళలింకను పోషింపఁబడుచున్నవి. ప్రకాశకులును వేసకువేలు గాన

వచ్చుచుందురు, కాని యాత్మోజ్జీవనకరములగు గ్రంథములను బోధించువారునుఅరుదు. అభిరుచితో వారి బోధవినువారునుఅరుదు. త్రేతాయుగకాల మింతక న్నను ఎంతయోఘనకాలముగదా. ఆకాలముననే భగవత్ప్రభావమును చవిఁజూచిన మారీచుఁడే రావణునితో"సులభాః పురుషారాజన్ సతతం ప్రియవాదినః అప్రియస్యచపథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః." (మిగుల మెచ్చుకపు ప్రియముమాటలాడువారును వినువారును సులభముగ గానవత్తురుగాని తాత్కాలికముగ నప్రియముగతోచినను ఆత్మకుహితకరమగుమాటలుచెప్పువారును వినువారును లభించుట దుర్లభము.) అనిగదా పల్కినాఁడు. ఆకాలముననే అటుండ నేకాలముననవి చెదలుపట్టుచుండ చవిచూచుచుండును గాని మానవులకు రుచించుట దుర్లభముగదా! అన్నట్లు నిన్నటిదినము మీగ్రంథాలయమునకుపోయి గ్రంథములను పరిశీలించు అవకాశము మీయాదరాతిశయముచేకల్గినది. అందు బోధాయనవృత్తియను వేదాంతగ్రంథము కొరకై వెదకనగుపడినదిగాని యది క్రిమిభక్షితమగుచుండుటను చూడ మిక్కిలివ్యాకులతకల్గినది. మరి కొన్నిదినములలోనే అదిపూర్తిగా నమసిపోవునని తలంతును. మీరిప్పటికైన నట్టిశాశ్వతగ్రంథముల

నెత్తి వ్రాయించిన మహోపకారకులగుదురు.

ప్రభువు:- "విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమమ్। నహి వంధ్యావిజానాతి గుర్వీంప్రసవ వేదనామ్॥" (విద్వాంసులకే విద్వాంసులకష్టములు తెలియునుగాని తక్కిన వారికేమి తెలియును? ప్రసవ వేదన గొడ్రాలికి తెలియునుగదా?) అన్నట్లు పరోజ్జీవనపరతచే మహాత్ము లెంతశ్రమపడి రచించియుండిరో ఆగ్రంథములు భవాదృశులకే తెలియును. ఇంతవరకు నిట్టియమూల్యమగు హితము నాచెవిని వేసినవారు లేరు. తమయాజ్ఞానుసారము ప్రాచీనవైదిక గ్రంథములను మరల నెత్తివ్రాయింప యత్నించెదను. తామిచ్చట ఉండదలంచుకొనిన దినములలో తమకువలసిన పరికరముల నొసగుటకు సంసిద్ధుండనైయున్నాడను. మాభటుల నిరుప్రసరించదే యుంచియుంచెను. వారు మీయాజ్ఞాబద్ధులై వర్తింతురు.

యతీంద్రులు:- విరాగులుకోరదగిన విశేషవస్తువులేముండును? మేమిందు కొద్దికాలమేయుందుము. మాకు కావలసినది వృత్తిగ్రంథము. మహర్షియభిప్రాయము లతిని గూఢములు. అవి జనసామాన్యమునకు సుబోధమగునటుల చేయవలెనని మాఉద్దేశము. రాత్రికాలముగూడ గ్రంథపరిశీలనకై : నియోగించిననే

మేముండుకొద్దికాలములో గ్రంథాభిప్రాయ మవగా
హనముచేసికొన వీలుండదు. గ్రంథమిప్పటికి గొని
వచ్చుటకు మీయాజ్ఞకావలయునని గ్రంథాలయాధి
కారిచెప్పుచున్నాడు. అందుకు మీరనుమతింతురా?

ప్రభువు:- గ్రంథములవిషయమై మేమే కొన్నికట్టుదిట్టముల
నేర్పఱచియుంటిమి. గ్రంథములు స్థలాంతరమునకుఁ
గొనిపోవ ఏర్పాటులేదు. కనుమూడుదినములు
మీవద్దనుంచుకొను ఏర్పాటుచేయుదును. అంతను
మించిపరిశీలింపవలసి యుండునా?

యతీంద్రులు, శిష్యులఅభిప్రాయమెట్లోయని వారివంకఁజూ
చిరి. అప్పుడుగూరేసుడంతమాత్ర మవకాశమిచ్చిన
చాలుననియభిప్రాయమని యతీంద్రులతోననిరి. మిగత
శిష్యులాయవధి చాలకున్న మరియొకదినముంచుకొన
నవకాశముండునాయనిరి.

ప్రభువు:- మీరుగోర్పులోకోపకార మొనర్పబూనినపుడు
మీమనస్సుకు కొఱతకలుగఁజేసి కార్యవిఘ్న మాచ
రించుటతగదు. ఐదుదినములలో గ్రంథముపరిశీలించి
గ్రంథాలయాధికారివశము చేయుఁడు.

యతీంద్రులు:- పరమసంతోషము. ఆమాత్ర మవకాశమి
చ్చిన మాకార్యము నెఱవేఱినట్లే. కీర్తికాంత వరింప
నున్నవారి సంకల్పములిట్టివిగాగదా యుండవలయు.

ప్రభువులేచి దండముసమర్పించి యతీంద్రులఆజ్ఞ వేడిరి. యతీంద్రులు ప్రభువునకు ఫలమంత్రాక్షతలొసంగి యాశీర్వదించిరి. తక్కినవారును యతీంద్రులకు మ్రొక్కి వారిఆశీర్వాదములువడసిరి. తాము వేంచేయులోపల పునర్దర్శనము చేసికొందుమనిచెప్పి ప్రభువు సపరివారముగ స్వగృహమున కరిగెను.

ఎనిమిదవగుచ్ఛము సమాప్తము.



శ్రీమతే రామానుజాయ నమః.



# శ్రీ రామానుజ ప్రభావ కల్పకము.

## ఉత్తరభాగము. - తొమ్మిదవగుచ్ఛము.

### భగవద్రామానుజయతీంద్రులు భగవద్బోధాయనవృత్తిలోని యంశములన్నియు గ్రహించి శ్రీరంగము చేరుకొనుట.

శ్రీమద్రామానుజులవారు శిష్యసమేతముగ సరస్వతీ భాండాగారమునకు వేంచేసి యనుదినమును భగవద్బోధాయన వృత్తి పరిశీలించుచుండిరి. ఇట్లు మూడుదినంబులుగను గ్రంథము సాంతముగ పరిశీలించుటయైనది. రాత్రికాలములందును శిష్యులు సైతము శ్రీకోశమును పరిశీలించుటలో యథాశక్తి యతీంద్రులకు తోడ్పడుచుండిరి. ఆదినము రాత్రి గ్రంథము తమబసకు తెచ్చుకొని మిగిలినయంశములన్నియు మనస్సునకు అవగాహన చేసికొనవలసియుండెను. మఱిరెండుదినములు గూడ రాత్రి గ్రంథముచూచుకొన గ్రంథాలయాధికారితో సంతసులరై మాటలాడ తలంచుచుండ కూరేశులు యతీంద్రు

లతో స్వామీ ప్రభువు మూఁడుదినములుమాత్రమే గ్రం
థము ఇపుడు తెచ్చుకొనుట కనుమతియిచ్చెననియు మరిరెండు
దినము లుపయోగింప వలయునన్న నాయంశము తనద్వారా
తెల్పిన మరల అనుమతియొసంగఁ బడుననియు ప్రభువుగారు
తనకు వ్రాసిపంపిరనియు గ్రంథాలయాధికారి తెల్పెను ఇంత
కును ఆశ్రీకోశములోని యంశములన్నియు దేవరవారియను
గ్రహమున దాసునికిదివరకే అవగాహన అయియున్నవి. కంఠ
స్థముగకూడనున్నవి. కనుక ప్రభువును పునఃఅడుగ నవసర
మేమున్నదియనెను. యతీంద్రులు మొదటిదినమురాత్రి
మనము గ్రంథముపయోగించుకొనలేదు. మరుదినమునుండి
ఇదిమూడవరాత్రి. రేపురాత్రి, మరుదినమురాత్రి ఉపయో
గించుకొనుటకేగదా ప్రభువు ఫ్రత్తరువు మనకుకావలసినది.
అందులకేముందుగా గ్రంథాలయాధికారితో మందలించి
యుంచుట మంచిదని తలంచుచుండ నాగ్రంథమునీకు కంఠస్థ
మైనదని చెప్పుచున్నావు. ఈ సమాచారనాకు మిక్కిలిధైర్యము
పురికొల్పుచున్నది. ఒకమారు గ్రంథమంతయు వినిపింతువా
యనిరి. అప్పుడు శ్రీకూరేశులు శ్రీయతీంద్రులకు మ్రొక్కి యే
విధమైన తడబాటులేక గ్రంథము సాంతముగ నొప్పగించిరి.
యతీంద్రులప్పుడు పట్టరానియానందమున కూరేశులను కౌఁగ
లించుకొని యానందబాష్పములొలుక నీమేధాశక్తిని నమ్ము
కొనియే నేనీకార్యము నకుఁ గడంగితిని. అందుకు నిదర్శన

మిప్పుడు గానవచ్చినది. ఈరాత్రి మనకుండు నవకాశ
ములో నీకు కంఠస్థమయిన గ్రంథమును గోవిందదాశర
థులచే నెత్తివ్రాయింతము. ఆవల మనకార్యము నిర్వి
చారముగ నెరవేర్చుకొనవచ్చునని. కూరేశు లందుకు సమ్మ
తించిరి. అస్తమానమువరకు గ్రంథాలయమునగడపి పిమ్మట
గ్రంథమును తమవెంటఁగొనివచ్చి యారాత్రిలోపలనే శిష్యు
లచే నెత్తివ్రాయించిరి. మరుదినముదయమున ప్రభువు
యతీంద్రులుదిగిన ధర్మశాలకువచ్చి పూజాద్రవ్యములర్పించి
సాష్టాంగప్రణామములర్పించెను. యతీంద్రులును ప్రభువు
నాశీర్వదించి యుచితాసనమున కూర్చుండ నియోగించిరి.
ప్రభువుయోగక్షేమములు రామానుజులువిచారించి మీఆద
రాతిశయముచే మేము కోరియుండిన గ్రంథమంతయు పరి
శీలించి యందుండు ముఖ్యాంశముల నవగాహముచేసికొం
టిమి. ఇక మీగ్రంథము మీరు గ్రంథాలయమునకు పంప
వచ్చునని పల్కి గ్రంథమును ప్రభువునకొప్పగించిరి.
ప్రభువాగ్రంథము తీసికొని తాళపత్రము లచ్చటచ్చట
చాలఁ శిథిలమగుచుండుటంగని తామానాఁడు సెలవిచ్చి
నట్లు ఈగ్రంథమును త్వరలో నెత్తి వ్రాయింపకున్న
పూర్తిగా నమసిపోవును. ప్రాచీనమహర్షి గ్రంథము లీవిధ
ము నెన్నినమసిపోవనున్నవో పాపమామహర్షి లోకో
జ్జీవనార్థ మింతగొప్పగ్రంథము వ్రాయునపుడు యెంతబుద్ధి

బలము జ్ఞానబలము వినియోగించి శ్రద్ధాభక్తులతో వ్రాసి యుండునోయని ఆశ్చర్యముగొల్పుచున్నది. ఇక తామో ఈ గ్రంథములోని యపూర్వసారము తెలిసి యది ఈభాండాగారములో నున్నదనివిని మార్గాయాసము సరకుసేయక ఇంత దూరముకవచ్చేసి ఇంతశీఘ్రకాలములో నింతగొప్పగ్రంథము నవగాహనము చేసికొనుట మరింతఆశ్చర్యావహముగనున్నది. స్వామీ తామన్యథా తలంపకున్న నొకవిషయమడిగి తెలిసి కొననిచ్ఛాగాడముచున్నది.

యతీంద్రులు:- అన్యథా తలంపవలసిన అవసర మేమున్నది? తప్పక అడిగి తెలసికొనవచ్చును.

పరీక్షకు:- వేనకువేలు ప్రాచీన వేదాంతగ్రంథములుండ నీ గ్రంథమునందింత పట్టుదల యేలకల్గినదో యనియే సంశయము.

యతీంద్రులు:- వీరిగురువులు శ్రీకృష్ణద్వైపాయనమహర్షి. ఈ కలియుగమున నీమహర్షికి వ్యాసాధికారములభించినది. అనంతమును అపౌరుషేయమును నగు వేదములలోని జ్ఞానకాండనంతయు ఈయనసూత్రములుగా రచించెను. వానినేబ్రహ్మసూత్రములందురు. ఆబ్రహ్మసూత్రములు విద్వాంసులకుసైతము దురవగాహములు. మహర్షియభిప్రాయము తనశిష్యునకు తెలియకపోదుగదా. అది తెలియుటేగాక లోకోజ్జీవనార్థము మహర్షిశిష్య

లగు బోధాయనులు సూత్రములకు వృత్తియను పేర
నొకవిమర్శగ్రంథము వ్రాసిరి. అదియే యిది.

ప్రభువు:- పూర్వము శంకరాచార్యులవారు బ్రహ్మసూత్ర
ములకు భాష్యమువ్రాసియుండిరిగదా.

యతీంద్రులు:- వాస్తవమేగాని యమహర్షి శిష్యసంఘమును
బట్టి కాకుండుటచే మహర్షియభిప్రాయముతో నా
భాష్యమేకీభవించియున్నదని యేమినమ్మకము? ఇంతే
కును ఆభాష్యముపై ఎన్నియో ఆక్షేపణలున్నవి.

ప్రభువు:- అటులైన శ్రీకృష్ణద్వైపాయన పుత్రులగు శ్రీశుక
మహర్షియభిప్రాయముగూడ ఈబోధాయన మహర్షి
యభిప్రాయముతో నేకీభవించి యుండకపోదుగదా?

యతీంద్రులు:- శుకాభిప్రాయమునకును బోధాయనాభిప్రా
యమునకును భేదముండుట కావంతయు నవకాశము
లేదు. పలయన మహర్షికి నొకరుపుత్రులు మరియొ
కరు శిష్యులుగదా. యోగ్యులగు శిష్యులకును పుత్రు
లకును భిన్నభిన్నముగా బోధించియుందురా?

ప్రభువు:- (హసన్ముఖులై) అటులైన పరీక్షిన్నరేంద్రునకు
ఏడువారములలో ముక్తినొందు నుపాయము బోధిం
చిన శ్రీశుకబోధయే గదా ఈవృత్తియందును ఇమిడి
యుండును?

యతీంద్రులు:- అట్లుండుననను నమ్మకముచేతనే ఇంతకుమించిన

శ్రీభాష్యోత్కృష్ట గ్రంథము మరియొకటి సంస్కృత వాఙ్మయమున గానరాదనియెంచి ఈ శ్రీభాష్యఫలప్రాప్తికి అస్మద్గురులు దుర్వాదములు ఖండింప నీగ్రంథము మిక్కిలి యుపయోగపడునని ఇంతదూరమువచ్చి మీ మూలమున సఫలమనోరథులమయితిమి.

ప్రభువు:- ఈగ్రంథము విలువ ఇపుడు స్పష్టముగ గానవచ్చెను. బోధాయనగ్రంథమనిష్ట నిరసన ప్రాధాన్యము. సుకోపదిష్టగ్రంథమగు శ్రీభాగవత మిష్టప్రాప్తి ప్రాధాన్యము. మహర్షియనిష్ట నిరసనోపాయము శిష్యుని మూలకముగను ఇష్టప్రాప్త్యుపాయము పుత్రుని మూలకముగను ముముక్షువుల కుపకరింపఁజేసి ధన్యుఁడయ్యెను.

యతీంద్రులు:- మీవంటి సారాంశము నింతచక్కగా గ్రహింపఁగల ముముక్షువులు లభించిన మేముచు ఈ శుకబోధాయనుల యొక్కయు తద్గురుపరంపరయొక్కయు అనుగ్రహమునంది ధన్యులమైనాము.

ప్రభువు:- గురుపరంపరయన్న?

యతీంద్రులు:- శ్రీశుకబోధాయనుల గురువు శ్రీకృష్ణద్వైపాయనులు. వారిగురువులు వారితండ్రియగు శ్రీపరాశరులు. పరాశరుల గురువులు వారిపితామహులగు వసిష్ఠులు. ఇకవసిష్ఠులో సాక్షాల్లోక పితామహుడైన

సకలామ్నాయ విశారదుండగు చతుర్ముఖుడు. ఆ మానసపుత్రునిగురువు ముంజేతికంకణమువలె తెలియవచ్చు సాక్షాచ్ఛ్రీయఃపతియె.

ప్రభువు.- ధన్యోస్మి, నేఁడపూర్వజ్ఞానావబోధకములగు సంశ ములెన్నియో తమసూలమున విని కృతార్థుడనైతిని. తామింకను ఇచ్చట మరికొన్నిదినములుండ ప్రార్థించుచున్నాడను.

యతీంద్రులు:- మేమొనర్పవలసిన యాధ్యాత్మిక కార్యక్రమములు తొందరపెట్టుచున్నవి. రేపే ప్రయాణము. మరియొకవర్యాయము శ్రీయఃపతి యనుగ్రహమున మనము కలసికొన నవకాశము కలుగకపోదు.

ప్రభువు:- భాగ్యము. అప్పుడింకిన తడవెంతో అంతసేపుగాని ఒకదెసనుండరు మహాత్ములనునది తమబోటివారివిష యమేగదా. తమకును తమశిష్యులకును ఏకాంతతయులేక గమ్యస్థానముచేరికొన ననువగు పరికరములన్నియు మా ప్రధానామాత్యునిగుండ సమకూర్చెదను. అనిలేచి యతీంద్రులకును వారిశిష్యులకును సాష్టాంగ ప్రణామములర్పించి వారియాజ్ఞగొని ప్రభువు స్వగృహమునకరిగెను.

మఱుదినముదయమున నే ప్రభుసహాయముచే ఆవంతయు మార్గాయాసములేక సఫలమనోరథులై (శ్రీ)

యతీంద్రులును శిష్యసమేతముగా అచ్చటచ్చట అర్చామూర్తులను సేవించుకొనుచు, పవిత్రతోయములను తీర్థీకరించుచు కతిపయదినములకు శ్రీరంగ క్షేత్రము జేరుకొనిరి.

తొమ్మిదవగుచ్ఛము సమాప్తము.



శ్రీమతే రామానుజాయ నమః.



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - పదియవగుచ్ఛము.

శ్రీభాష్యప్రబోధమున్నతై యతీంద్రులు దివ్యక్షేత్రములు సేవించుట.

శ్రీరామానుజయతీంద్రులు కాశ్మీరదేశస్థ శ్రీనగరము నుండి శ్రీరంగమునకు విచ్చేసినపిదప, శిష్యసహితులై శ్రీరంగనాథుని సన్నిధికరిగి ఫలపుష్పాది పూజాద్రవ్యములు సమర్పించి యంజలిబద్ధులై భగవద్దివ్యమంగళ విగ్రహమును కన్నుల కరవుదీర సేవించిరి. అర్చకులును వారర్పించిన పూజాద్రవ్యములచే శ్రీయఃపతి నారాధించి, తిరుపరివట్టు, తీర్థ, శఠగోపప్రసాదములచే సత్కరించిరి. శిష్యులకును తదితర భక్తులకును తీర్థ, శఠగోపప్రసాదములు లభించిన వెనుక, శ్రీరంగనాథు డర్చకముఖముగ, శ్రీయతిరాజులవారి పరిజ్ఞాన పరత ప్రశంసించి, భగవద్బోధాయనవృత్తి ననుసరించి, భాష్యమును,

మరికొన్ని వేదాంతగ్రంథములను, రచింప నాజ్ఞాపించిరి. శ్రీ వారు శ్రీరంగనాథునియాజ్ఞ శిరసావహించి, యనుమతివడసి స్వమఠముజేరి, శ్రీకూరేశదాశరథ్యాది శిష్యులతో "శ్రీరంగ నాథుని నేమనానుసారము, భగవద్బోధాయనవృత్తి నాధా రముజేసికొని, శ్రీభాష్యాదిగ్రంథములు రచింపనిశ్చయించి తిని. పరమాచార్యులగు శ్రీమద్యామునమునులు సర్వచేతనో జ్జీవనైక తత్పరులై శ్రీగీతార్థసంగ్రహము, సిద్ధిత్రయము, ఆగమప్రామాణ్యము, స్తోత్రరత్నము, మాయావాదఖండ నము యిత్యాదిగ్రంథములు రచించియుండిరి. భగవదనుగ్ర హముచే భాష్యరచనారూప కైంకర్యము నాకొప్పగించుటకు సూచనగా వారి యవసానసమయమున స్వకీయసంకుచితాంగు ళిచే తమ మనోరథాభిప్రాయము తెలిపియుండిరి. శ్రీబోధా యనవృత్తి నాధారముజేసికొనియే శ్రీయామునమునీంద్రులే గాక వారి పితామహులగు శ్రీమన్నాథమునులును, శ్రీటంక, ద్రమిడాచార్యాది భాగవతోత్తములును విపులవిమర్శతో కొన్నిగ్రంథముల రచించినటుల దెలియవచ్చుచున్నది. ఆ గ్రంథముల నొకపర్యాయము సేవించి వారిమంగళాశాసన బలముచే భాష్యరచనలూనెద. మీరందఱు కైంకర్య నిర్వ హణ విషయమున యథాశక్తి తోడ్పడుదురని నానమ్మకము" అనిరి. అపుడు భాగవతోత్తములందఱు "దేవరవారి నేమనాను సారము వర్తించెద"మనిరి. శ్రీకూరేశులంజలిఘటించి స్వామీ

ఆశ్రీకోశముల (గ్రంథముల) ననుగ్రహించిన పూర్వాచార్యుల యెడ కేవల స్వరూపానురూప ప్రతిపత్తిచే సబులయనుగ్రహించుచున్నారే గాని వేరుగగాదు. దేవరవారి నిరుపమాన మేధాశక్తియే యన్నికార్యముల నవలీలగ నెరవేర్పగలదు. ఇక దాసులతోడ్పాటు లేఖకునిచేతిలోని లేఖినివంటిదే. మంచి లేఖనియైన లేఖకునియిచ్ఛననుసరించి వినియోగపడుచుండును. కాని దానికి స్వసామర్థ్యమొక్కటియు లేదు. దేవరవారి తిరువళ్ళాను సారము అచిత్ వత్పరతంత్రులగు నీదాసులు వినియోగపడు చుందుమని బలికిరి. శిష్యపారతంత్ర్యమునకు ఆచార్యులు సంతసించి యొకసుముహూర్తమున శ్రియఃపతిని సుదుపరంపరను ధ్యానించి యివ్విధముగ భాష్యరచన కుపక్రమించిరి.

శ్లో॥ అఖిలభువనజన్మస్థేమ భంగాదిలీలే, వినతవివిధభూత వ్రాత రక్షైకదీక్షే। శ్రుతిశిరసివిదీప్తే బ్రహ్మణిశ్రీనివాసే భవతు మమపరస్మిన్ శేముషీభక్తిరూపా॥

అనగా అఖిలజగముల యుత్పత్తి స్థితిలయముల నవలీలగా నొనర్చుచు నమ్రితనాశ్రయించిన నానావిధజీవుల రక్షయే దీక్షగా గలిగి వేదశిరస్సునందు ప్రకాశించు శ్రీశ్రీనివాస పరబ్రహ్మమునందు నాదుమతి, భక్తిరూపమున వెలయుగాక" యని భావము.

శ్లో॥ పారాశర్యవచస్సుధా ముపనిషద్దుగ్ధాబ్ధి మధ్యోద్ధృతాం సంసారాగ్నివిదీపనవ్యపగతప్రాణాత్మసంజీవనీం। పూర్వా

చార్య సురక్షితాం। బహుమతివ్యాఘాత దూరస్థి
తాం, అపితాంతు నిజాక్షరై స్సుమనసోజీమాః పిబం
త్వన్వహం॥ అనగా శ్రీవేదవ్యాసవచనామృతవార్ధిమధ్య
మునుండి యెత్తబడి సంసారాగ్ని విదీపనముచే ప్రాణపదమగు
నాత్మసహాయమున నశింపనున్నవారికి సంజీవనివలె నుపకరించున
దై సమస్తపూర్వాచార్యులచే బాగుగరక్షింపబడినదై మనో
భావమునకు దవ్వైయుండినను సమీపమునకు తేబడిన యీవే
దాంతసుధను దేవతలమృతమునుగ్రోలినక్రియ మంచిమనస్సు
గలవారందఱు వేడుకతో సదాగ్రోలుదురుగాక!- యని
భావము. భగవద్బోధాయన మహర్షిచే రచింపబడిన విస్తా
రవృత్తిగ్రంథమును పూర్వాచార్యులు సంగ్రహముగ సారాం
శమునుగ్రహించియుండిరి. కావున శ్రీబోధాయన మతానుసా
రముగ సూత్రాక్షరములు వ్యాఖ్యానింపబడుచున్నవని తెలిపి
భాష్యరచనకుపక్రమించిరి. శ్రీవేదవ్యాసరచిత బ్రహ్మసూ
త్రములు అయిదున్నూర్ల నలుబదియైదు. వీటికి భాష్యమును
రచించుటలో గ్రంథమునంతయు నాలుగధ్యాయములుగను
పదునారుపాదములుగను నూటయేబది యధికరణములుగను
విభజించిరి. ఇందలిమాయావాద, వైశేషిక, సాంఖ్య, బౌద్ధ,
జైన, చార్వాకాది మతావలంబులగు ప్రశ్నలకు శ్రుతి,
స్మృతి, ఇతిహాస పురాణాదులలోని యమూల్యాంశముల
ప్రమాణములుగాగొని యుక్తియుక్తముగ శాస్త్రసిద్ధములైన

సమాధానములఁ జెప్పి దుర్వాదములనంతయు ఖండించిరి. చతు
ర్ముఖబ్రహ్మ మొదలు మహర్షిపరంపరగా ప్రకాశించుచుండి
మధ్యకాలమున నవిద్యాంధకారమున మఱుఁగుపడియుండిన
పరమవైదిక సిద్ధాంతమును మరల ప్రకాశింపఁజేసిరి. బ్రహ్మ
సూత్రభాష్యమేగాక వేదాంతదీపము, వేదాంతసారము,
శ్రుత్యర్థసంగ్రహము, గీతాభాష్యము, గద్యత్రయము, పరమ
వైదిక భగవదారాధనక్రమము యిత్యాది పెక్కుగ్రంథముల
రచించిరి. బ్రహ్మసూత్రభాష్యము రచించుతరి శ్రీకూరే
శుల సహాయవిశేషము, ముముక్షువుల కనుసంధేయ మగుశాసనముల
తమ శ్రీసూక్తులు వ్రాయ వారిని నియమించిరి. వారలు వ్రాయు
చుండ జీవాత్మలక్షణము చెప్పుసందర్భమున శేషత్వరహిత
జ్ఞాతృత్వమే యాత్మకు లక్షణమని శ్రీవారు సాయించగా శ్రీ
కూరేశులావాక్యములు వ్రాయక తాళపత్రము వంకనే చూచు
చుండిరి. అందుకుకారణముండకపోదని యించుక యోచించి
శిష్యుని కుండదగిన స్వరూపలక్షణము లోకమునకు తెలియుటకు
గాను శిష్యునిపై కోపగించుకొనినవారివలె బొమముడివైచి
యచ్చటినుండి లేచిపోయిరి. శ్రీకూరేశులును "ఆచార్యులు
తమసొత్తును తామేమైనఁజేసికొనకర్త"లను జ్ఞాతృత్వసహిత
శేషత్వమును తమనడవడికలోనే జూపఁదలచి యచిద్వత్ పార
తంత్ర్యము నవలంబించియుండిరి.

శ్రీమద్రామానుజయతీంద్రులు, శ్రీకూరేశుల నడవడి

కమే జీవలక్షణమును చాటుచున్నదని గ్రహించి యమందా నంద మానసులైరి. శిష్యులకును, శ్రీకూరేశులనడవడికచే జీవలక్షణమును విమర్శ మొనర్చిరి. తామిదివఱకు ప్రతిపాదించినది సవరించి జ్ఞాతృత్వసహిత శేషత్వమే జీవలక్షణమని వ్రాయువ్వ శ్రీకూరేశులు దానిని తాళపత్రముపై వ్రాసిరి. ఈ విధముగ చాలకాలము యిట్టిదివ్యగ్రంథరచనకును, శ్రీవేదాంత దీపాదియితరగ్రంథముల రచనకును వినియోగించి కృతకృత్యులై శ్రీయతీంద్రులు ఆగ్రంథములను శ్రీఅరుళాళప్పెరుమాళ్ యెంబెరుమానార్ (దేవరాజగురువులు) మున్నగుభాగవతోత్తములకు బోధించుచు ఆనందముగ కాలముగడుపుచుండిరి. కొంతకాల మిటులగడవ నొకసంవత్సరము పంగుని నెలలో నుత్తరానక్షత్రమున శ్రీరంగనాథునకు కోవెలలో తిరుమంజన నివేదనాదులు జరిగినవెనుక నొకయుత్సవము జరుపబడెను. తిరువీధులలో నుత్సవమూర్తి వేంచేయునపుడు, శ్రీరామానుజ యతీంద్రుల మఠమువద్దనిలిచిరి. శ్రీయతీంద్రు లుత్సవ మూర్తికి పూజాద్రవ్యములర్పించి భగవత్సన్నిధిలో ఆత్మాత్మీయాఖిలభరసమర్పణంబొనర్చిరి. శ్రియఃపతియు, యర్చక ముఖముగ తమయంగీకారమును సూచించి కొన్ని శ్రీసూక్తులనుగ్రహించిరి. దివ్యోత్సవానంతరం పరోజ్జీవన పరతచే తామొనర్చిన భరసమర్పణమును గుఱించియు అందుకు శ్రీరంగనాథుని యంగీకారసూచక శ్రీసూక్తులను గుఱించియు అను

వాదముజేసి యోడగొట్టి మనుగ్రహించిరి. వారినే గద్యత్రయ మందురు. ఇది శరణాగతిగద్యమనియు, వైకుంఠగద్యమ నియు. శ్రీరంగగద్యమనియు, విఖ్యాతిగాంచెను. శ్రీపాదు తాము రచించిన బ్రహ్మసూత్ర భాష్యము వేదాంతదీపము లును, గద్యత్రయాది స్తోత్రగ్రంథములను ప్రచార మొనర్చి శ్రీరంగనాథుని యాజ్ఞగొని శ్రీకూరేశ దాశరథ్యాది శిష్యులతో కొన్ని గ్రామములకు పయనమైరి. మొదలు కుంభ కోణమను దివ్యక్షేత్రమునకు విచ్చేసిరి. ఇచ్చట యర్చా మూర్తియగు భగవంతునకు శ్రీశార్ఙ్గపాణియని పేరు. ఇందుండు పుష్కరిణిని హేమపుష్కరిణియందురు. శ్రీయఃపతి వెలయు విమానము వైదికవిమానమని ఖ్యాతిగాంచినది. శ్రీయతిరా జులవారు హేమపుష్కరిణిని తీర్థీకరించి (స్నానమొనర్చి) వైదిక విమానమున కంజలిఘటించి ప్రదక్షిణమొనర్చి శ్రీశార్ఙ్గపా ణిని శ్రీకోమలవల్లియను నామమునవెలయు తాయారును, సేవించి నతించి పూజించి ఆళ్వార్ల శ్రీసూక్తులచే మంగళా శాసనంబొనర్చిరి. మతాంతరులు కొందఱు దుర్వాద మొనర్చ రాగా తర్కశతముచే వారినోడించిరి. వారును శ్రీయతిరా జుల శ్రీపాదములాశ్రయింప పంచసంస్కారాది హితము లొనర్చి శ్రీభాష్య మనుగ్రహించి ధన్యులగావించిరి. అచ్చటి నుండి అళవార్ తిరుమలయను దివ్యక్షేత్రమునకు వేంచేసిరి. శ్రియఃపతి యళవార్ అను దివ్యనామమున నొకపర్వతముపై

వెలయుచుండును. ఈపర్వతము దక్షిణమధుర కీశాన్యభాగ మున దాదాపు రెండుమైళ్లదూరముననున్నది. చుట్టునుఅర ణ్యము, పర్వతమును, ద్రావిడనామమున దీనిని తిరుమాలన్ జోలైయని పిలుతురు. తాయారును "శ్రీసుందరవల్లినాంచి యార్"యని పిలుతురు. శ్రీ శ్రియఃపతులు వెలయువిమా నము "సోమసుందరవిమానమ"ని పిలువబడుచున్నది. కొండపై మూడుమైళ్లదూరమున "నూపుర"యను నది ప్రవహించుచు న్నది శ్రీభాష్యకారులు (శ్రీ రామానుజులు) ఆపర్వతమున వెలయు శ్రీ శ్రియఃపతులనుసేవించి ఆళ్వార్ల శ్రీసూక్తులచే మంగళాశాసన మొనర్చి లోపించుచుండిన కొన్నికైంకర్యము లను చక్కదిద్దిరి. ఈసన్నిధి శ్రీవిల్లిబుత్తూరున వెలయు శ్రీఆండాళ్కు మిక్కిలి ప్రీతిపాత్రమైనది. ఈమె శ్రీఅళగరు స్వామిని మానసికముగ ధ్యానించి పూజించి, నూరుబానల దివ్యపాయసమర్పించియుండెను. శ్రీభాష్యకారులు యీకైం కర్యమును ప్రత్యక్షముగనొనర్చి శ్రియఃపతినారాధించుటచే శ్రీ ఆండాళ్ కు ముహోల్లాసమొనర్చిరి. ఈక్షేత్రమునుండి శ్రీరామతీర్థశయనమునకు వేంచేసి, శ్రీ సౌమిత్రికృత దర్భశయ్యో పై వేంచేసియుండు శ్రీరామచంద్రమూర్తిని సేవించి పూజించి నుతించి మంగళాశాసనమొనర్చినపుడు తమపూర్వజన్మమున సౌమిత్రిస్వరూపమున తామొనర్చిన కైంకర్యములు స్మృతి గోచరముకాగా ఆనందబాష్పములు నయనారవిందముల

మొళి” తెలిసియుండక పోదుగదా”యనెను. “తిరువాయి మొళికిని నేనడిగినప్రశ్నకును నేమిసంబంధము” అనిరి. అపుడు “తిరువాయిమొళి”లో నొకపాశురముమూలమున తిరుప్పాళింగుడి కూత పెట్టుదూరముననున్నదని యాకన్య తెలియపఱచెను. ఆబాలిక విద్యా, వాక్చాతుర్యములకు భాష్యకారులవారు సంతసించి యాబాలికనెత్తుకొని లాలించి యామెతలిదండ్రులుండు గృహమునకు వేంచేసిరి. ఆబాలిక తలిదండ్రులు భాష్యకారులవారికి సాష్టాంగవందనంబాచరించి యుచితరీతిసత్కరించిన వెనుక “మీ కొమార్తెలావణ్య, చాతుర్యములు మాకత్యంత సంతసముం గూర్చుచున్నవి. తిరుక్కురుఘూరంపిరాన్ పిళ్ళాన్ ననునతడు మాశిష్యసంఘములో విద్యా, వినయ విధేయతలలోనేమి, రూపములోనేమి,చాతుర్యములోనేమి మీకన్యకకుతగినవరుడు. అతనిని మీరుస్వయముగజూచి తృప్తినొందినయెడ మీకన్య నతనికొసంగుట శ్రేయస్కరము” అనిబలికిరి. శ్రీయతీంద్రు లారీతి బలుకగనే తామెన్నుకొనియుండిన వరులలో నాతడొక డైయుండుటచే శ్రీవారి నేమనము శిరసావహించి యొకసుముహూర్తమున నాకన్యను నావరునకిచ్చి వివాహముగావించి శ్రీభాష్యకారులవారి యనుగ్రహమునకుపాత్రులైరి. శ్రీయతీంద్రులు, కురుకాపురిలో నాబాలగోపాలము శ్రీశఠగోప దివ్యప్రబంధము వాచోవిధేయమగుటకు సంతసించుచు శ్రీశఠ గోపయోగీంద్రుల ప్రభావమును పలుమారుస్మరించి యచ్చ

రువందుచు నాదివ్యదేశమునుండి తిరుక్కురుంగుడికివిచ్చేసిరి. అచట వేంచేసియుండు శ్రీయఃపతిని వైష్ణవనంబియని పేర్కొందురు. వీరు శ్రీశంకరునకు బ్రత్యక్షము. నమ్మాళ్వార్, పెరియాళ్వార్, తిరుమంగయాళ్వార్లచే మంగళాశాసనముఁ జేయబడిన దివ్యక్షేత్రమిది. భాష్యకారులవారు శ్రీయఃపతిని సేవింప వరమపురుషుడర్చకముఖముగ "బహుశిష్యసహితులై యిందువిచ్చేయుట మాకాశ్చర్యముగొల్పుచున్నది. మేమెన్నియవతారము లెత్తినను యిన్నియాత్మలనుజ్జీవింప సాధ్యపడినదిగాదు. ఇందెద్దియో మంత్రప్రభావముగలదు. ఆమంత్రము మాకెఱిగింపరాదా" యనిరి. శ్రీయతీంద్రులు క్షణకాలము మౌనమువహించియుండి "భగవానులు నాహృదయము పరిశోధింపనెంచినటులున్నది"యని యనుకొని "పరమపురుషా! మంత్రోపదేశమునకువలయు శిష్యాచార్యవ్యవస్థ శాస్త్రసిద్ధమైయుండునుగదా"యనిరి. అపుడు శ్రీయఃపతి యర్చకముఖముగ శ్రీయతీంద్రుల నొకయున్నతాసనమున నుపవిష్టులజేయించి మంత్రోపదేశ సమయమున నిందెవ్వరును నుండగూడదని యందఱిని వెలుపలకనిపి తాముశిష్యరూపమునవచ్చి శ్రీమదామానుజ యతీంద్రులసన్నిధియందు దండమునసమర్పించి వారు వేంచేసియుండు నున్నతాసనమువద్ద యంజలిబద్ధులైనిలుచుండిరి. అపుడు శ్రీయతీంద్రులు వారి చెవిలో శ్రీమదష్టాక్షరీమహామంత్ర ముపదేశించి యాసనము

నుండి దిగివచ్చి శ్రీయఃపతికి ప్రదక్షిణమొనర్చి "దయానిధే సర్వాపరాధాన్ క్షమస్వ"యని సాష్టాంగవందనంబాచరించి యంజలిబద్ధులై నిలుచుండిరి. శ్రియఃపతి శ్రీయతిరాజులవారి శాస్త్రవశ్యతకు సంతసించి తిరుపరివట్టి, తీర్థ, శఠగోపాది ప్రసాదాది సత్కారము లర్చకముఖముగ నడిపించిరి. శ్రీయతిరాజులవారు శ్రీహరికి మంగళాశాసనమర్పించి యనుజ్ఞవడసి యాదివ్యదేశమునుండి శ్రీనమ్మాళ్వార్ల తల్లిగారగు "ఉదయానరిగ" (నాథనాయకమ్మ)యవతరించిన "తిరువణ్ పరిశారం"అను దివ్యదేశమునకు విచ్చేసి శ్రీయఃపతి వేంచేసియుండు ఇందిరకళ్యాణవిమానమునకు ప్రదక్షిణంబొనర్చి గర్భాలయమున "తిరుక్కురతప్పన్"అను దివ్యనామమున వెలయు భగవంతునిపూజించి, నుతించి మంగళాశాసనంబొనర్చి యనుజ్ఞవడసి యచ్చటినుండి శ్రీపరశురామక్షేత్రమగు "తిరువట్టార్"యను దివ్యదేశమునకు విచ్చేసిరి. ఈక్షేత్రమున కిరువైపుల నదులు ప్రవహించుటచే "తిరువట్టార్"అను పేరుకలిగియున్నది. ఇందు వేంచేసియుండు ఆదికేశవస్వామి సన్నిధికరిగి భుజంగశయనుడైన భగవంతునిదర్శించి పూజించి నుతించి మంగళాశాసనంబొనర్చి, యనుజ్ఞవడసి, శ్రీఅనంతశయనమను మహాక్షేత్రమునకు విచ్చేసిరి. ఈక్షేత్రము చేరదేశమునకు చేరినది. తిరువాన్కూరు మహారాజుచే నీక్షేత్రము పోషింపబడుచున్నది, రమ్యోద్యానకాసారములతో నలరారు

నీసుందరనగరమున శ్రీభాష్యకారులవారు శ్రీ అనంత పద్మనాభస్వామివారి యాలయమునకరిగిరి. ఈయాలయమున శ్రియఃపతి మూడుద్వారములలోను దర్శనమొసంగును. ప్రథమద్వారమున శ్రియఃపతి మందహాససుందరవదనారవిందమును, దివ్యాభరణాలంకృత వక్షస్థలంబును ద్వితీయద్వారమున దివ్యాలంకారములతో వెలయు ఉదరభాగమును కనకరత్నకాంచీగుణావృత కటిప్రదేశమును మృదుపీతాంబరాచ్ఛాదిత పృథునితంబంబును కదళీకాస్తంభోపమాన యూరుయుగ్మంబును అంతిమద్వారమున నీలకాహళ సదృశవర్తుల మనోహరజంఘలును, మంజుమంజీరరత్న నూపురాలంకృతమై త్రిభువన జనసేవ్యమానమై భక్తమానస తమఃపటల మెగరజిమ్మగలవై సలలిత నఖచంద్రచంద్రికలచే నలరారు కోమలపాద పద్మములును సేవించి యమందానంద మానసులై వేమారా దివ్యమంగళ విగ్రహమును కొనియాడి పూజించి యర్చకపరిచారకులొసంగు తీర్థశఠగోప ప్రసాదాది సత్కారములువడసి శ్రియఃపతి యనుజ్ఞపొంది శ్రీఅనంతపద్మనాభాలయమునుండి పురవరముజొచ్చి అందుదుష్పాండిత్యముచే తమ్మెదుర్కొని దుర్వాదములు చేయు బాహ్య కుదృష్టి మతావలంబకుల నందఱను తమయసాధారణ పాండిత్యప్రభావమున నోడింప వారందఱు శ్రీభాష్యకారులవారిని క్షమాపణవేడి పంచసంస్కారాదులు పొంది ధన్యులైరి. అటుపిమ్మట మఱియాళ

దేశమున కొన్ని క్షేత్రములుదర్శించి అందందు వెలయు యర్చామూర్తియగు శ్రియఃపతినిదర్శించి, పూజించి మంగళాశాసనంబొనర్చి దుర్వాదము సలుపవచ్చినవారిని పరాజితులంగావించి పరమవైదిక సిద్ధాంతము నెలకొలిపి అచ్చటినుండి యుత్తరదేశముననుండు మహాక్షేత్రముల సేవింపవేంచేసిరి.

పదియవగుచ్ఛము సమాప్తము.



శ్రీమతేరామానుజాయనమః.



# శ్రీ రామానుజ ప్రభావ కల్పకము.

## ఉత్తరభాగము. - పదునొకండవగుచ్ఛము.

### శ్రీయతిరాజులవారి యుత్తరదేశయాత్ర.

మళయాళ దేశము విడిచిన కొన్నిదినములకు శ్రీభాష్యకార్లవారు ఉత్తరదేశ సుప్రసిద్ధక్షేత్రములలో నొకటియగు శ్రీపాండురంగ క్షేత్రమునకువచ్చిరి. ఇందు శ్రీకృష్ణభగవానుడు తనయపార మహిమను పరమసౌలభ్యముతో కనుపఱచి ముముక్షువుల స్వపదాశ్రితులుగ జేసికొనుచుండు మహాక్షేత్రమిది. శ్రీ శ్రీ భాష్యకార్లవారు శ్రీపాండురంగడని విఖ్యాతిగాంచిన శ్రీకృష్ణభగవానుని, శ్రీరుక్మిణీదేవిని, శ్రీబలరామమూర్తిని దర్శించి పూజించి నుతించి కొన్నిదినంబులు చంద్రభాగానదీతీరస్థమగు నాశ్రియఃపతి సన్నిధానమునగడిపిరి. అటుపిమ్మట నచ్చటినుండి మధువైరి యవతారస్థానమగు నుత్తరమధురానగరమునకు విచ్చేసిరి. కంసారి సంసారివలె

నటించి స్వీయమహిమార్ణవమున భక్తులనానందప్రవాహమున నోలలాడించిన స్థలమిది. శ్రీభాష్యకారులవారు శ్రీరాధారుక్మిణీసమేతుఁడగు శ్రీకృష్ణభగవానుని శ్రీకౌస్తుభాంశమున నవతరించిన శ్రీకులశేఖరాళ్వార్లపగిది "జయతుజయతుదేవో దేవకీనందనోయం, జయతుజయతు కృష్ణావృష్టి వంశప్రదీపః। జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో, జయతు జయతు పృథ్వీభారనాశోముకుందః" అనుశ్లోకముచే మంగళాశాసనమొనర్చిరి. శ్రీగోపాలకృష్ణుఁడు శ్రీనందయశోదలచే నత్యంతగారాబమున పెంపబడి యాపుణ్యశీలుర ముద్దుముచ్చటల నానందింపజేయుచు గోపగోపీజనపరివృతుఁడై శైశవక్రీడలుసలిపి పవిత్రముగావించిన రేపల్లె, బృందావనము, గోవర్ధనాద్రి మున్నగు దివ్యస్థలముల సేవించుకొని శ్రీకృష్ణలీలామృతకథలాశ్రితుల కభివర్ణించి తెలిపి యానందింపజేయుచు శ్రీయమునానదీ ప్రవాహమునగుంకి తీర్థీకరించి ద్వారకాపురికి విచ్చేసిరి. ఇచ్చట యర్చామూర్తియై వెలసిన శ్రీకృష్ణభగవానుఁడు అవతారసమాప్తమునగూడ శ్రీద్రౌపదీదేవికి ప్రత్యక్షమయ్యెనని చెప్పుదురు. శ్రీనమ్మాళ్వార్లు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు, ఆండాళ్ ఈ యర్చామూర్తిని పలువిధముల మంగళాశాసనమొనర్చియున్నారు. ఈయర్చామూర్తి శ్రీకల్యాణనారాయణుఁడని పిలువబడుచుండును. శ్రీరామానుజులవా రీరామానుజుని కన్నులకఱవుతీర సేవించి

పూజించి "హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే హేకంసాంతక, హేగజేంద్రకరుణాపారీణ, హేమాధవ, హే రామానుజ, హేజగత్త్రయగురో, హేపుండరీకాక్షమాం, హేగోపీజననాథ పాలయ పరంజానామినత్వాం వినా" అని వినుతించి, మంగళాశాసనం బొనర్చిరి. ఈ పవిత్రక్షేత్రమున కొన్నిదినములు గడిపి యచ్చటనుండి పుష్కరారణ్యమున శ్రీయజ్ఞవరాహమూర్తి యర్చావిగ్రహము నర్చించి యచటనుండి శ్రీ అయోధ్యకు విచ్చేసిరి. ఇచ్చట శరణాగతవత్సలుడును, శ్రీసీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేతుడును నగు శ్రీరామచంద్రమూర్తిని సేవించి, పూజించి, మంగళాశాసనం బొనర్చి, అచ్చటినుండి ప్రయాగకు విచ్చేసిరి. ప్రయాగలో గంగానదియు, యమునా, సరస్వతీ నదులు కలియును. దీనికి త్రివేణీసంగమమందురు. శ్రీయతిరాజులవారు త్రివేణీసంగమమున గుర్రింకి మాధవుని సేవించి మంగళాశాసన మొనర్చి, గయలో విష్ణుపాదమును, శ్రీగదాధరుని సేవించి శ్రీహరిద్వారము మార్గమున శ్రీ బదరీనారాయణముంచేరి, అందు నరమహర్షియొక్కయు, తక్కంగల మహర్షులయొక్కయు యర్చామూర్తుల సేవించి శ్రీమదష్టాక్షరీ మహామంత్రముపదేశించిన శ్రీమన్నారాయణుని సేవించి, పూజించి, ఆళ్వార్ల దివ్యప్రబంధపాశురములచే మంగళాశాసనంబొనర్చిరి. అనంతరము శ్రీ మద్రామానుజయతీంద్రులు శ్రీబదరీనారాయణమునుండి

మరలి శ్రీ సరస్వతీతీరస్థ శమ్యాకాశ్రమమును సేవించుకొని వచ్చి, సర్వాలంకారశోభితయై సౌందర్యమే మూర్తీభవించి నదాయనుసటుల కనుపట్టు నొకదివ్యాంగనను గాంచిరి. ఆమె శ్రీభాష్యకార్లవారి తోవకు తన హస్తముల నడ్డుపెట్టి నిలుచుండెను. ఆమె దివ్యాంగన యనుటకు సందియము లేదనుకొని వినయ వినమితోత్తమాంగులై శ్రీవారు "అమ్మా దయచేసి దారినొసగుమని ప్రార్థించిరి. అప్పుడామె కొన్ని శ్రుతుల కర్థమడిగెను. అందుకు శ్రీభాష్యకార్లవారు తృప్తికరముగ అర్థముచెప్పి యామెను నానందింపచేసిరి. అపుడామె శ్రీసరస్వతీదేవి రూపమున దర్శనంబొసంగగనే వారామెను యానందపరవశులై సేవించి, వేమారునుతించి, తాము రచించిన శ్రీభాష్యము నామెకు వినిపింప యామె యత్యానంద నిమగ్నమానసయై "ఇట్టిభాష్య మెచ్చటను కనివిని యెఱుగను, పరమవైదిక సిద్ధాంత భాస్కరప్రభచే దుర్మతధ్వాంతముల నెగరజిమ్మి ముముక్షువులకు చక్కని జ్ఞానమార్గము ప్రకాశింపచేయ నాదయామయుడగు శ్రీయఃపతిచే పంపబడిన మహాపురుషుడవని స్పష్టముగ గోచరమగుచున్నది. నేటినుండి శ్రీభాష్యకారులని విఖ్యాతిగాంచుడని మంగళాశాసనం బొనర్చి తాననుదినంబును నర్చించు హయగ్రీవ విగ్రహమును వారి శ్రీహస్తముననునిచి ఈదివ్యమూర్తి ఈభూలోకమున నర్చింపబడునంతకాలము, మీా సిద్ధాంతము దినదినాభివృద్ధి

గాంచు"నని పలికి యదృశ్యుయయ్యెను. ఆనాటినుండి శ్రీ రామానుజయతీంద్రులు కేవల భాష్యకార నామమునగాక శ్రీ భాష్యకార నామమున విఖ్యాతిగాంచిరి. గనుక మనము శ్రీ భాష్యకార్లవారిని శ్రీ, శ్రీ భాష్యకారులనియే పేర్కొనుచు ధన్యులమయ్యెదము. ఈ చిరునామమునే (పేరు) శ్రీ వైష్ణవ సంప్రదాయమునకుఁ చేరినవారు. తమవంశమున జనించిన పురుషులకు నామకరణ మొనర్చుచుందురు, నాస్తికులును, కుదృష్టులును ప్రబలి, వైదిక సంప్రదాయ విముఖులగుచుండ మహాత్ములవలీలగ నోడించి, పరమవైదిక సిద్ధాంతము నెలకొల్పి శ్రీ భారతీదేవికి సంతసము గూర్చుటచే ఆనాఁడు మొదలు శ్రీ యతీంద్రులు "భారతీశోక నాశకులనిగూడ జగద్విఖ్యాతి గాంచిరి పిమ్మట వీరు శ్రీనగరమున సరస్వతీ భాండాగారము దర్శించిరి వీరు శ్రీభాష్యమును రచించుటకు పూర్వమే బోధాయనవృత్తి కొఱకై ఈనగరమునకు విచ్చేసియుండిరిగదా. అద్వైత మతప్రచారి మొనగ్గబూని శ్రీరంగమునకు వచ్చి, శ్రీయజ్ఞమూర్తి వంటి యసాధారణ పాండిత్య ప్రభావ సంపన్నుడు శ్రీయతిరాజులవారిని వాదమున నెదుర్కొని పదునెనిమిది దినములు వాదించియు నెగ్గజాలక "జితోస్మి" యనుటయేగాక శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రాశస్త్యమును గుర్తించి శ్రీయతిరాజ పదరాజీవముల నాశ్రయించి ధన్యుడయ్యెను. ఈవిషయము ఉత్తరదేశమున అందును

శ్రీనగరమునఁ దెలియఁగనివారులేరు. ఇటులయ్యు కొందఱు పాండిత్యగర్వమున మేము యతిరాజులతో వాదమొనర్చి, యద్వైతము స్థాపింతుము. ఇందుకు నొకపండితసభ నేర్పాటు గావింపుమని, ఆదేశప్రభువును ప్రార్థించిరి. ప్రభువు శ్రీయతీంద్రుల ప్రతిభావిశేష మిదివఱకు ప్రథమ దర్శనముననే గ్రహించియుండియు, శ్రీభాష్యకార్ల వాక్సుధావృష్టిచే పండిత మ్మన్యుల గర్వానలము చల్లారక పోదనియు, ఇట్టి మహాపురుషుని ఖ్యాతిలత నలుదిశలఁ బ్రాకుటకు మంచియవకాశము లభింప నిది దైవప్రేరేపితమనియుఁ గ్రహించి వారు కోరినటులనే సభ నేర్పాటు గావించెను. అది సరస్వతీనిలయముననే జరుప నిశ్చయించి ఆదేశముననుండు గొప్పపండితుల నందఱి నాహ్వానించెను. కాశీ, ప్రయాగాది మహాక్షేత్రములనుండి గూడ గొప్పపండితులు నిర్ణీతదినమునకు విచ్చేసిరి. శ్రీ శ్రీ భాష్యకారులవారును, తమసిద్ధాంతమును నెలకొల్పుటచే ముఖ్యోద్దేశముగనుండగల వారగుటచే ప్రభువు నిర్ణీతదినమున సభ నేర్పాటు గావింపబడునని వర్తమానమంపగనే సంతసమున సంసిద్ధులైయుండిరి. తమవెంటవచ్చిన శ్రీ వరదరామానుజులవారును, (యజ్ఞమూర్తి) తమ యాచార్యప్రభావము వెలువడుట కిది మంచి యవకాశమని లోలోన సంతసించుచుండిరి నిర్ణీతకాలమున సరస్వతీనిలయమున సభ ఉపక్రమింపబడెను. వెయ్యార్గురు పండితులతో సరస్వతీనిలయము నిండియుండుటచే

కేవలము గ్రంథబాహుళ్యముచేత నేగాక, చతుర్ముఖుని బో
లిన చతుశ్శాస్త్రి పండితప్రకాండులచేగూడ క్రిక్కిరిసియుండు
టచే నిక్కముగ నిది సత్యలోక సరస్వతీ నిలయమువలె నలరా
రెను. భాష్యమును సాంతముగ వినిపింప పండితులందఱుకోరిరి.
శ్రీయతిరాజులవారు వారు కోరినటులనే భాష్యమును సాంత
ముగ వారికి వినిపించిరి. ఆపండితు లడుగదలచిన ప్రశ్నల
కా భాష్యముననే సమాధానము చెప్పబడియుండుటచే నచ్చట
జేరియుండిన పండితులందఱు వాదమొనర్ప నసమర్థులై లజ్జా
వనతవదనులై స్తబ్ధులైయుండిరి. ప్రభువు, వారి పరిస్థితిం గని
"మీ రెద్దియైన నాక్షేపింపదలంచియుండిన తప్పక నాక్షేపించ
వచ్చు" ననెను. ఒకరితో నొకరు కొంతసేపు మాటలాడుకొని
తుదకు వారందఱిపరముగ నొకవిద్వాంసుడు లేచి "మేమె
దురువాదము జేయుటకే మాకు నోరాడలేదు. వాదించవలసిన
యంశములునులేవు. ఈయతీంద్రుని పదాబ్జము లాశ్రయించిన
ధన్యులమగుదుమని తోచుచున్నది." అని పలికి కూర్చుండెను.
సభనుండి మాయందఱి యభిప్రాయ మిదియేయను ధ్వని ఏ
కగ్రీవముగ వినవచ్చెను. ఆధ్వనికిని పండితుల కరతాళధ్వనికిని
అచ్చట బ్రతిష్ఠింపబడిన సరస్వతీవిగ్రహము యించుక చలించి
హాసన్ముఖవీక్షణముల తన యంగీకారము సూచించుచున్నటుల
ప్రేక్షకులకు కన్పట్టెను. రాజేంద్రుడును, పండితులును, శ్రీ
భాష్యకార్లవారిని సేవించి తనివితీరకొనియాడి సత్కరించిరి.

మఱుదినమే పరివారసమేతుఁడై రాజేంద్రుఁడును పండితులనేకు లును శ్రీయతీంద్రపదాబ్జము లాశ్రయించి ధన్యులైరి.

శ్రీ శ్రీ భాష్యకార్ల వారిటుల శ్రీనగరమున ప్రభువును, తత్పురవాసులు కొందఱును, తమ్మాశ్రయింప వారికి శ్రీవైష్ణవ సంప్రదాయపద్ధతులు, మంత్రార్థము గురుపరంపరా ప్రభావసహితముగ బోధించి పరమవైదిక సిద్ధాంత కల్పతరువును స్థిరముగ స్థాపించి, యచటినుండి శ్రీ వారణాసీక్షేత్రమున కరుగదలచి తమయభిప్రాయమును ప్రభువునకు దెలిపిరి. మహాభాగ్యమని ఆచార్యపరతంత్రుఁడగు నారాజేంద్రుఁడు, కతిపయపరివార సహితుఁడై శ్రీ వారణాసీక్షేత్రమునకు శ్రీవారి ననుగమించి, అందాచార్యులవారికి వలయు పరికరములన్నియు సమకూర్చుచు కొన్నిదినములుండి గురుశుశ్రూషాపరాయణుఁడై యుండి మంగళాశాసన పూర్వకముగ యాచార్యాజ్ఞగొని పరివారసమేతుఁడై తననగరమున కరిగెను. శ్రీ శ్రీ భాష్యకార్ల వారు శ్రీ వారణాసీక్షేత్రమున శ్రీవిష్ణుపాదోద్భవమగు గంగా ప్రభావమును స్మరించి యానందపరవశులగుచు నాపవిత్ర తోయమున గ్రుంకి నిత్య కర్మానుష్ఠానము లొనర్చుకొనుచూ కొన్నిదినములుగడిపి, పరమవైదికసిద్ధాంతములోని ముఖ్యాంశ ములు కోరినవారికి వినిపించి, అచ్చటినుండి శ్రీ పురుషోత్తమ క్షేత్రమగు జగన్నాథమునకు విచ్చేసిరి. ఈ జగన్నాథక్షేత్ర మున శ్రీకృష్ణభగవాను డర్చామూర్తియై, శ్రీ సుభద్రాబల

భద్రిసహితుడై యలరారుచున్నాడు. ఇది బహుపురాతన
క్షేత్రము. శ్రీ పండరీక్షేత్రమువలె నిచ్చటగూడ పరమపురు
షుడు అద్భుతప్రభావముజూపి, పలువురుభక్తుల స్వపదాశ్రి
తుల జేసికొనుచుండెను. ప్రతియేటి "ఆడి" నెలలో జరుగు బ్ర
హ్మోత్సవమునకు, వేలకొలది యాత్రికు లందు జేరుదురు.
ఇట్టి మహాక్షేత్రమున సదాచార సంపత్తికి దాక్షిణాత్యులవలె
నాదేశవాసులలవడిన వారుగారు. శ్రీ రామానుజమునీంద్రు
లిది గమనించి, ఆళ్వార్లు మంగళాశాసన మొనర్చిన దివ్యస్థల
ములవలె దీనినిగూడ మార్చిన నెందఱో జీవులు ప్రపత్తిమార్గ
మవలంబించి పరిశుద్ధాచారతత్పరులై యుజ్జీవింతురుగదా యని
తలంచి శ్రీ పాంచరాత్రోక్త దివ్యాగమము ననుసరించి
తీర్థపరిగ్రహస్థలముగ మార్ప నుద్యుక్తులైరి. శ్రీ యతిపతి శ్రీ
వారి విమలాశయమున కలఁగియు, నొకనాటి రేయిస్వప్నమున
నగపడి "యతిరాజా! నీయుద్దేశము మంచిదేగాని చిరకాలము
నుండి యలవడిన యాచారము మాన్పుట దుస్సాధ్యము.
ఇదిగాక భక్తినిష్ఠ కనువగు యోగవిద్య పూర్తిగ నశింపనివ్వ
గూడదని నాసంకల్పము. మహారి సంప్రదాయపరంపర కను
గుణమగు యోగవిద్యాభిరుచి తగ్గినను తత్పరిణామశేషమగు
భక్తి కొంతయైనను కొందఱియందు నీకును గోచరమగుచు
న్నదిగదా. గావున నీవు వృధాశ్రమ పడవలదు." అని పలికి
యదృశ్యులైరి ఉదయమున శ్రీయతిరాజులవారు మేల్కాంచి

స్వప్నమున దెలుపబడిన భగవదభిప్రాయము సమంజసముగా నుండినను, మనంబున నెద్దియో కొరతగఁదోచుటచే "ఆచారాత్ప్రభవోధర్మః, ధర్మస్య ప్రభురచ్యుతః" అను నార్యోక్తియే పాటించి తమయుద్యమము నుపసంహరించుకొన నొల్లక తమ యభిప్రాయమును హృదయాంతర్గతుడగు శ్రీయఃపతికి వివరముగ విజ్ఞాపనంబొనర్చుచు నిద్రించిరి. భగవంతుడు యతీంద్రుల విజ్ఞాపనం బంగీకరింపకుండుటకు నిదర్శనము యుదయమగుసరికి వీరిని స్థలాంతరమునుచేర్చియుండుటే. శ్రీరామానుజయతీంద్రులు నిద్రనుండి మేల్కాని కన్నులువిచ్చి చూచునప్పటికి రమ్యగోపుర ప్రాకారములచే వెలయు శ్రీజగన్నాథమునకు మారుగ భీకరమృగశరణ్యమగు నొక నరణ్యమును సమీపమున సమున్నత శిఖరములతో వెలయు, పర్వతములును గానవచ్చెను. తామొక చెట్టుక్రింద నుండిరి. ఇట్టి కనివిని యెఱుఁగని విచిత్రసన్నివేశమున కచ్చెరువందుచు ఏమిచేయుటకునుతోచక నలుదిక్కులు పరికించుచుండ దూరమున నెవరో యొకనల్లని, దాదాపు పదునాల్గు సంవత్సరముల బాలుడు తమ వద్దకేవచ్చుచున్నటులఁ దెలిసెను. దగ్గరకువచ్చి యాబాలుడు శ్రీయతీంద్రులకు నమస్కరింప నాబాలుని ధవళయజ్ఞోపవీతములనుగని భూసురబ్రహ్మచారి బాలుడనినిశ్చయించిరి. అపుడాబాలుడు యంజలిబద్ధుడై "స్వామీ తమదే గ్రామము? ఒంటరిగ నీయరణ్యమున పయనముఁచేయుచు త్రోవదప్పి

చింతించుచున్నటుల దోచుచున్నది. తమయుదంతమెరిగించిన చేతనైనవఱకు తోడ్పడసంసిద్ధుడననెను. వర్ణము నలుపైనను, రూపమందముగను మాటమధురముగను నుండుటఁజేసి "నాయనా నాసంగతిఁ దెల్పుటకుముందు నిన్ను కొన్ని విషయము లడుగవలసియున్నవి. నీవు భూసురబాలునివలె గానవచ్చుచున్నావు జందెమునుబట్టి బ్రహ్మచారివలె కన్పట్టుచున్నావు.

నీపేరేమి? ఈచోటికి చేరువనేదేని భూసురావాసమగు గ్రామమున్నదా?" అనెను. అపుడా బాలుడు "సమీపమున గ్రామములు లేకపోలేదుగాని యవి యన్నియు శైవశాక్తేయ మతావలంబకులుండు పల్లెలు. భూసురులున్నను వారందఱు శైవదీక్షాపరులు. మాది జగన్నాథము. నన్ను జగన్నాథమందురు. ప్రొద్దెక్కుచున్నది. మీరొంటరిగ జిక్కియుండుటచే మిమ్మువిడిచిపోవ మనసొప్పక నాప్రయాణమాపితిని. లేకున్న నీపాటికెంతయో దూరము పోయియుందును. నేను రాత్రి ఇచ్చటికి చేరువనున్న గ్రామమున నొకసత్రమున పరుండియుంటిని. ఉదయమున ప్రయాణముచేయుచుండ మిమ్ము గంటిని. గ్రామములోని కరిగి మీకు వలయుపదార్థములను సిద్ధపరచుకొని తెచ్చెద" అనెను. "యతులు త్రిదండముడిగి భుజింపరాదు. నీవు నాకొఱకాయాసపడనక్కర లేదు" అని శ్రీ యతీంద్రులన ఆరాధనకు కొన్ని ఫలములైనను గొనివచ్చెద"నని

పలికి వెడలెను. శ్రీ శ్రీ భాష్యకారులవారు తమ మనంబున "ఈబాలుడెవ్వడై యుండును. ఈయరణ్యమధ్యమున నాకితడు తోడ్పడుచు ప్రియశిష్యునివలె నాదరించుచున్నాడు. కాపుర ముండు గ్రామము జగన్నాథమట. పేరు జగన్నాథమట. భళీ! జగన్నాథా! జగన్నాటక సూత్రధారియను నార్యోక్తి నీకే చెల్లును. అని శ్రీయుఃపతిని కొనియాడుచు, సమీపమున పుష్కరిణిని గ్రుంకి యథోచితముగ భగవదాజ్ఞావిధులు నెర వేర్చుకొనుచుండ కన్నులుమూసి భగవద్ధ్యాన తత్పరులైయుం డిరి. కొండొకవడికి కన్నులు విచ్చిచూడ మన జగన్నాథము కదళీఫలములతో శ్రీయతీంద్రులయెదుట నిలుచుకొనియుండె ను. శ్రీయతిరాజులవారు "నాయనా ఇంత శీఘ్రమున నిన్ని కదళీ ఫలములుగొని యెటుల రాగలిగితి"వని సంతసమున యాకదళీఫలములుగొని తమ యారాధనామూర్తియగు శ్రీ కరిగిరీశున కర్పించి చెంతనున్న జగన్నాథమునకు కొన్ని ఫల ములొసంగిరి. శిష్యులు వెంటలేకుండుటను తమ యారాధనా పరికరములు త్రిదండము వదలియుండవలసిన దేర్పడుటను గు ఱించి చింతిల్లుచుండిరి. ఇటుల చింతించుచుండు తమ్మాసీకార డవిలో జేర్చిన కరుణానిధియే యన్నిపరికరములు కాలక్రమ మున సమకూర్పకపోడను దృఢనిశ్చితాభిప్రాయులైరి. జగన్నాథము రేయింబగలు శ్రీవారికి తోడై యను దినమును నివేదనకు ఫలములు గొనివచ్చి యిచ్చుచుం

డెను. ఇటుల మూడుదినంబులుగడవ నాల్గవదినము వేకువ జామున శ్రీ యతిరాజులవారు మేల్కాంచి గురుపరంపరానుసంధానపూర్వకముగ కన్నులుమూసి భగవద్ధ్యాన మొనర్చుకొనుచు, సమీపమున పరుండియుండిన బాలుడించుక కదలినటుల దోప "జగన్నాథా!"యని యాబాలుని బిలిచిరి. బ్రహ్మచారి బాలుడు అప్పుడపుడే మేల్కొనిన వానివలె నావులించి "స్వామీ బిలిచితిరా! యనెను.

శ్రీయతిరాజులవారు: అవును. నీవు నాకొఱకు మూడుదినముల నుండి ఈకారడవిని ఆరాధనాపరికరముల నొనర్చుట లో నలతజెందుచున్నావు. అందుకు చింతిల్లుచున్నాను.

బ్రహ్మచారిబాలుడు:- తమబోటిపెద్దలకు సేవజేయుటయు, మంగళాశాసనము వడయుటయు, మాబోటిబాలుర కుచితమేగదా.

శ్రీయతిరాజులవారు:- నీవిచటనుండి యెచటికి ప్రయాణముఁ జేయుదలంచియుంటివి? నీతలిదండ్రులు నిన్నొంటరిగ ఇంతదూరప్రయాణముజేయ ననుమతించిరా?

బ్రహ్మచారిబాలుడు:- నాకుతలిదండ్రులున్నగదా వారికినన్ను గుఱించినవిచారము. పరికృతము, సాధువులగు యాత్రికులున్ను, మీవంటిమహానీయులును తలిదండ్రులవలె నే నన్నాదరించుచుందురు. నోరుమంచిదైన నూరుమంచిదికాకపోదను సామెతగలదుగదా! ఒకసాధువువెంట

సింహాచలముసేవింప నరుగుచు నతడు శీఘ్రిగానరుగు టచే నతనిని వెంబడింపజాలక వెనుకబడితిని. దాని వలన తమదర్శనముచే నాకు మేలేకలిగినది. సింహాచలముదారి నాకు క్రొత్తగాదు. ఈనాడుగాకున్న కొద్ది దినములలోనైనను గమ్యస్థానము జేరుకొనగల్గుదునను ధైర్యము లేకపోలేదు.

శ్రీయతిరాజులవారు:- బాలకా నీవెధన్యుడవు. సాధుసేవయే సకలార్థసాధకము. ఈకలికాలమున ధర్మము నానాటికి యడుగంటుచుండ నీపవిత్రివర్తనము నాకాశ్చర్యముగొల్పుచున్నది. నీకెద్దియైన శాశ్వతోపకారము జేయమనంబు ప్రురికొల్పుచున్నదిగాని, నన్నాశ్రయించియుండిన శిష్యులును, వలయుపరికరములును స్థలాంతరమున నుండుటచే నశక్తుడనైతిని. నీకు ఇదివఱకేదైన వైష్ణవమంత్రి ముపదేశమయినదా?

బ్రిహ్మాచారిబాలుడు:- కాకేమి?

శ్రీయతిరాజులవారు:- ఆశ్చర్యమున "అటులనా! అదేమిమంత్రిము."

బ్రిహ్మాచారిబాలుడు:- శ్రీమదష్టాక్షరీ, ద్వయ, చరమములు.

శ్రీయతిరాజులవారు:- అదిఎవరివద్దనుపదేశము నొందితిరి?

బ్రిహ్మాచారిబాలుడు:- మీవంటి యతీశ్వరుల వద్దనే

శ్రీయతిరాజులవారు:- శ్రీజగన్నాథమలోనే యుపదేశము

నొందితివా? ప్రపన్నులగు యతులెక్కువగా సంచా రము జేయు స్థలముగా నదియగపడలేదే.

బ్రహ్మచారిబాలుడు:- క్వచిత్ గా శ్రీవైష్ణవయతులు వచ్చు చు పోవుచుందురుగాని నేనెచ్చట నెవ్వరితోడను నుప దేశము బొందలేదు.

శ్రీయతిరాజులవారు:— మరెచ్చట నుపదేశమునొందితివి?

బ్రహ్మచారిబాలుడు:- తిరుక్కురుం గుడిలో.

ఆబాలుడిట్లుబలికి కన్నులుమూసియున్న శ్రీయతీంద్రు లకు నిజదివ్య మంగళవిగ్రహముతో మెఱుపువలె మెఱసి యదృశ్యుడయ్యెను.

ఆ బాలుని కడపటి వాక్యములును, అత్యద్భుతసుందర రూపమును ఆశ్చర్యసంతసములుగొల్పి శ్రీయతీంద్రులు కన్ను లువిచ్చిచూచిరి. చేరువున సేవరుండియుండిన భూసురబాలుడు కానరాలేదు. కాని "యేకంఠలగ్న తులసీనలినాక్షమాలా, యేబాహుమూలపరిచిహ్నిత శంఖచక్రాః। యేవాలలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః తేవైష్ణవాః భువనమాశుపవిత్రయంతి" యనుశ్లోకములోని భావమునకు విషయభూతులగు భూసురు లిరువురును, యతీశ్వరులిరువురును, మరికొందఱు స్వాములును అగపడి శ్రీయతిరాజులవారికి సాష్టాంగ వందనంబులిడి యంజలి బద్ధులై నిలుచుండిరి.

పదునొకండవగుచ్ఛము సమాప్తము.

శ్రీమతేరామానుజాయనమః.



# శ్రీరామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - పన్రెండవగుచ్ఛము.

### శ్రీకూర్మాలయప్రతిష్ఠ.

అపుడు శ్రీయతిరాజులవారు వారినిగని "ఏమిచిత్రమిది! నేనుండుచోటు మీ కెటులఁ దెలిసెను? కూరేశా మనవారంద ఱువచ్చినారా? పెంబారు, దాశరథు లేరీ?" అని యడిగిరి. ఇం తలో శ్రీపెంబారు, దాశరథులునువచ్చి, శ్రీవారికి మ్రొక్కిరి. అపుడు శ్రీయతీంద్రులవారు వారినందఱను గూరుచుండబెట్టు కొని శ్రీకూరేశులతో "కూరేశా నిద్రాహారములుమాని మీరునాకొఱకు వెదకుచువచ్చుచుంటిరని వాడియుండు మీ ముఖవైఖరియే తెలుపుచున్నది. కాని నాయునికి మీరుకను గొని వచ్చుటే యాశ్చర్యము. శ్రీజగన్నాథమెక్కడ, శ్రీ కూర్మమెక్కడ, జగన్నాథమన్న జ్ఞప్తిగలుగుచున్నది. ఒక వల్లని బ్రహ్మచారిబాలుడు మీకుతో వలె నేమనవగుపడె

నా?"యనిరి అపుడు శ్రీకూర్మేశులు "ఏమిచిత్రమిది? ఆ బాలుని మీకెటుల తెలియును? శ్రీకృష్ణభగవానుడు"అని మరేమియో జెప్పబోయి వెంబారువంకజూచి "మీరుకనిన స్వప్నము మీరేవినుపించుట మంచిది"యనిరి. అపుడు శ్రీ వెంబారు, శ్రీయెంబెరుమానార్లతో "మీరు మామధ్యమున శయనించియున్నారుగదాయనుకొని నిద్రించుచుండ శ్రీకృష్ణ భగవానుడు దాసునిస్వప్నమునగపడి "మీయన్నయగపడ్డే దని విన్నబోవలదు. ఆయనవలన కాదగినకార్యములు శ్రీకూర్మ మున కొన్నియుండుటచే నేనతని నందుజేర్చితిని. మిగతశిష్యుల నందఱిని మేల్కొల్పి శ్రీకూర్మమునకు శీఘ్రముగ పయనము గండని వీపుపైతట్టి లేపి యదృశ్యుడయ్యెను. దాసుడు మేల్కొని నలువైపులజూడ మీరెచ్చటను గానరాలేదు. అపుడు దాసుడు వీరినందఱను లేపి స్వప్నవృత్తాంతము దెల్పగనే యాశ్చర్యవిషాదములతో మరుక్షణమే పయనమైరి. ఇటుల పయనమై కోసుదూరమువచ్చితిమో లేదో. దాదాపు పది నాల్గువర్షముల వయస్సుగల నొకబ్రహ్మచారి బాలుడొక బండినితోల్కొనిపోవుచు మేము వెనుకవచ్చుచుండుటనుగని వడివడిగబోవు వంటెద్దుబండినాపి, "మీరెవరు? ఎచ్చటికేగు చున్నారు"అని యడిగెను. శ్రీకూర్మమునకు బోవుచున్నామని యంటిమి. శ్యామసుందరవిగ్రహముచే ముద్దులమూటగట్టు నాబాలుడు ముసిముసి నగవుతో శ్రీకూర్మమున కేమి? నడచి

పోవుటయేమి? కూర్మముగతి నీరీతినడచుచు శ్రీకూర్మమునెవ్వ
డు చేరదలచితిరి. నేను ఈబండిలో నొకసాధువు నెక్కించుకొ
సింహాచలమునకు శ్రీకూర్మమార్గముగా నేబోవుచుంటిని. అతడ
యెద్దుబండికన్నను నడకయే శీఘ్రముగా గమ్యస్థానము జేర్చునని
బండిదిగివెడలెను. మీరువృధాశ్రమపడనేల? రండు, బండి
నెక్కుడు. ఈయెద్దు గరుడపక్షివలె పరుగిడగలదు. సాధ్వ
మయినంతత్వరితముగ మీకావంతయు శ్రమగలుగనివ్వక శ్రీ
కూర్మముం జేర్చెద"నని పల్కెను. ఆపలుకులకు మంత్రముగ్ధు
లవలె మఱుమాటాడక బండినెక్కితిమి. శకటము శరవేగ
ముతో పోదొడంగెను. నిజమెఱిగిన వృత్తాంతమంతయు
దెలిపిరి. శ్రీయతీంద్రులు చిరునగవుతో "ఆబాలుని పేరు
జగన్నాథముగదా"? అనిరి. శ్రీకూరేశులు "ఇదేమియాశ్చ
ర్యము! మీరును నాబాలుని జూచితిరావేమి?" అనిరి. శ్రీ
యతీంద్రులు "ఆసంగతి నావలదెల్పెదను. మున్ముందేమి
జరిగినదో దెలుపు"డనిరి. అపుడు శ్రీ వెంబారు "మూడుది
నంబులాబండిలో ఆబాలుడు మమ్మెక్కించుకొని వచ్చుటేగాక
మాకుమార్గమధ్యమున నిత్యకర్మానుష్ఠానమునకును నివేదన
కును వలయుపరికరములన్నియు సమకూర్చినాడు. ఆబాలుని
మనకూరేశులు "నీపేరేమనియడుగ నన్నుజగన్నాథమందురని
జెప్పినాడు. ప్రభాతసమయముగాకమునుపే నొకపల్లియవద్ద
బండినాపి "తూర్పుభాగమున కూతవేటుదూరముననున్న

గుట్టవద్ద ప్రియశిః మీగురుపుత్రులను మీరు దర్శింపగలరు. నేను బోవలసినదారి వేరుగనుండుటచే మిమ్ముల నిట విధిలేక డించిపోవలసివచ్చినది. క్షమింపుడని మ్రొక్కి-బాడిఁ దోలుకొని పోయెను. ఆబాలుడన్నటుల ఇచ్చోటు కూతవెట్టు దూరమున కన్న నెక్కువగ లేదు. ఆబాలుడే మాకు భగవంతునివలె నగ పడి నిరాయాసముగ మమ్ముల నిందుచేర్చి, దేవరవారి దర్శన భాగ్యము లభింపజేసె"నని తమ వృత్తాంతమంతయు సాంతము గ చెప్పిరి. శ్రీయతిరాజులవారును నాబాలుని విషయమున తమ యాశ్చర్యానుభవములు ముచ్చటించి వారినందఱి నానంద మగ్నుల గావించిరి.

శ్రీయతిరాజులవారికిని, వారి శిష్యులకును భగవన్ని వేదనకు వలయు పదార్థములన్నియు శ్రీ జగన్నాథుడే బ్రహ్మ చారి బాలకునిరూపమున కొదువలేక సమకూర్చిపోయి యుం డెను. ఆసంగతియు శ్రీ వేంబారు శ్రీ యెంబెరుమానార్లకు దెల్పిరి. శ్రీ కూర్మనాథునిగుడి సమీపముననే స్థలజలవసతు లుండుటచే తాత్కాలిక కార్యక్రమములు నడుపుకొననువగు కుటీరముల నిర్మించుకొని, యాక్షేత్రము శైవ, శాక్తేయుల వశముగాకుండ తొలగించు నుపాయము వారూహించుకొను చుండిరి. ఇటులుండ గుడిలోనికొక శైవుడు ప్రవేశించి లింగ రూపమున కన్పట్టు నర్చామూర్తికభిషేకాదులొనర్చి, యథో చితముగ బూజించివచ్చి శ్రీవైష్ణవస్వాములఁగని "మీ దేదేశ

ము? విష్ణుభక్తులవలె నగుపడుచున్నారే ఇది శివాలయమని యెఱుంగరా?" అని యింకను నేమియో చెప్పబోవుచుండ శ్రీ శ్రీ భాష్యకార్లవారు యర్చకునితో "ఇది విష్ణుక్షేత్రము గాని, శివక్షేత్రముగాదు. ఆవిధముగ మేము దృఢపరుపగల మని పల్కిరి. అర్చకుడా వాక్యములను విని తెల్లబోయి చేరువ నున్న పల్లియలోని శైవశాక్తేయులకావార్త దెలిపెను. ఆపల్లి యలోని శైవశాక్తేయులందఱు గుమిగూడి శ్రీ శ్రీ భాష్యకార్ల వారివద్ద కరిగి మేమనాదిగా నీగుడిలోని లింగమును పూజించు చున్నాము. మీరిందుండుటకు వీలుపడదు. "మీ వైఖరి చూడ మాతో కయ్యమునకు కాలు ద్రువ్వుచు వచ్చినటులున్నది" అనిరి. అప్పుడు శ్రీరామానుజయతీంద్రులు మీరు సావధాన ముగ, మేము చెప్పునది వినుడ"ని వారినివద్ద గూర్చుండబెట్టి కొని "ఇది పూర్వము మహర్షులుండు స్థలమనియు, మహర్షులు మహావిష్ణువును "మీ ఆదికూర్మావతారమును జూపు"మని ప్రా ర్థింప, భక్తవత్సలుండు వారికారూపమున గాన్పించెననియు, నా టినుండి ఈపర్వతము శ్వేతగిరియని విఖ్యాతిగాంచి నలుదిశలకు కమఠమటుల గాన్పించుచుండుననియు, మహర్షులు కూర్మరూ పమున తన్నగపడిన శ్రీహరి నర్చారూపిగ బ్రతిష్ఠించుకొని పూజించుచుండి"రనియు విశదముగ దెలిపి అందుకు కొన్ని పురాతన పురాణగ్రంథ ప్రమాణములను జూపిరి. కాని జల ముల నగ్నిభత్రమున జండమయూఖుని దండతాడనంబుల

వృషగార్భంబులను, పౌల్పగు మత్త కరీంద్రముల న్గణికా, చెలగెనికరోగ మహౌషధముచే విషముగాదగు మంత్రయుక్తి నిమ్మలదగజక్కజేయనగు మూర్ఖుల మూర్ఖత మాన్పవచ్చునే అను వారోక్తికి విషయభూతులగు వీరికి శ్రీవారివాక్యములు చెవికెక్కక తమలోతా మొకరి చెవిలో నొకరు ఏమేమియో చాటుచాటున మాటలాడుకొనివచ్చి శ్రీశ్రీ భాష్యకారులతో "మీయభిమానమూర్తిపై మీకెంత నమ్మకమున్నపుడు మీకి గుడివెనుకకుబోయి పిలువుడు. అప్పుడు మీవైపున కీమూర్తి తిరిగెనా, మీరు విష్ణురూపిగ నర్చింప మాకేయాక్షేపణయు నుండదు" అని పలికిరి. అప్పుడు శ్రీయతీంద్రులు మీవాక్యము లకు సమ్మతింపవచ్చునుగాని శపథము మరియు దృఢమునగనుం డుట యిరుతెగలకును మంచిది. మావైపున కీమూర్తి తిరుగ కుండిన నిచ్చటినుండి మూడుక్రోసుల దూరము శివక్షేత్ర ముగ భావించి మేమడుగైన నిడము. మాకభిముఖుడైన మీ రును దీనిని విష్ణుక్షేత్రముగ భావించి యిచ్చటినుండి మూడు క్రోసుల దూరము తొలగిపోవలసియుండు"ననిరి. వారందుకు సమ్మతించిరి. శ్రీయతీంద్రులంతటితో విడువక మే మాలాగీ శ్వేతఖండ తీర్థమున గుడికి ప్రమాణమొనర్తుము. మీరును నటుచేయవలయుననిరి, అందుకు వారు తప్పక చేయుదుమని పలికిరి. మొదలు శ్రీయతీంద్రులాతీర్థమున గుడికి ప్రమాణ ముచేసిరి. శైవశాక్తేయులలో ప్రముఖులిరువురు న దేవిధము

గ నొకర్పకుం దప్పినదిగాదు. ఆనాడావిధమున శపథము చేసి
కొని మరుదినమందఱు ఆశ్వేతగుండముకడ చేరిరి. చుట్టుముట్టు
గ్రామముల కావార్త వ్యాపించి వెయ్యారు జనమం దుదయ
మగుసరికి చేరి క్రిక్కిరిసియుండిరి. శ్రీమద్రామానుజ యతీం
ద్రులు గుడివెనుక నొకయుచితస్థలంబున గుహ్యాస్త్రరణమునుగ్ర
కొని కూర్చుండి శ్రీకూర్మనాథు నొక ముహూర్తకాలము
ధ్యానింప, గుడినుండి పెద్దధ్వని వినిపించెను. ఇరుతెగలవారు
ను గుడిలోనికరిగి చూడ నర్చామూర్తి యాచార్యులవారి శభి
ముగ నగపడెను. క్రిక్కిరిసిన సమూహములో శ్రీయతీంద్రులను
వేవిధములకొనియాడని వారరుదు. శ్వేతగుండమునమునిగిన ప్రదే
శైవదీక్షితుని తత్పరత కొంత మారెను. ఇక శాక్తేయ
మతతత్పరణి మతాభిమానము కొంతవఱకు క్షీణించెను.
శాక్తేయు లశక్తులవలె శ్రీభాష్యకారులవారి వైష్ణవ శక్తి
కచ్చెరు వందిరి. భగవద్భక్తికి భాగవతభక్తి తోడై
శ్వేతగుండతీర్థము సత్యమయమై శైవశాక్తేయుల కందఱకు
శుద్ధసాత్త్విక పరమవైదిక సిద్ధాంతమునచేర నిచ్ఛ జనింపచేసె
ను. శ్రీవైష్ణవుల కెదురు సంప్రదాయ మవలంబించి శ్రీ మహా
విష్ణువిగ్రహమునకు పాత్రులనుగుటకంటె శ్రీ విష్ణుభక్తులుగ
మారుటే సమంజసమార్గమని వారికి తోచెను. ఇదివరకే పూ
ర్వాశ్రమమున శైవశాక్తేయులకు, విష్ణువైష్ణవద్వేషము మా
న్పించియుండిన శ్రీవెంబారు (గోవిందమిశ్రులు) వీరికి తత్త్వ

విమర్శ గావింప నందఱు శ్రీమద్రామానుజ యతీంద్ర పదాబ్జము లాశ్రయించి ధన్యులైరి. శ్రీయతీంద్రులును ఆక్షేత్రమును, విష్ణుక్షేత్రముగ మార్చదలచి శ్రీపాంచరాత్రాగమానుసారము శ్రీ సంప్రోక్షణ ప్రతిష్ఠాదులు గావించి యొకసాలగ్రామహారమును కూర్మరూపియగు శ్రీహరికర్పించి పూజించి శ్రీభట్టనాథోక్త శ్రీ సూక్తులచే మంగళాశాసన మొనర్చిరి. ఇట్టివిధమున శ్రీయతిరాజులవారు సఫలమనోరథులై భగవదాజ్ఞగొని శిష్యసంఘము వెంటరా శ్రీ సింహాచల క్షేత్రమునకు వేంచేసిరి.

పండ్రెండవ గుచ్ఛము సమాప్తము.



శ్రీమతే రామానుజాయనమః.



# శ్రీ రామానుజ ప్రభావ కల్పకము.

## ఉత్తరభాగము. - పదమూడవగుచ్ఛము.

### శ్రీ సింహాచలమున శ్రీ కాంతకృష్ణమాచార్యులవారి చరిత్ర.

శ్రీ సింహాచలక్షేత్రము, శ్రీ జగన్నాథక్షేత్రమువలెనే చాలపురాతనమైనది. శ్రీ వరాహ నృసింహస్వామి యవతార వైభవమును చాటు దివ్యస్థలమిది. తూర్పుదిశ మిరుగా సింహాకృతిని గంభీరముగ నొక నగరాజమందు గానవచ్చుచుండును. ఇంచుమించు నొకమైలుదూరము మాత్రమే పర్వతము నెక్క వలసియుండును. దారికిరుపార్శ్వముల ఫలపుష్పములతో వెలసి, కమ్మని పరిమళమును వెదజల్లి నెమ్మది కావందమునుగూర్చు నానావిధ వృక్షరాజములచే నలరారుచు అఖండనేత్రపర్వము గావించుచుండున దీపర్వతరాజము. సోపానము లెక్కిపోవు యాత్రికులకు తొల్లి గోపాలగోపికా మనోహరుడగు మాధవుడు విహరించిన గోవర్ధనాద్రి రాజమును

ఈగిరిరాజము తలప్రనకుఁ దెచ్చుచుండును. గిరిసానువులనుండి ధారలుగ క్రిందికి దిగజారి దనుజారియగు శ్రీ నృసింహమూర్తి నోటినుండి వెడలి అచ్చటచ్చటనుండు కాసారముల నింప్రచుండు నిర్మలజలముపైనుండి వచ్చు చల్లనిమారుతము సోకినంతనే పర్వతపథికుల పథశ్రమ వాయుచుండును. సోపానములన్నియు గడచి శ్రీభాష్యకారులవారు భగవదర్చామూర్తిని సేవింప శీఘ్రముగ కోవెలలోని కరిగి, విమానమునకు ప్రదక్షిణం బొనర్చుటకు పూర్వము బలిపీఠ. ధ్వజస్తంభములకడ ప్రణమిల్లిరి. ఇతలో శ్రీమద్రామానుజ దివ్యప్రభావము ననుదినంబును వీనులలర విని కృతార్థులగుచుండు కోవెల యధికారులు అర్చక పరిచారకులు శ్రీవారిని దర్శించి స్వరూపానురూపముగ సత్కరించి విమానప్రదక్షిణమొనర్చునపు డంజలిబద్ధులై వారి వెనువెంటనే వచ్చుచు వారిని కోవెలలోనికి వేంచేపుచేసికొనిపోయి, శ్రీవరాహ నృశింహస్వామి దివ్యమంగళ విగ్రహమును జూపిరి. శ్రీనృసింహస్వామి విగ్రహ వైభవము శ్రీయాచార్యసూక్తి ముక్తావళియను ప్రబంధమును రచించిన నాకప్రపన్నశిరోమణి హృద్యముగ,

సీ॥ పాతాళమందు నాత్రక్షోదుఢ్ఛించు పాదపద్మంబులు భవ
హారములు
మోకాలిచెంత నమోఘమై ద్రవియించు బోయతూపున
నేయు గాయమొకటి

సరసకేశులజారు స్వర్ణచేలము మొలజారనివ్వక పట్టు
సవ్యకరము
పక్షిరాజుకు సుధాపానంబుజేయుంచు దక్షిణపాణిపద్మంపు
సొంపు.

మూడు భంగుల తిరుమేనూ, మూడు కనులు। కంద
ప్రపంచంబు చాయలగొలుప్రజడలుయని యభివర్ణించియున్నారు.

ఇట్టి దివ్యమంగళ స్వరూపుడగు శ్రీయఃపతిని శ్రీయతి
రాజులవా రాపాదమస్తకము తనివిదీర సేవించి, నుతించి తా
ము గొనివచ్చిన పూజాద్రవ్యము లర్పించిరి. అర్పింపబడిన పూ
జాద్రవ్యములచే నర్చకులు భగవంతు నర్చించి శ్రీయతిరాజుల
వారికిని, తత్పదాశ్రితులకును తీర్థశఠగోప ప్రసాదములొసంగి
సంతృప్తులఁ గావించిరి. శ్రీయతిరాజులవారును శ్రీ వరాహ
నృశింహమూర్తికి, పూర్వాచార్యోక్త శ్రీసూక్తులచే మంగ
ళాశాసనంబొనర్చి, యనుజ్ఞపడసి మరల వెలుపలి విమానము
నకు ప్రదక్షిణమొనర్పబోవుచుండ, యమనియమాద్యష్టాంగ
యోగవిద్యా నిపుణుండని విఖ్యాతిగాంచిన యొకయోగి పుంగ
వుని గనిరి. ఆయన భాసుర భూసుర కుటుంబమునకుఁ జేరిన
మహనీయుడని, వెండితం తెలవలె నగపడు యజ్ఞోపవీతమును,
వేణుపత్రాకృతి నొసటఁ బ్రకాశించు నూర్ధ్వపుండ్రమును
దీర్ఘశ్మశ్రుజటామండిత యుత్తమాంగంబును నళినాక్షమాలా
లంకృత విశాలపీనవక్షమును చెప్పకయె చెప్పుచుండెను.

ఆ యోగి నిమీలితాక్షుడై స్ఫటికాక్షమాల కేలబూని జపము నర్చుచుండెను. శిష్యబృందముతో తన్ను సమీపించు శ్రీ యతీంద్రులఁ గనియు, గననటుల ఆయన గన్పట్టెను. ఆవు లించిన మాత్రమున ప్రేవులు లెక్కపెట్టగల, ఆదిశేషాంగజు లగు మనయతీంద్రు లాయోగీంద్రుని వైఖరి గని, యతని కడ క్షణమాగగనే నిమీలితనయనుడైనయాయోగి వారిని కనులువిచ్చి చూచి కూరుచుండుడని చేసంజ్ఞఁజేసి, నిమీలితా క్షుడై మరల జపమాల ద్రిప్పసాగెను. శ్రీయతీంద్రుల వారా యనచెంత నుపవిష్టులైరి. కొండొకవడికి యోగి కన్నులు విచ్చి చూడగనే యాయన ఇంగితము గుర్తెరిగి "మీరు కంసారిని కనుమ్రోల నాశింపగల సమర్థులని వినియున్నాను. మావంటి విరాగు లాశించునది ముక్తియేగదా! సన్న్యాసులకుగూడ ముక్తి కలదని వినికిడియు, శాస్త్రప్రమాణమును నున్నను, అది భవాదృశుల పురుషకారముచే భగవన్ముఖముగ వినుట మరింత తృప్తికరముగదా! ఇంతమాత్రము సర్వశక్తిసంపన్ను లగు మీవంటి యుదారాశయు లుపకరింపక పోరని తలంతునని వినయమున బల్కిరి. ఆయోగిపుంగవుడు వారివాక్యములు విని స్మితాననుడై వారివంకజూచి మోముపైకెత్తి యించుక యో చించి సమ్మతించినవానివలె తలయూచి "సరే కానిండని పలికి యెప్పటివలె నిమీలితాక్షుడై యక్షమాల ద్రిప్పసాగెను. శ్రీయతీంద్రులవా రచ్చటినుండి లేచి కోవెలకీశాన్యభాగమున

నించుకసేపు విశ్రమించి శ్రీవరాహ నృసింహుల ప్రభావ
మాశ్రితులకు దెలుపుచు, కోవిలప్రదక్షిణమొనర్చి కొండదిగి
నిజనివాసముజేరుకొని నిత్యవిధులు దీర్చుకొని భగవద్గుణాను
భవమొనర్చుకొనుచుండిరి యోగీంద్రుడు రాత్రివేళ తాళ
ద్వయముచేబూని అను దినము హరిభజనచేయువాడుక. భగ
వంతుడును భక్తుని సంకీర్తనమున కలరి. యతని కనుమ్రోల
పాట కనుగుణముగ నాట్యముచేయు వాడుక.

"పద్మసంభవుడును, భవుడును, మనుకుల సమితి,
దక్షాది ప్రజాపతులును, నైష్ఠికులైన సనకముఖ్యులు, పుల
స్త్యుండు, పులహుడు, క్రతువు, అత్రి, మరీచియు, అంగిరసుండు
ను, అరుంధతీరమణుడును, ఋషిమెరయు బహుపుణ్యులే గడ
పలగాగల బ్రహ్మవాదులును, వాక్కులకు ఈశ్వరులై
యుండియు, తపోయోగ విద్యాసమాధివదలి చారులైయుండి
యు సర్వసాక్షియగు సీశ్వరుని వెదకియు గాన రిద్ధచరిత" అను
అంద్రి శ్రీభాగవతమున, శ్రీనారాద ప్రాచీనబర్హిసంవాదమున
దెలుపబడియున్నది. అట్టి మహిమాన్వితుడును, అవాఙ్మానస
గోచరుడునగు శ్రీయఃపతిని, ముంగొంగు పసికివలె స్వవశీకృ
తునిం గావించుకొనియుండిన నీయోగిపుంగవుని మహిమయు,
అవాఙ్మానస గోచరమేయని జనసామాన్యము కొనియాడు
చుండుట సహజమేగదా! అష్టైశ్వర్యములున్నను అయిదవతన
ములేని అందఱినోటను కరగుచుండునటుల, అష్టాంగయోగ

యుక్తుడై నను నిరహంకారత లేకున్నచో అహంకారియని యందఱ నోట కరగుచుండకపోదు. ఇక మన యోగీంద్రుడెట్టివాడో కథాసందర్భమున కనుగొందము. శ్రీయతిపతి భజన ముగించి ఫలపుష్పతాంబూల నీరాజనాదులచే నీరజాక్షుని సంతృప్తి గావించి ఇంతకాలము తన యెదుటనృత్య మొనర్చుచుండిన శ్రీకాంతుని శ్రీపదాబ్జములెంత నొచ్చియుండునో యని భక్తి పారవశ్యమున దలంచి నిజాంకమున శ్రీయతిపతి పదారవింద ములుంచుకొని మెల మెల్లగా నొత్తుచూ "నేటియుదయమున నొక శ్రీవైష్ణవయతి, కతిశిష్యసమేతుడై మిమ్ము సేవింపవచ్చి, నన్నుగని తనకీజన్మమున ముక్తిలభించునో లేదో మిమ్మడిగి తెలిసికొని చెప్పుమనెను. అందుకు మీయభిప్రాయమేమి"యని యోగీంద్రుడడుగ శ్రీయతిపతి చిరునగవుతో "అతనికే గాక అత డభిమానించినవారి కందఱకు ముక్తి కరతలామలక"మని జెప్పె ను. ఇతడెవడో గొప్ప సన్యాసియైయుండకపోడని మనంబున దలంచుచు, కొంతకాలము శ్రీయతిపతి పాదసేవ యొనర్చి యను జ్ఞగొని నిజనివాసంబున కరిగి సుఖముగ నిద్రించెను. మరు దిసముదయమున లేచి నిత్యకృత్యములు ముగించుకొని కోవెల లోనికరిగి భగవద్ధ్యానమొనర్చుకొనుచుండెను శ్రీ రామా నుజయతీంద్రులును ప్రాతఃకాల భగవదాజ్ఞావిధులు నెరవే ర్చుకొని శ్రీవరాహ నృసింహాలయముజొచ్చి భగవద్దర్శనము గావించి విమానప్రదక్షిణమొనర్చి కన్నులు మూసి జప

ము చేసికొనుచుండు యోగీంద్రుని సమీపమున నిశ్శబ్దముగ నిలుచుకొనియుంశిరి. కొండొకవడికి యోగికనువిచ్చి శ్రీయతీంద్రులను గని స్మితాననుడై కూర్చుండుమని సంజ్ఞ చేసెను శ్రీయతీంద్రులును, యోగీశ్వరుడు జపము చాలించి కన్నులు విచ్చిచూచుటకు ఓపికతో యాయనచెంత కూర్చుండవలసి వచ్చెను. కొంతకాలము గడవ యోగీంద్రుడు జపముం జాలించి శ్రీయతీంద్రులతో "నీము క్తి విషయము మా స్వామి నడుగగా నీకేకాక నీయభిమానాంతర్భూతులకుగూడ ముక్తి నొసంగుదునని చెప్పెను. అనన్యసామాన్య భగవదనుగ్రహము లభించిన మాబోటి యొకానొకరికిదప్ప తఱతరులకు ముక్తిలభించుట దుర్లభమైయుండ నీకును నీవారికిని ముక్తి లభింపవలెనన్న నీపూర్వపుణ్యము దొడ్డదిగనుండక పోదని మాకు దోచుచున్నది. అని యనగనే మీ ముక్తివిషయమును శ్రీహరి నడిగి తెలిసికొనియుండుట స్వతోభద్రముగదా యని శ్రీ వారనిరి. అపుడా యోగి "శ్రీహరిని కన్నులమోడ్ప నాడింప గలవాడనని తెలిసియు నీవు నాముక్తి విషయమై ముగ్ధునివలె సందియమొందుట చోద్యముగా నున్నది. ప్రియశ్శః ప్రేమాతిశయము ప్రభావమును మఱపించునని దలంతుము. దానికేమి లెమ్మని కనులుమూసి జపమాల ద్రిప్పసాగెను శ్రీవారును అచ్చటినుండి లేచి శిష్యులు వెంటరా నిజనివాసమున కరిగిరి.

పదమూడవ గుచ్ఛము సమాప్తము.

శ్రీమతే రామానుజాయ నమః.



# శ్రీ రామానుజ ప్రభావ కల్పకము.

## ఉత్తరభాగము. - పదునాల్గవగుచ్ఛము.

### శ్రీ కాంత కృష్ణమాచార్యులు శ్రీరామానుజ యతీంద్రుల నాశ్రయించుట.

శ్రీ రామానుజయతీంద్రులు తనవద్దనుండి యరిగిన వెనుక యోగీంద్రుని హృదయాకాశమున సంశయాభ్ర ముదయించి మనంబు నించుక తారుమారై, చలింపసాగెను. ఆయన తనమనంబున "ఈసన్యాసి, నాముక్తివిషయమై యేల యానుమానించినాడు. సామాన్య సన్యాసుల మాటసరకు గొననక్కర లేదుగాని యితడు భగవదభిమానపాత్రుడని తెలిసియు నిర్లక్ష్యభావమున నుండగూడదుగదా. ప్రాయశః నేననుకొనినటుల యితనికి నాయెడగల ప్రేమచే, నాపరిభావము మఱచి యుండునని తోచుచున్నది." అని మనస్సమాధానమొనర్చుకొని యెప్పటివలె యానాటిరాత్రియు శ్రీహరి నారాధించి.

సువ్రసన్నుండై యున్నతం వినయవిధేయుఁడై "స్వామీ సర్వాపి విషయమై మీరనుగ్రహించిన శ్రీసూక్తులు నేటియుదయమున యూయనకుఁ దెలిపితిని. ఇంతమాత్రముపకరించఁగనే యూయన నాయెడ, సంప్రీతుఁడైనటుల దెలియవచ్చెను గాని, ఆప్రేమ యే నాపరిభావము మరుగుపరుప, నాకు ముక్తిలభించునో లేదో మిమ్మడిగి తెలిసికొమ్మనినాఁడు", అని యింకను నేమి యో చెప్పఁబోవుచుండ, శ్రీయతిపతి యోగీంద్రునితో "ఆ యతీంద్రున కందఱియెడను ప్రేమ సమానమే. ఆ ప్రేమ వ్యక్తి తారతమ్యముబట్టి యెటులనుపయోగపడవలయునో యటుల నుపకరించు స్వభావముగల వాఁడతఁడు. నేనుమాత్రి మట్టివాఁడనుగాదా? ప్రేమవిషయమున నాయనసంగతి యటుండనీ గాని ప్రేమపరిభావమును మరపించునను న్యాయము నీయెడ మాత్రము వర్తించుచుండునో లేదో నీకిప్పుడే తెలియఁగలదు. యోగశక్తిచే గాని, మఱెవ్విధమునగాని నేను ప్రత్యక్షమైన మాత్రముననే ముక్తిలభించుననితలంచుట మిక్కిలి పొరపాటు. దుర్యోధనాదులు కానాఁడు విశ్వరూపముచూపు లేటుండఁగవా? విశ్వామిత్ర దూర్వాసాది ఋషులు కొందఱు నామూలమున నెన్నియో కార్యములు, జయప్రదముగా నెరవేర్చుకొనఁ గల్గియు, ముక్తి వారికి కోరినంతనే లభించినదా? "తత్వజ్ఞానాన్మోక్షం" అను న్యాయమునుబట్టి కేవలశేషత్వజ్ఞానము గలిగినమాత్రముననే ముక్తిలభించునని యెంచదగదు" అని చెప్ప

చుండగనే యాయోగి నీరజాక్షునివంక నివ్వెరపడిచూచి "అటు
లైన మావంటివారికిని ముక్తిసందేహమేయనియా నీయభిప్రా
యము" అనగనే, "ఆతురపడక సావధానముగ వినుము. కర్మ
జ్ఞానయుతభక్తి జీవుడు సంసారవిముక్తుడై మిశ్రసత్వ ప్రాకృత
లోకములు దాటి, సాయుజ్యసౌధ"మును చేర స్వతంత్రోపాయ
ము. కేవలాత్మోపాసకునకు ప్రాకృతదేహవిముక్తిగలిగి విరజ
కవుల శాశ్వత స్వాత్మానంద ప్రాప్తియే. అప్పు డీసిన చాలు,
అధికఆస్థి చేకూరినట్లే యని ఆజీవుడంతటితోనే తృప్తినొంది
యుండును నన్ను, కర్మ జ్ఞానయుతభక్తిచే నుపాసించువారు
సాయుజ్యసౌధము చేరుదురుగాని, అది లభించుటకుపూర్వము,
సంచిత, ప్రారబ్ధ, ఆగామికర్మలు సవ సనోచ్ఛేదమై, వే
పిన విత్తనములవలెను, పరిపక్వ శాలిసస్యమువలెను కన
బ్బుచుండవలయును. అహంకారమును మాత్రమును లేక భగ
వద్భాగవతాచార్య పరతంత్రులు కావలెను. అటులైనందుకు
నిదర్శనము. దేహవియోగకాలమున నన్ను స్మరించుటయే
తైలధారావదవిచ్ఛిన్నస్మృతిసంతానయుతభక్తి యున్నందుకు,
భాగవతపారతంత్ర్యము నిదర్శనము. ఇదిభక్తియోగ నిబంధన
శాస్త్రసిద్ధము. ఈవిషయమున నీ వెంతమాత్ర మధ్యవసాయము
గలిగియుంటివో యించుక సావధానముగ యోచించిన నీకే
తెలియకపోదు. ప్రపత్తిమార్గనిష్ఠ యిట్టిదిగాదు. సర్వభారము
లు నాపైనుంచి నన్నే దిక్కుగా నమ్మి, ధారక, పోషక,

భోగ్యములు నేనేయని దృఢప్రేమచే వర్తించుటకు మునుపే పంచసంస్కార సంపత్తి సదాచార్యమూలమున లభించియుండి మనోవాక్కాయముల భగవద్భాగవతాపచారము లొనర్పక వీరి కత్యంత ప్రీతిపాత్రులై పారతంత్ర్యమున నొదిగి వర్తించుచు, నాయెడనుండు ప్రేమ, ప్రత్యక్ష భగవత్స్వరూపులని భాగవతాచార్యులయెడ జూపుచూ, మహారాజును చెట్టబట్టిన అంతఃపురపురంధ్రీరత్నమువలెయుండుట ప్రపత్తిమార్గనిష్ఠుల కేర్పరుపబడిన శాస్త్రనిబంధన. వీరికి దేహావియోగకాలమున అంతిమస్మరణయుండితీరవలెనను నియమము లేదు. ఆగామి సంచిత కర్మలు నన్నాశ్రయించినవెంటనే తొలగిపోవును. ప్రారబ్ధము లో యీజన్మమున ననుభవింపవలసిన భాగమే మిగిలియుండును. ఈప్రపత్తి నిష్ఠలో తీవ్రవిరక్తులై ఆర్తులైనవారికి నెంత మాత్రము ప్రారబ్ధముగూడ ననుభవింప నక్కరలేకుండ ఆశ్రయించినతోడ్తో, ముక్తి లభించును. వీరిని నార్తప్రపన్నులందురు. తక్కినవారు దృప్తప్రపన్నులు. ఈభక్తిప్రపత్తి భేదముల లో తెలిసికొనవలసిన విషయము లింకను నన్నేనిగలవు. నీవు పేర్కొనిన సంయమీంద్రుడు బహుప్రభావ సంపన్నుడగుట నీవణుమాత్రమైన నెఱుంగవు. జీవులకు, ముక్తినిచ్చు నధికారము యీయనకు నేనే యిచ్చియున్నాను." అనగనే యోగీంద్రుడు దండతాడిత భుజగమువలె, ఆగ్రహపరవశుడై, "నిన్నే నమ్ముకొని నీసేవ ననవరతము చేయుచున్నందు కిది

యా తుదకు ఫలము. మాయూప్రలకు, మాయావియగు, నీవు గూడ నొకసన్యాసి మాయకుచిక్కి కాక నన్ను సయితము చీకాకుపఱచుచున్నావు. తాను వలచినదే రంభ, తాను మునిగినదే గంగ యనుసామెత నీయెడగూడ అనువర్తించుటయే చోద్యము. మీదు మిక్కిలి విషాదకరము. అనవరత సంకీర్తన చేయుచుండు నన్నధోగతి పాలుచేయబూనిన కఠినహృదయుడని యెఱుంగక మోసపోతిని" అని యింకయు ఏమేమియో నిష్ఠురాలాపము లాడబోవుచుండ శ్రీయఃపతి ఆయన మాటల కడ్డుదగిలి "నీసంకీర్తనయంతయు అహంకార మిశ్రితము. నీ కీర్తన లంత్యజుల పాలగును" యని పలికెను. అందుకా యోగి మంటిలో నెయ్యిపోసినటువలె మరింతమండిపడి, నీగుడి ఏడ హములు కాలి రూపుమాసి కూలిపోవుగాక" యని శపింపబోయి, దుఃఖపరివాహ మద్దందగులటచే కాబోలు రూపు మారి పోవుగాక"యని రూక్షేక్షణుడై శపించి భగవత్సాన్నిధ్యమున నుండ నొల్లక దిగ్గునలేచిపోయెను. భగవంతుడును భక్తుని శాపము నాదరించెను. సుకృతలేశము మిగిలియుండబట్టి పరిణామ దుఃఖము నే వ్యాజముగ కల్పించి తలంచిన శాపవాక్యములను నోటవెడల నివ్వక సర్వరక్షకుడు రక్షించెగాని, లేకున్న యోగి జోగి గావలసినదే గదా! దేవర్షియగు నారదభగవానుడు, దేవదేవుని కర్పించిన దేవపారిజాతము, దేవదేవ దివ్యమహిమ (శ్రీరుక్మిణీదేవి) కొప్పున నలంకరింపబడినపుడు, కలిగిన సత్యా

దేవి సంతాపము యింతకన్నను మిన్నయైయుండ జాలదనుట యతిశయోక్తి కాదు. ఇంటివంక మఱలిన యాయోగి కనికరించువారులేక కాలుగాలిన పిల్లివలె, కడుంగడు దుఃఖించుచు, దిక్కు దెలియక యెచ్చటెచ్చటనో వ్యర్థముగ దిరిగి, తాను గావించిన అకృత్యమున కనుతాపపడుచు రాత్రి శేషము, ప్రారబ్ధశేషమువలె నెటులనో యోపికతో గడిపి, మరుదినము పగటికాలము సైతము దురంత సంతాపముచే పరిపరి విధముల చింతాపరంపరలు చీకాకుపరుప, యెటులనో నొకవిధమున కాలము త్రోసిపుచ్చి రాత్రియగుసరికి, మకరినిగ్రహముచే గాసిజెందిన గజేంద్రుని గతి, గజరాజవరదుని దైన్యముగ "నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపందగుఁ దీనునిఁ రావే ఈశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా" యని మొరలిడజొచ్చెను రక్షాపేక్షాం ప్రతీక్షతే అను నార్యోక్తి సఫలము జేయబూననో యని యనుకొనునటుల యోగీంద్రుని యెదుట భగవంతుడగపడగనే భగవత్పాదారవిందములకు సాగిల పడిమ్రొక్కి "పాపోహం, పాపకర్మాహం, పాపాత్మా, పాపసంభవః పాహిమాంకృప యావిష్ణో శరణాగత వత్సలా!" యని ప్రార్థింపదొడగెను. శ్రియఃపతి, తనహస్తము యోగిశిరముపై నునిచి నిమిరిలేపి, యాతనిపై సాంద్రకరుణాకటాక్షముల బరపి "కృష్ణసూరీ! నీవు నాపై కినుకబూని సాధించిన దేమియులేదు. ఉన్నదున్నటుల బలికిన నుండూరచ్చి రాదనః

ప్రాకృత సామెత నీయెడ సార్థకమైనది. భాగవతభక్తి లేని భగవద్భక్తి భస్మహవ్యమువంటిదిసుమా! జ్ఞానాగ్ని అప్రాకృతము. సర్వకర్మలను భస్మముఁజేయఁగలదు. "దుర్వార గర్వానలమో కేవలము ప్రాకృతము. పాపమును శీఘ్రముగ వృద్ధి జేయును. ప్రాకృతశక్తి, అప్రాకృతశక్తికి లొంగవలసియుండ దాని నెదుర్కొన సాహసించుట మిక్కిలి యవివేకము. భక్తులకు నేనపకారినిగానని, నీ శాపమును నీనోటినుండి పూర్ణముగ వెడలనివ్వకరికట్టుటే నిదర్శనము. నీస్థితి జాలిగొల్పుచున్నది. నావంటి భక్తుడు, నరులందు లేడని యికమీదనైన గర్వపడక, ఆయతీంద్రునే యాశ్రయింపుము. ముక్తి నీకు ముంగొంగు పసిడివంటి దగును. ఆయతీంద్రుని ప్రభావమెఱుంగవలెనన్న యాయన యెట్టి మహానీయుడో యిప్పటికైన నీ యోగదర్పణమునఁ జూడుము. అద్దమువంటి నీకడనుండు యోగశక్తి యసూయచే మలినము నొందినది. దానినిపుడైన తుడిచివైచి యొకమారుచూడుము. అని తెల్పగనే కృష్ణసూరి యప్రుడు యథార్థపరిస్థితి యోగదృష్టిలో,

సీ॥ తారహారపటీర ధవళ దేహము వాని, రమణీయనీలాంబ
రంబు వాని,
మణికిరీటస్ఫురన్మస్తకంబుల వాని, కంకణ కేయూరకరము
వాని,
కర్పూరమయదీప్త కటిసూత్రముల వాని ధవళయజ్ఞోపవీత
ముల వాని,

సతతప్రసన్న వక్త్రాంబుజంబులవాని తరుణవివృత్త నేత్రములవాని

గీ॥ సిద్ధమండలంబు సేవింప పుణ్యప్రసిద్ధి వెలసినట్టి
యిద్ధచరితు, పద్మలోచనునకు, పాదపీఠంబైన ఘనునిపన్న
గేంద్రుగాంచె నతడు"

అని శ్రీమదాంధ్ర భాగవత చిత్రకేతూపాఖ్యానమున నభివర్ణింపబడినరీతి, యాయనంతమూర్తిని గనియు, అప్రతిహత దివ్య తేజోమూర్తిని, ధారణావశమున హృదయఫలకమున నిలుపుకొన జాలెనుగాని, భయసంభ్రమములు యోగసమాధిని భంగపరుప, నామూర్తి మరుగుపడి, శరత్కాల యమృతాంశు బింబ సుధాసారమననొప్పు, మందహాసరుచులు వెదజల్లు వదనారవిందముతోడను, అరుణోదయద్యుతి నపహసించు కాషాయాంబరముతోడను, పవిత్రతులసీ పద్మాక్షమాలాలంకృత విశాలవక్షస్థలంబుతోడను, శ్రీచూర్ణరేఖాసముంచిత ద్వాదశ ధవళోర్ధ్వపుండ్రంబులతోడను, పిలకిల్లు నుయమీంద్రుడు దృగ్గోచరమయ్యెను. కొండొకవడికి ధ్యానసమాధినుండి కన్నులు విచ్చిచూడ, కనుమోల కంసారి కనక రత్నకరకంకణములు మెఱయచె తనున్న వీణచేబూని తంత్రులవుల సవరించుచుండెను. అప్పుడా యోగీంద్రుడు యోగేశ్వరేశ్వరునకు సాష్టాంగ ప్రణామ మర్పించి ముకుళీకృతహస్తుడై "ప్రభూ! నీకృప యింత యని కొనియాడ నేనెంతటివాడ! యోగదృష్టిచే యథార్థ పరి

స్థితి గోచరమయ్యెను. ఇక తడవుసేయక నాసంయమీంద్రుని తప్పక యుదయముననే ఆశ్రయింప నరుగుదునుగాని, యామహానీయుని నామ మెయ్యది?" యన శ్రీహరిస్మితాననుడై "నేను వేణువుచేబూనిన గోపగోపికావ్రాత ముత్కంఠ వెనువెంట నరుదేర బలభద్రసహితుడనై బృందావన ప్రాంతముల విహరించుతరి నన్నేమని నీవంటి యోగీంద్రులు బిలుచుచుండిరో యెఱుంగుదువా? ఆనందనిలయమునుండి యీలోకమున నవతరించిన, నిత్యసూరులలో ప్రపన్నకులశేఖరుడగు, కులశేఖరుడు, తనచే రచింపబడిన ముకుందమాలలో "హే గోపాలక" యని యారంభించి ఏడవపర్యాయ మే నామమున నన్నాహ్వానించెనో యెఱుంగుదువా!" అని యడుగ, "యెఱుంగ కేమి రామానుజడని" యనెను. "ఆనామముననే యాసంయమీంద్రుడు విఖ్యాతిగాంచుచున్నాడు. రావణ సంహారనిమిత్తమై నేనవతరింపనాయనుంగు సోదరుడై నాకు నిరంతర పరిచర్యయొనర్చుచుండిన ఆదిశేషాంశుడగు రామానుజుడే ఈ రామానుజ సంయమీంద్రుడని తలంపుము." అని శ్రీహరి తెల్పగనే ధన్యోస్మియని భగవంతునికి ప్రణమిల్లి యనుజ్ఞవడసి, స్వగృహమున కరిగి యోగదృష్టిచే గనిన యాయద్భుతమూర్తిద్వయమును ధ్యానించుచూ, ఆరాత్రి సుఖముగ నిద్రించెను. ఉదయమున నిత్యకర్మానుష్ఠానములు ముగించుకొని శ్రీ రామానుజయతీంద్ర పదాబ్జము లాశ్రయించుటకై, సింహాచల

ము గని, బహుశిష్యపరివృతుడగు నామహనీయుడున్న చోటి కరిగి, ఆయపార శ్రీవైష్ణవశిష్యబృందమ్ముగని, యచ్చెరువంది, సన్నిధి ద్వారరక్షకులతో "శ్రీ వరాహ నృసింహాలయమున మీరు చూచిన యోగీంద్రుడు కాంత కృష్ణమాచార్యులు మిమ్ము సేవింపవచ్చియున్నాడని శ్రీ యతీంద్రులకు తెల్పుడని పలికెను. వారును శ్రీవారికావార్త వినయవిధేయులై దెల్ప శ్రీవారు "మాకిపుడాయనతో మాటలాడ నవకాశములేద"ని పలికిరి. ఆవార్త ద్వారరక్షకులు కాంత కృష్ణమాచార్యులకు దెల్ప, ఖిన్నవదనుడై నిజనివాసమున కరిగి రాత్రి శ్రీవారిని భజించి శ్రీయతిరాజులన్న మాటలు, తాను ద్వారరక్షకుల చే చెప్పిపంపిన క్రమమును విశదముగా విజ్ఞాపనంబొనర్చెను. కృపా పరిపూర్ణుడగు భగవంతుడు కృష్ణసూరితో "ఎంత బుద్ధి హీనుడవు, ఆచార్యశబ్దముపయోగించవలసినది ఆచార్యుని విషయమునవా? శిష్యుని విషయమునవా? ఇంతమాత్రమైనను తెలియనివాడవని నేననుకొనియుండలేదు." అనగనే "వాస్తవముగ నేను బుద్ధిహీనుడ"నని యొప్పుకొని మరుదినముదయమున నే శ్రీయతిరాజులవారి సన్నిధికరిగి కృష్ణసూరి మిమ్మాశ్రయింపవచ్చియున్నాడని తెల్పుడ"ని ద్వారరక్షకుల బ్రార్థించెను. వారావార్త శ్రీవారిసన్నిధిలో విజ్ఞాపనం బొనర్ప, సూరులు, సన్యాసుల నాశ్రయింపవలసిన యవసరముండదని దెల్పుడు" అని పలికిరి. కృష్ణసూరికావార్త వారు దెల్ప

మునుపటివలె ఖిన్నవదనుఁడై యారాత్రి దైన్యమున శ్రీయతిరా
జులవారు పలికిన పలుకులును, తాను ప్రార్థించిన తెఱంగును
శ్రీహరికి తెలిపెను. అపుడు శ్రీయఃపతి "శిష్యాచార్యలక్షణ
మన నెట్టిదో యెఱుంగనివాఁడవగు నీకు సంయమీంద్రుని నా
శ్రయింప సాధ్యమగునా?

చ. అపచారంబులు లేక, నిత్యపరిచర్యాభక్తియుక్తుండనై,
చపలత్వంబులుమాని, నేఁగొలువగా, సంప్రీతులైవారు, ని
ష్కపటత్వంబున, దీనవత్సలతతోఁ, గారుణ్యసంయుక్తులై
యుపదేశించిరి నాకు, నీశ్వరరహస్యోదార విజ్ఞానమున్"

అని నారదమునీంద్రుఁడు తాను మహర్షుల నాశ్రయించిన పద్ధ
తియు, వారనుగ్రహించిన విధంబును, శ్రీభాగవతమునఁ దెల్పి
యున్నాఁడు.

దాస్యనామము మున్నిడుకొని, ప్రార్థించినగాని, ఆచా
ర్యాశ్రయము లభింపదు" అని తెలుపఁగనే తెంపలు వైచుకొని,
భగవంతుని కృపాకటాక్షమునకు సంతసించుచు, స్వగృహ
మున కరిగి, తన దురహంకార ప్రవర్తనకు దుఃఖించుచు, నా
రాత్రి గడపి, ఉదయముననే శ్రీహరిని ధ్యానించుచు లేచి కా
ల్యకృత్యములు శీఘ్రముగ ముగించుకొని, శ్రీవరాహ నృసింహా
లయమున అర్చామూర్తిని ధ్యానించి, స్తుతించి, అనుజ్ఞవేడి,
కొండదిగివచ్చి, శ్రీయతీంద్రులవారి సన్నిధి ద్వారము కడ
యంజలిబద్ధుఁడై నిలిచి, ద్వారరక్షకులతో "అడియేఁ కృష్ణ

దాసుడు దేవరవారి శ్రీపాదారవిందము లాశ్రయింపవచ్చి కాచియున్నాడని దెల్పుడు" అని దైన్యమున ప్రార్థించెను. ద్వారరక్షకులు ఆయన పలుకులు శ్రీవారికడ విజ్ఞాపనం బొనర్చిరి. శ్రీవారును ఆయనను లోన ప్రవేశపెట్టుడని యాజ్ఞాపించిరి. ద్వారరక్షకు లటులనే యొనర్ప, యోగీంద్రుడు, శ్రీసంయమీంద్రుల శ్రీపాదాబ్జములకు పునఃపునః సాష్టాంగ ప్రణామములర్పించి, అమర్యాద, క్షుద్ర ఇత్యాది స్తోత్రరత్న శ్రీసూక్తులచే తన యాకించిన్యత్వమును దెల్పుకొని" పాపరాధచేతనుడగు యీదాసునకు కల్పకోటి సహస్రములకైనను దేవరవారి దివ్యపాదారవిందములే శరణ్యము" అని దైన్యమునఁ బలుక శ్రీవారాయనను తమసన్నిధిని గూరుచుండబెట్టుకొని, అర్థపంచక జ్ఞానమామూలాగ్రముగ దెలిపి, మీారు దినము సుముహూర్తమున పంచసంస్కార సంపన్నునిగావించి స్వరూప హితబోధగావించి, తమశిష్యబృందములో నొకనిగ చేర్చుకొనిరి. శ్రీవరాహ నృశింహ్వాకైంకర్యము తామటవక సలుపుచు మహాభాగవతులయెడ భయభక్తులతో అపచారరహితముగ మెలగుచుండవలయుననియు, స్వచ్ఛస్వర్ణపాత్రిలోని క్షీరమైనను మదిరబిందు స్పర్శచే నశుద్ధమై దూరతః పరివర్జనీయము గునటుల యెంత యనన్యభక్తియున్నను, అహంకారలేశమున్న శిష్టపరిత్యాజ్యుడై అత్యంతకథోగతి కల్పించుకొనిన వాడగును 1 ... గితయని ముమూార్లు హెచ్చరికచేసి, శ్రీ కాంత

కృష్ణమాచార్యులను బంపి శ్రీవారు శిష్యసహితులై శ్రీ ఆది వరాహమూర్తిని ఫలపుష్పాది పూజాపరికరములతో సేవించి మంగళాశాసనం బొనర్చి, తీర్థశఠగోపాద్యుచిత సత్కారము లు వడసి భగవన్నేమనముగాని శ్రీగౌతమీ, కృష్ణవేణీ యి త్యాది పుణ్యతోయములం దీర్థీకరించుచు కొన్నిదినములకు శ్రీయాహోబలాద్రిఁజేరిరి. శ్రీకాంత కృష్ణమాచార్యులు శ్రీ రామానుజయతీంద్రుల నాశ్రయించినదాదిగా, యోగసంప దకుతోడు ప్రపన్నానుష్ఠాన సంపద చేరియుండుటంజేసి బంగా రుకు పరిమళమబ్బినటువలె సంతసించి, భగవద్భాగవత కైంక ర్యము లేమఱక శ్రద్ధాభక్తులతో నెఱపుచుండెను. భగవ ద్రూపమునను, ఆచార్యరూపమునను, వెలయు శ్రీ రామా నుజద్వయ విశేషానుగ్రహామే యిందుకు కారణముగదా!

పాఠకమహాశయులారా! ఏయోగి తన యనుజుఁడొకప్పు డు రజకయువతి పొత్తుమరిగి కులమర్యాద కూలఁద్రోసి, దాని యింటనే విధివశంబున నసువులంబాయ, భూసురులాక్షేపింప, తానొక్కఁడే యనుజశవమ్ముపై స్వీయకమండలోదక మభిమం త్రించి చల్లి, లేపి, పితృకాననమువరకు నడిపింపఁగలిగెనో, ఏయోగీంద్రుని ప్రభావమునకు బ్రహ్మేంద్రాది దేవతలకైనను కానరాని శ్రీహరి వశుఁడై దర్శనమొసంగి యనుదినంబు నృత్య మొనర్చుచుండెనో, సకల ప్రాణులపాలిటి పారిజాతమై విల సిల్లి సస్యసమృద్ధిచేఁ దన్పుచుండిన భూమాత నెత్తుకొనిపోయి

పాతాళమునసుంచి, తన్నెదుర్కొన్నవాడును, ముప్పదిమూడు కోట్ల దేవతలను ముప్పతిప్పలు బెట్టినవాడునునగు దను జేంద్రుు, హిరణ్యాక్షుని క్షణమాత్రమున సంహరించిన శ్రీవరాహ నృశింహునిగుడి ఏయోగీంద్రుని కోపానలమున ఏడహాములు కాలెనో అట్టి మహిమాధ్యునికి సైతము శ్రీమద్రామానుజ యతీంద్రపాదాబ్జములు దప్ప మరెద్దియు శరణ్యముగాదయ్యెను, పరిస్థితులట్లుండ యోగవిద్యాకర్తృతయు శక్తియులేని త్రైవర్ణికేతరులును (శూద్రాదులు) అర్హతయుండియు, అశక్తులగు త్రైవర్ణికులును, ముక్కుమూసుకొని ముహూర్తాంశమైనను స్థిరముగ గూర్చుండజాలని వారయ్యు, మహనీయులగు శుక శౌనకాది మహర్షులకు సాధ్యమగు యోగము సాధించి భగవత్సాయుజ్యసౌధము చేరుదుమని, విశ్రపీఠుట కొండను బెండు వలె ముస్నిటి తేల్పగలమను, ఉన్మత్తప్రలాపులవంటి వారే గదా! వీరి వాగురులఁ దగుల్కొని చిక్కుపడకుండఁ జూచుటే ప్రాజ్ఞలక్షణము. యమనియమాది యోగముల నాత్మ నియంత్రితయయ్యు, కామరోషముల ప్రచోదితంబెయగును గాని ప్రశాంతకారియగు విష్ణుభక్తివలె పరమపురుషానుగ్రహము లభింపఁజేయఁజాలదు. ఇందుకు నిదర్శనమీ యోగి పుంగవుని ప్రవర్తనమే యాదర్శప్రాయమని పాఠకమహాశయులు గమనింతురుగాక.

పదునాల్గవ గుచ్ఛము సమాప్తము.

శ్రీమతేరామానుజాయనమః,



# శ్రీ రామానుజప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - షష్ఠస్తబకము.

### శ్రీ భాష్యకారులవారు శ్రీ సింహాచలమునుండి శ్రీ అహోబల మార్గమున తిరుమలకు వేంచేసి యచ్చట శైవ వైష్ణవ వివాదము పరిష్కరించుట.

ఆంధ్రదేశములోని దత్తమండలమున, కర్నూలుజిల్లాకు చేరిన, శ్రీఅహోబలక్షేత్రము బహుపురాతనమైనది. హిరణ్యకశిపుని సంహరించి, పరమభాగవత శిఖామణియగు నతనిపుత్రుని (ప్రహ్లాదుని) రక్షించిన శ్రీ నృశింహావతారమునాటి దీదివ్యక్షేత్రము. శ్రీనమ్మాళ్వార్లు, శ్రీ తిరుమంగయాళ్వార్లు, శ్రీ లక్ష్మీనృసింహుల నిచ్చట మంగళాశాసనమొనర్చిరి. ఆళ్వార్లచే మంగళాశాసనము చేయబడిన సీక్షేత్రమును, తామును సేవించి, శ్రీయఃపతికి మంగళాశాసనము లర్పింప, శ్రీ రామానుజయతీంద్రులు శ్రీ సింహాచల క్షేత్రమునుండి వేంచేసిరని

తెలిపియుంటిని గదా. ఈక్షేత్రము చేరుటకు మార్గవసతులు బాగుగ లేనికాలమున, శ్రీయతిరాజులవారును, సాహసమున శ్రమతో నిందు చేరవలసియుండెను. ఈక్షేత్రమొక యున్నత పర్వతముపైనున్నది. చుట్టుముట్టు శార్దూలాది దుష్టజంతువులకు శరణ్యమగు నరణ్యమున్నది. అడవి చెంచులు నిర్భయముగఁ గాపురముఁ జేయుచు, భగవద్దర్శనమొనర్ప నరుదెంచిన యాత్రికులకు దారిచూపుటలో యథాశక్తి తోడ్పడి, వారిచ్చు కాసువీసములు స్వీకరించి, తృప్తిగా కాలము గడుపుచుందురు. భూదేవి చెంచువారిలో నవతరించి చెంచునాయకీరూపవేషభాషలతో వర్తించుచు శ్రీ లక్ష్మీనృసింహుల కటాక్షములకు పాత్రయై, వరింపబడి, యిచ్ఛావిహారములు సల్పిన స్థలమిది యని చెంచువారు ఆటపాటల యాత్రికులఁ నానందింపఁ జేయుచుందురు. ఇందుకు నిదర్శనముగ శ్రీ చెంచునాయకి యర్చావిగ్రహము, కొండపైనుండు కోవెలలో ప్రతిష్ఠింపబడి యున్నది. భక్తులయెడ ననుగ్రహముచే భగవంతుడు యెన్నేని లీలావిలాసముల జూపి భక్తినభివృద్ధి పరచి, కృతార్థులగావించుట సహజమేగదా! ప్రకృత మీక్షేత్రము శ్రీ శ్రీ అహోబల మఠాధిపతుల యధీనమునందున్నది. బహుప్రభావసంపన్నులగు శ్రీ శ్రీ ఆదివణ్ శఠగోపయతీంద్రులే యీక్షేత్రమున శ్రీ శ్రీ లక్ష్మీనృసింహ దివ్యపాదుకారాధన మొనర్చుచు ముముక్షువుల నుజ్జీవింపజేయుచుండిరి గాని కాలగతిచే రాను

రాను దక్షిణదేశ పండితోత్తములు పీఠాధిపతులై యచ్చటి భక్తుల ప్రోత్సాహముచే, నాదేశమందే వసించుచు, యెప్పుడో ఒకానొకప్పుడు యీక్షేత్రము సేవించి పోవుచుండుటచే, యీ దివ్యక్షేత్రము నడవిచెంచులు దప్ప నన్యులు విచారింపని దుఃస్థితి పాలయ్యెను. ప్రతాపరుద్రుడు రాజుగానుండిన కాలములో,నీక్షేత్రమెంతయో యభివృద్ధికరముగ నాదరింపబడుచుండె నని చరిత్రలవలన దెలియవచ్చుచున్నది. రాజేంద్రునిచేతను, తదితరభక్తునిచేతను, భగవదారాధనకును, విశేషోత్సవములు జరుపుటకును వలసిన భూవసతి కల్పింపబడియు పరికృతము విచారణ వ్యవస్థలు తృప్తిగా లేనికారణమున హృదయవిదారకముగనుండుట సహజమే. ప్రాకారములు, మంటపములు, గాలిగోపురము, పుష్కరిణి యిత్యాదులు", మాబ్రతుకు వీక్షు జాలి గొల్పుచుండలేదా యనిచెప్పకయే కన్పట్టుచున్నవి. కొద్దికాలము క్రిందట నొకపుణ్యపురుషుడు ఈక్షేత్రముండు దుఃస్థితికి కటకటపడి ఎటులైన దీనినభివృద్ధిపరుప భగవదనుగ్రహముచే దృఢసంకల్పమొనర్చెను. ఇటుల సంకల్పించి తీవ్రముగ కైంకర్యము సలుపుచుండు నీభక్తుడుత్తరదేశమున నొక సంపన్నగృహస్థుడు. మన శ్రీయతిరాజులవారి కాలము నాటికీక్షేత్రమిప్పుడున్నంత దుఃస్థితిలోనుండలేదు. దుస్థితిలోనుండు క్షేత్రములను శ్రీయతిరాజులవారు పేర్కొ(చేయువారును గారు.

శ్రీవేదాద్రి గరుడాద్రిపర్వతములమధ్య వెలయుచుండు

నీలక్ష్మీనృశింహాలయములోని యర్చామూర్తులను శ్రీవారు శిష్యబృందముతో సేవించి, పూజించి, నుతించి, మంగళా శాసనమొనర్చి శ్రీ చెంచునాయకీరూపమున వెలయు శ్రీ భూపిరాట్టినిగూడ నటులనే యొనర్చిరి. అటుపిమ్మట నవనారశింహ మూర్తులని విఖ్యాతిగాంచిన జ్వాలా, భార్గవ, యోగ, ఉగ్ర యిత్యాది నామముల వెలయు నర్చామూర్తులను సేవించి, మంగళాశాసనమొనర్చి, అందందు అర్చకులర్పించు తీర్థ, తిరుపరివట్టి, శఠగోప, ప్రసాదాది సత్కారములు వడసిరి. పిదప విష్ణుభక్తునను నసూయానలము ప్రజ్వలింప, పుత్రుడనియైనను, నెంచిక హిరణ్యకశిపుడు పరమభాగవత శిఖామణియగు శ్రీ ప్రహ్లాదాళ్వారును, దారుణశిక్షలచే బాధించుచు, తుద కేయున్నత శైలశిఖరమునుండి క్రిందికి త్రోసెనని పురాణప్రసిద్ధిగలదో, యాపర్వతమునయితము శ్రీవారెక్కి, అందు శ్రీనృశింహ పదాబ్జ చిహ్నములగని మ్రొక్కి, అందందు కాలగతిచే లోపించుచుండిన కైంకర్యముల దిద్ది, కైంకర్యమే పురుషార్థమని యర్చక పరిచారకులకు ప్రబోధమొనర్చి, సోమవరము కనుమగుండ శ్రీ వెంకటాచలమునకు వేంచేసిరి.

శ్రీవారు దిగువతిరుపతికి రాగనే పూర్వాశ్రమమున మేనమామగారగు శ్రీ శైలపూర్ణుల గృహమున కాహ్వానింపబడి, యందు విశ్రమించిరి. ఈవార్త క్షేత్రమునందు భక్తులు, భాగవతులు శోవెలయధికార్లు, యర్చక పరిచారకులు,

తెలిసికొని ఫలపుష్పాది పూజాపరికరములతో విచ్చేసి శ్రీ యతిరాజులవారిని దర్శించి, సేవించి, యుచితరీతి పూజించి ధన్యులైరి. శ్రీవారును సేవింపవచ్చిన క్షేత్రవాసులను క్షేమ లాభములును, కోవెలలోని కైంకర్య సమృద్ధిని యడిగి తెలిసి కొని సంతసించిరి. వారిలో కొందఱు యంజలిబద్ధులై "దిగువ తిరుపతిలో నిరుపద్రవముగ కైంకర్యములు జరుగుచున్నవిగాని, తిరుమలలో శైవులు అడుగడుగునకు కయ్యమునకు కాలు ద్రవ్వుచు కైంకర్యములకడ్డు దగులుచున్నారని" విజ్ఞాపనం బొన ర్చిరి. అపుడు శ్రీభాష్యకార్లవారు సంభ్రమచిత్తులై వివాద కారణమడుగ "మూలవరులకు శంఖచక్రములు లేనందుచే నిది శివవిగ్రహముగాని, విష్ణు విగ్రహముగాదని వారివాద" మనిరి.

శ్రీభాష్యకారులు- నేనితః పూర్వమిచ్చటకి శ్రీ మద్రామా యణ కాలక్షేపార్థమువచ్చి యుండినపుడు వివాద గ్రస్తముగ నుండలేదే".

భాగవతులు- శైవులలోను సాత్వికస్వభావులును, శ్రీశైల ...గార్జలయెడ భక్తిగౌరవములుగల వారు ను ...ండుటచే క్షుద్రస్వభావులు ప్రకోపించుట కా ...తయు నవకాశము లేకుండినదిగాని, కాలగతిచే ...భాగ్యులు గతించుటచే, క్షుద్రస్వభావులవ్యాప్తి ...నాటి కధికమగుచు నిత్యారాధన జరుపుటే కష్ట

సాధ్యమైనది. శ్రీశైలపూర్ణులు, కడుంగడు వృద్ధులైన కతన వివాదవిముఖులై యుండవలసివచ్చినది.

శ్రీభాష్యకారులు- స్థలపురాణమైనను వారు చదివి సంశయనివృత్తి గావించుకొనవచ్చునే.

భాగవతులు- తమోగుణము పూర్ణముగ నావరించినపుడు సాత్వికపరికరములు ప్రకాశించు నవకాశముండదు గదా. చీకటిలో వెలుతురు నొసంగు పరికరములుండియు నవి కానరావు.

శ్రీభాష్యకారులు- అటులైన ప్రకృతముఁ జేయవలసిన పని దెల్పుడు.

భాగవతులు- సర్వజ్ఞులగు దేవరవారికి తెలియని యంశమే మున్నది. దేవరవారి నొకపర్యాయము వారు దర్శించి ప్రబోధకరమగు శ్రీసూక్తులు వినగనే మంత్రముగ్ధులవలె లొంగిపోదురు.

శ్రీభాష్యకారులు- నాప్రయత్నము నామమాత్రమే. సర్వాంతర్యామియగు శ్రీయఃపతియే కాలము పక్వమైనపుడు తప్పక యెద్దియో యొకవిధమున మనయుద్యమము సఫలమొనర్చును. నేను పూర్వము తిరుమలకు వచ్చినవిధముననే రేపటియుదయముననే తిరుమలఁ జేరయత్నించును. కోవెల యధికారుల కీవార్త దెలిపి, రేపటిదిన మపరాహ్ణవేళ నొకసభ గావింప

యత్నింప్రదు. మనయుద్యమము తప్పక నెరవేరును. అదిగో! ఇందు కుశ్రుతిగా శ్రీగోవిందరాజస్వామి యాలయమున గంట మ్రోగుచుండుటను గమనింప్రదు.

భాగవతులు- ఆయుపశ్రుతివిని సంతసించుచు శ్రీభాష్యకారుల వారి యనుజ్ఞగొని తిరుమలకు పయనమైరి.

శ్రీ భాష్యకారులును శ్రీ గోవిందరాజస్వామి సన్నిధి కరిగి శ్రీయఃపతిని, దేవేరులను పూజించి, నుతించి, మంగళాశాసనమొనర్చి, యనుజ్ఞవడసి వేపవజామున తిరుమలకు వేంచేసిరి. శ్రీవారు శ్రీశైలపూర్ణులగని సేవించి వారిగృహమున శిష్యబృందముతో గూడ విశ్రమించిరి. అపరాహ్ణవేళ సభ జరుగుననువార్త దెలియవచ్చెను. శ్రీవా రపరాహ్ణవేళ శ్రీశైలపూర్ణులకు ప్రణామము లర్పించి సభామందిరమున కరుగ ననుజ్ఞగొని, కోవెలలోని శ్రీఆనందనిలయవిమానమున కంజలిబద్ధులై ప్రదక్షిణమొనర్చి, శ్రీ శ్రీనివాసమూర్తిని సేవించి, పూజించి, నుతించి, యనుజ్ఞవడసి సభామందిరమునకు విచ్చేసిరి. ప్రేక్షకులతోను, వాదమొనర్ప నందు జేరిన వారితోను అచ్చోటు క్రిక్కిరిసియుండినది. శ్రీ భాష్యకార్లవారాసభ నొకపర్యాయము కటాక్షించి, ఇటులుపన్యసించిరి.

సభాసదులారా! "జగత్పతియగు భగవంతునకు మన మందఱము పుత్రులమగుటచే సోదరులవలె నన్యోన్య ప్రేమ

విశ్వాసాలతో మెలంగవలసినవారముగదా. మనలో మనము మన స్పర్ధలచే వివాదములు పెంచుకొని యసూయానలము ప్రజ్వలింపజేయుట మనకే హానికరముగ నుండుటేగాక మనల ననుదినంబును కంటినిరెప్పవలె కాపాడు లోకజనకుడగు భగవంతుని నిగ్రహమునకేగదా తుదకు పాత్రులమగుదుము. ఈక్షేత్రమునవెలయు సర్వేశమూర్తి (మూలవిరులు) శంఖ చక్రములుగాని, డమరుక త్రిశూలములుగాని ధరింపనికారణమున మీలో కొందఱీమూర్తి శివుడనియు, మరికొందఱు శివుడుకాదు విష్ణువనియు వివాదములు పెంచుకొనుటకన్న నొకమారు స్థలపురాణము, యితర పురాణములు విమర్శించిన యెంత సమంజసముగనుండునో యోచింపుడు. అని యనగనే ఆస్థలపురాణ ములకేమి, అవి వైష్ణవులే కల్పించుకొని యుండవచ్చును. ఇతర పురాణములును అటులనే వైష్ణవ పర్యాయముగ దిద్దియుండవచ్చును" అని వారిలో కొందఱనిరి. మఱి కొందఱు "మేమింతవరకు వాటిని విమర్శింపదలచుకొనియుండ లేదు. వీనిలో మావారనినటుల కల్పింపబడినవో, దిద్దబడినవో యుండిన సులభముగ నౌచిత్యమునుబట్టి కనుగొనవచ్చునుగదా! ఆపురాణములలో నేమి వ్రాయబడియున్నదో విమర్శగా దెలుపుడు" అని మరికొందఱనిరి. "మీావద్దనుండు శైవపురాణములలో నీమూర్తి శివుడని తెల్పియుండిన వాటిని జూపుడ"ని శ్రీయతిరాజులవా రనిరి. "అవి మావద్దనుండిన ఇంత

- చర్చయే యుండదని వారిలో కొందఱనిరి. "స్థలపురాణముల లోను, శ్రీ వేదవ్యాసులచే విమర్శింపబడిన నితర పురాణము లలోను ఏమి తెలుచున్నదో మాకు చెప్పుడ"ని తుదకు శైవు లేకగ్రీవముగ బలికిరి. అప్పుడు శ్రీయతిరాజులవారు సకల పు రాణసారాంశమును క్రోడీకరించి "యీవిధముగనుపన్యసించిరి. "పూర్వము రంగదాసు అను నొక భక్తశిఖామణి యను దినంబును శ్రద్ధాభక్తులతో నీయర్చామూర్తికి పుష్పకైంకర్య ము సలుపుచుండెను. ఒకదినము శేషాచల పర్వతమునకు చేరువనుండు నొక తటాకమున స్నానమొనర్చుటకై పోయి, విగతవస్త్రముల జలకమాడు కొందఱు దేవాంగనల గని వారి రూపలావణ్యాదుల కచ్చెరు వందుచుండ మోహపరవశు డయ్యెను. అటుల నెంతకాలము గడపెనో యాయనకే తోప లేదు. ఆస్త్రీలును యితనిని గమనించిన వారుకారు. ఇంతలో నానాటి ప్రారబ్ధకర్మ సడలి భగవత్కటాక్షమించుక ప్రస రించుటచే హృదయాకాశమున మెరుపు మెఱసినటువలె తన పరిస్థితి స్మృతి గోచరముకాగా లజ్జాభయ సంభ్రమములు ము ప్పిరిగొన ఆయన తన యవివేకమునకు మిగుల వగచి సత్వర ముగ నచ్చోటువాసి యేడుకొండలు నడచి వేవేగ భగవత్స న్నిధిం జేరి తనయపరాధము క్షమింప బలువిధముల నాదయా మయుని ప్రార్థించెను. ఆప్రార్థనలో శ్రీవిష్ణు సహస్రనామస్తో త్రములోని ధ్యానశ్లోకము లిమిడియుండెను. దీనినిబట్టి యీ

యర్చామూర్తి శ్రీమహావిష్ణువని తెలుచుండలేదా! అపుడు ఆయన ప్రార్థనకు భగవంతుడు సుప్రసన్నుడై "వత్సా! నీవు ప్రారబ్ధకర్మానుగుణమున భోగలాలసుడవై నాకైంకర్యమే మఱచితివి. ఈసుఖప్రారబ్ధశేషము జన్మాంతమున ఫలోన్ముఖమై నీచే ననుభవింపబడిన కొంతకాలమునకు విరక్తిని గలుగ చేయకపోదు. ప్రకృతము నీవొనర్చుచుండు కైంకర్యప్రచార ముచే చక్రవర్తివై పుట్టి సకలభోగము లనుభవించెద"వని యర్చకముఖముగా దెలిపిరి. రంగదాసు మఱుజన్మమున "శ్రీతొండమాన్" అను నామమున అగర్భశ్రీమంతు డయిచు చక్రవర్తి పదవిని పొందెను. ఒకానొక సమయమున ప్రబల శత్రువుల నెదుర్కొనవలసి పూర్వజన్మవాసనావశ మున ఈక్షేత్రమున భగవంతుని శరణుజొచ్చి వేడ, యర్చక ముఖమున నాదయామయుడు తనకీభక్తుడొనర్చిన కైంకర్య మున ప్రకృతము చక్రవర్తియగుటను దెలిపి, శత్రుపరాజయ మున దోడ్పడ దాను ధరించియుండిన శంఖచక్రముల నాచక్ర వర్తి కొసంగి పంపెను. చక్రవర్తియు శత్రువుల నవలీలశంఖ చక్రసహాయమున జయించి సుఖముగా రాజ్యమేలుచుండెను. తన శంఖచక్రముల శ్రీతొండమాన్ చక్రవర్తి కొసంగిన కతన శ్రియఃపతికా చిహ్నములు లేవని సకల పురాణసారాంశము దెలిపి ఆయాపురాణములలోనుండు కొన్నిశ్లోకములు జదివి వాటిభావము విశదపఱచిరి. ఇప్పటికి కొందఱకు సంశయపిశా

చము వదలినదికాని, మూర్ఖస్వభావులగు కొందఱు పురాణ గ్రంథములకన్నను ప్రబలమగు ప్రత్యక్ష నిదర్శనమునగాని లొంగనటుల శ్రీవారికి దోచెను. అప్పుడు వారు "కన్నులు మూసి నిజహృదయకమలమున దివ్యతేజోమూర్తియై వెలయు శ్రియఃపతిని ధ్యానించి, ధ్యానయోగమున, నేమి దెలియవచ్చెనోగాని కొందొకవడికి కన్నులువిచ్చి, గుసగూడి గుసగుసలాడుచుండు శైవులతో "మీలో కొందఱికింకను సంశయము వదలలేదని తోచుచున్నది. దానికొక యుపాయము లేకపోలేదు. శ్రీవైష్ణవులగు మావారు శంఖచక్రములు సిద్ధపఱచి భగవత్సన్నిధానమున నుంతురు. మీరును డమరక త్రిశూలములు సిద్ధపఱచి యటులనే యుంచుడు. ఈరాత్రి యిటులొనర్చి తలుపులకుభయములు తాళమువైచి రేయంతయు మెలకువతో నుభయకక్షలవారిలో కొందఱు కాపియుండుడు. ఉదయము తలుపులుదీసిచూడ ఈమూర్తిహస్తముల శంఖచక్రములుండెనా దీనిని విష్ణుక్షేత్రముగా భావించి కాళకాస్తి కావలనే మీరుండవలసినది. డమరక త్రిశూలములుండెనా చంద్రగిరి దాటి మేము రాము. ఈనియమమునకు మీ కొప్పుకొనెదరా? యని యడుగ, మేమందఱ మొప్పుకొనెదమని ఏకగ్రీవముగా శ్రీ శైవులందరు పలికిరి. ఉభయకక్షలవారును శ్రీయతిరాజులవారు నియమించినటులచేసి రాత్రియంతయు ద్వారముకడ కావలియుండి ఉదయమున లేచి అందఱును వచ్చి

చూడ మూలవరుల హస్తముల శంఖచక్రములు గానవచ్చెను. అపుడు శ్రీయతీంద్రులవారు మహాప్రభావసంపన్నులని తెలిసి, వారు నియమించియుండిన ప్రకారము శైవులు వివాదము మాని కాళహస్తికి పోయిరి. శ్రీవైష్ణవులు నాడు మొదలే యుపద్రవము లేక సక్రమముగ యర్చామూర్తి నారాధించు చుండిరి. శ్రీవారు అర్చామూర్తి వక్షస్థలమున శ్రీవత్స చిహ్న ముండుచోట, నొకబంగారు లక్ష్మీవిగ్రహాపదకమునుఁజేయించి శాస్త్రోక్తముగ ప్రతిష్ఠగావించి యలంకరించి దివ్యోత్సవము జరిపించి శ్రీ శ్రీనివాసమూర్తికి మంగళాశాసనము లర్పించిరి. శ్రీ ఆదిశేషాంశజులగు శ్రీమద్రామానుజ యతీంద్రుల కేలాటి ఘనకార్యములు సులభసాధ్యముగదా! శ్రీ శ్రీనివాసుల సన్నిధానమున కైంకర్యాభివృద్ధి గమనించుచు సేవించుకొనుచుండు నటుల ఇరువురు జీయంగార్లను శ్రీవారు నియమించిరి. ఈ దివ్యక్షేత్రము నిటుల నుద్ధారముగావించినందుకు నిదర్శనముగ శ్రీ ఆనందనిలయ విమానమున నుత్తరదిశలో శ్రీ యతిరాజ విగ్రహము బ్రతిష్ఠింపబడియున్నది. శ్రీ యతిరాజులవారిటుల శ్రీతిరుమలలో దగు వ్యవస్థలొనర్చి శ్రీ శ్రీనివాసుని సేవించి, పూజించి, నుతించి మంగళాశాసన మొనర్చి, యనుజ్ఞవడసి, దిగువ తిరుపతికి శిష్యసహితులై విచ్చేసి, తిరుమలలో గావించిన యేర్పాటుల విషయము శ్రీ శైలపూర్ణుల సన్నిధిలో ప్రణామపూర్వకముగ విజ్ఞాపనం బొనర్చిరి. వారును, అనితర

సాధ్యమగు శ్రీవారి కైంకర్య వ్యవస్థలకు సంతసించుచు తమ ద్వితీయపుత్రులగు, శ్రీకూరుకేశుల ననవరతము శ్రీయతీంద్రుల పరిచర్యమొనర్చుచుండ నియమించి శ్రీవారి సన్నిధిలో నాయన నొప్పగింప, శ్రీకురుకేశులును ధన్యోస్మియని దండము సమర్పించి యానాటినుండి శ్రీవారి సపర్యమొనర్చుకొనుచు కాలము నెమ్మదిగ గడపుచుండిరి. శ్రీయతిరాజులవారు రెండు దినములు శ్రీశైలపూర్ణుల సన్నిధిని సంతసమున కాలక్షేప మొనర్చి శ్రీగోవిందరాజస్వామి సన్నిధికరిగి ఫలపుష్పాది పూజాద్రవ్యము లర్పించి, సేవించి, నుతించి మంగళాశాసన మొనర్చి, తిరుపరివట్టె, తీర్థ, శఠగోపాది సత్కారములు లభించి, యనుజ్ఞవడసి శ్రీశైలపూర్ణ గృహమున నానాటి యపరాహ్ణమువఱకు విశ్రమించి, అచ్చటినుండి మరికొన్ని దివ్యదేశములు సేవించుకొనుచూ శ్రీనంబెరుమాళ్ల సన్నిధిచేరి ప్రార్థించి యనుజ్ఞవడసి. దిగువ తిరుపతినుండి శిష్యబృందముతో పయనమై శ్రీఘటికాచలంబున శ్రీలక్ష్మీనృసింహులను, శ్రీఆంజనేయులను, శ్రీతిరువళ్లూరున శ్రీవీరరాఘవస్వామిని, తమ జన్మస్థలంబగు శ్రీపెరుంబూదూరున శ్రీఆదికేశవస్వామిని, సేవించి, పూజించి, నుతించి, మంగళాశాసనంబొనర్చుచు, ఆయాక్షేత్రములలోనుండు కైంకర్యలోపములను, అర్చక, పరిచారకులకు ప్రబోధమొనర్చి దిద్దుచు, భాగవతులకు తాము రచించిన శ్రీభాష్యము వినిపించుచు, కుతర్కము చేయవచ్చిన మతాంత

దుల పరాజితుల గావించుచు, శ్రీకాంచీనగరమునకు విచ్చేసిరి. అచ్చట శ్రీ కాంచీపూర్ణుల దర్శించి వారి పురుషకార పురస్సరముగ శ్రీ వరదరాజస్వామిని, శ్రీ పెరుందేవితాయార్లను, శ్రీ లక్ష్మీనృసింహులను, పూజాపరికరములతో సేవించి, పూజించి, నుతించి, మంగళాశాసనంబొనర్చి శ్రీ భాష్యమును భగవత్సన్నిధిలో భాగవతులకు వినిపించి వారినందఱ నానందింప చేసిరి. ఆరాధనానంతరము అర్చకులొసంగు, తిరుపరివట్టి, తీర్థ, శఠగోప, ప్రసాదాద్యుచిత సత్కారములువడసి, ఒక దినమంతయు శ్రీకాంచీపూర్ణుల గోష్ఠిలో కాలముగడిపి, వారినే మనము బొంది మార్గమధ్యమున శ్రీ మధురాంతకాది మరికొన్ని దివ్యదేశముల సేవించుచు, శ్రీ భాష్యప్రచారము గావించుచు, తమ్మాశ్రయించిన వారికి పంచసంస్కారాది విహితవిధుల నుజ్జీవనోపాయము గరపుచు, శ్రీ మన్నాథమునుల జన్మభూమి యగు శ్రీ తిరునారాయణపురముజొచ్చి, ఆమహాత్ములు యోగాభ్యాస మొనర్చిన స్థలమును గాంచి భక్తితో ప్రణమిల్లి, యచ్చటినుండి కొన్నిదినములకు శ్రీరంగమునకు వేంచేసి, శ్రీరంగనాథుల సేవించి తీర్థశఠగోపాద్యుచిత సత్కారములు లభించి భగవదనుజ్ఞవడసి స్వస్థలముచేరి విశ్రమించిరి.

పదునైదవ గుచ్ఛము సమాప్తము.

శ్రీమతేరామానుజాయనమః.



# శ్రీ రామానుజ ప్రభావ కల్పకము.

## ఉత్తరభాగము. - పదునారవగుచ్ఛము.

### ధనుర్దాసను నామాంతరముగల రంగదాసు చరిత్రము.

శ్రీ మద్రామానుజ సంయమీంద్రులు, కొందఱు శిష్యులు వెంటరా, వేకువజామున శ్రీకావేరీ నద్యవగాహనార్థమై వేంచేసి నిత్యకర్మానుష్ఠానము లచ్చటనే నెఱవేర్చుకొని, సూర్యోదయమైన వెనుక స్వమఠమునకు వేంచేయు వాడుక.

ఒకానొకదినమున వీరు శ్రీకావేరినుండి వేంచేయుచుండ యాదృచ్ఛికముగ నొకసందువద్ద నాశ్చర్యావహమగు నొకవింతఁ గనుగొని, కొద్దికాలము మార్గమధ్యమున నాగిపోవలసినదేర్పడినది. వెనుక వచ్చుచుండు వీరిశిష్యులును, ఆవింత గనుగొన సంభ్రమచిత్తులై యుండిరి. ఆవింతకు కారణము, గరిడీల నిరంతరము సాముచేయుటచే భుజకండరము లుప్పొంగ బలిష్ఠుఁడగు ఒకయౌవనపురుషుడు, దివ్యాప్సరసను బోలిన

నిజసతీమణి వదనారవిందము బాలభాస్కరుడుసైతము చూడ నిష్టపడనివాని పగిది నొకఛత్రము సూర్యునికడ్డపెట్టి వెనుక వెనుకనే తిన్నతిన్నగా నడుగులిడుచు నడక సాగించుచుండెను. ఆకసమునందుండు బాలభాస్కరుని దృష్టిసయితము తనప్రేయసి పాతివ్రత్యము భంగపఱచునని తలంచు నలౌకికుడుగా కుండుటే గాక బాలార్కుని కాంతిసైతము తామరరేకుల బోలు, యామె యాకర్ణాంత విశాలనేత్రములకు సోకి వాడిపోవునేమో యను శంకచే, అట్లొనర్చుచుండు రసికశిఖామణి యతడు.

ఇంతేగాదు, గాలిలోని పరాగపటలము, యామె నయనారవిందములలో పడునేమోయను శంకచే కాబోలు, మరియొకచేత వింజామరవీచుచున్నాడు. అనుదినము శ్రీ కావేరినుండి వలసినంత నీరు దెచ్చుకొనవలసి యుండునుగదా ఈకార్యము ససూర్యంపశ్యయగు తన యిల్లాలికి శ్రమనియ్యక నొల్లక తానే కొనివచ్చుచుండెడివాడుగాని, ఆదంపతుల యదృష్టము శ్రీరామానుజ కటాక్షామృతముచే ఫలవంతమగు కాలము కలిసివచ్చియుండుటచే కాబోలు, ఆయన యొనర్చుచుండు, శ్రీరంగనాథసన్నిధి కైంకర్యములు, మిక్కుటముగా నుండుటచే విధిలేని విరామమేర్పడి తీర్థము నదినుండి గొని వచ్చుటలో నాలశ్యమైనది. శ్రీకావేరినదియు, కొన్నిదినముల నుండి పూర్ణముగ ప్రవహించుచు చూచువారి కానందము గూర్చుచుండినది. ఇరుగుపొరుగు వారనుకొనుమాటలనుబట్టి

తన యిల్లాలి కానాడు “నేను స్వయముగ నానదీమ తల్లి
కడకరిగి ఔదార్యను వెలిబుచ్చు కోమలతరంగ హస్తములచే
జలముగొని స్వయముగా ఘటముల నింపు సొంపుగని యా
నందించవలెనని ముదియుచున్నందుకు ఆనాడు విరివిగ నవకా
శముజిక్కె, అందుచే భర్తతో “మీరు భగవత్కైంకర్య నిర్వ
హణభారముచే మిక్కిలి బడలియున్నట్లు తోచుచున్నది. శ్రీ
కావేరీపూర్ణప్రవాహము కన్నులపండువుగ గన్పట్టుచున్నదని,
ఇరుగుపొరుగువా రనుకొనుచున్నారు. నేడు నేనే తీర్థముగొని
వచ్చుట కనుమతించినయెడల, మీకు విశ్రాంతియు, నాకు
శ్రీకావేరీమతల్లి దర్శనభాగ్యంబును లభించునుగదా యని పలి
కెను. భర్తయు, తనప్రియురాలి వాంఛ తోసిపుచ్చ నిష్టము
లేక “అటులనే కానిమ్ము. పొరుగుననున్న నాడవారు తోడుగ
నుండిన తప్పక పోయిరమ్ము” అని పలికెను. నిజసతీమణియు,
సంతసమున కలశముగొని, యిల్లువిడిచి కొంత దవ్వరిగెనో
లేదో, భర్తయు, ఇంటితలుపులు మూసి, యొకచే ఛత్రమును,
మరియొకచే వింజామరముబూని, ఆమె తిరిగిచూచుసరికి వెను
వెంటనే వచ్చుచుండెను. ఇట్టి వైఖరితో నతడు తన్ను వెంబ
డింప, వెంటవచ్చినవా రేమనుకొందురో యను లజ్జయును,
భర్తకు తనయెడగల యనురాగమునకు సంతసమును, యామె
హాసన్ముఖారవిందమున గన్పట్టుచుండినది, శ్రీ యతీంద్రులును,
వారిశిష్యులును, చూచునప్పటికి ఈవైఖరిమారి, వెనుక బే

రోఁ-నిన సతిసేవాతత్పరత గానవచ్చినదిగదా. శ్రీయతీంద్రులు వారిని గమనించియు గమనించనటులజని తమమఠము జేరుకొని, నిత్యకైంకర్యము ముగిసినవెనుక శిష్యులలో నిరువురిని బిలిచి యీనాటి యుదయమున నగపడిన నారసిక శిఖామణి నిందుకొని రాగలరా?" యని చిరునగవున బలికిరి. భాగ్యమని యాశిష్యులిరువురు యీాయనింటనుండు సమయముజూచుకొని యిందుజని శ్రీవారియాజ్ఞ దెలిపిరి. "యతీంద్రులు నన్నుదయమున జూచియుండిరి. నావర్తనము వారికి విపరీతముగఁదోచియుండకపోదు. అనురక్తులకును విరక్తులకును నుండు భేదము తేజస్తిమిరములవంటిదిగదా. నావంటిబద్ధసంసారితో నా పరమవైరాగ్య సంపన్నున కేమిపనియుండును.

"వీరివెంట పోయినగాని తెలియదు. ఏమిది! నా కుడి కన్నేలయిటుల యదరుచున్నది. ఇందెద్దియో శుభసూచకమున్నది. మహాత్ముల దర్శనము వ్యర్థముగబోదు" అని యతడనుకొనుచు నాయతీంద్రశిష్యులవెంట నరిగి మఠమున శ్రీ మద్రామానుజ యతీంద్రుల దర్శించి ప్రణామము లర్పించి యంజలిబద్ధుడై నిలుచుండెను. శ్రీయతీంద్రులును నతనిని సాదరదృష్టితో కటాక్షించిరి. పిమ్మట వారిరువురికిని నీక్రింది సంభాషణ జరిగెను.

శ్రీయతీంద్రులు- అయ్యా కూరుచుండుము. నీవు శ్రీరంగనా ని సన్నిధికైంకర్య పరులలో నొకనివి గదా?

నీపేరూ? అందుకు "అడియేఁ రంగదాసుఁడని దాసుని బిలుతురు. శ్రీరంగనాథుని యుత్సవ సేవాకాలములందు శ్రీయఃపతి కెదురుగా కత్తిబట్టి బరాబరుచేయు కైంకర్యమున నియోగింపబడితిని"

శ్రీయతీంద్రులు- రంగదాసూ! నీవా కైంకర్యముతప్పక జేయదగినవాడవే సందియములేదు. శ్రీరంగనాథుడు దేవేరులతో తిరువీధులలో వేంచేయుచుండ నీవు వారి తిరుముఖమండలము వంకనే దృష్టినిలిపి వెనుక వెనుక నడచుచుండ శ్రీవైకుంఠ సైన్యనాథుని యనుచరులలో నొకరియంశ నీయందు తప్పక చేరుకొనియుండునని నాకు తోచినది.

రంగదాసు- వేయిముఖములతో గమనించు శక్తిగల దేవర వారి కటాక్ష మీదీనాథమునిపై నిదివరకే ప్రసరించియుండుటచే, నూసరక్షేత్రము సుక్షేత్రముగా మారుకాలము వొచ్చినటువలె నున్నది.

శ్రీయతీంద్రులు- శ్రీరంగనాథుని యవ్యాజ కటాక్షముచే నట్టి కైంకర్యము నీకబ్బియుండ నావంటివాని దృష్టి నామమాత్రమేగాని, రంగదాసూ! నీవన్యథాతలంపని పక్షమున నాకు నీయెడగల సంశయమొకటి నీమూలముననే తొలగించుకొన దలచినాడను.

రంగదాసు- (చకితుడై) సెలవిండు.

శ్రీయతీంద్రులు- మరేమియులేదు. ఆనాడు శ్రీవారిసన్నిధిని నీవైఖరికిని, ఈనాటి యుదయమున నీవైఖరికిని, చిత్తైకాగ్రత, కార్యదీక్ష, సమముగ నుండినను, విషయభేదము గానవచ్చుటచేతనే సంశయపడ వలసి వచ్చినది.

రంగదాసు- మహాత్మా! తాము కనిపెట్టినది సత్యేతరమును నంతటి మూర్ఖుడనుగాను ఆపెనాభార్య, పుట్టింటనే గాక యత్తింటగూడ శిరీషకుసుమమువలె సుకుమారముగ పెరిగినది. ఆపెదేహసౌందర్యము, అందును నక్షిసౌందర్యమునున్ను, మంత్రముగ్ధుని వలె జేసివైచినది. మీకడ నిజము జెప్పకతీరదు. బాలార్కుని కిరణములచే, నిదివరకెన్నడును కడప దాటి నొక్కయడుగైన నిడనియాపె నయనార విందములు వాడివన్నెతరుగునేమో యను శంకచేతను, మార్గమధ్యమున పరాగపటల మొక వేళయాపె కన్నులలోబడి బాధపెట్టునేమో యను శంకచేతను ఆవిధముగ లోకనిందను సైతము గమనింపక వర్తించునటులేర్పడినది. హృదయాకాశమున వ్యామోహతోయద మావరించినపుడు వివేక తటిత్పరంపరలు పొడగట్టుచుండినను విశేష కార్యకారి కాజాలవుగదా. నాతాంబు పద్గాశను

లైన మునివరులే యీలాటి మోహజాలమున
తగుల్కొని తారుమారగుచుండ, నావంటి గ్రామ్య
సుఖేచ్ఛారతుఁడు వాల్గంటుల చూపులకు గురియ
గుటలో నాశ్చర్యమేమున్నది "క్షమింపుడు దా
సుని కిది యనివార్యము" అని తలవంచుకొనెను.

శ్రీయతీంద్రులు- ఏది యెటులున్నను, స్వదోషాను సంధాము
ఉన్నదుస్థితుల దెలుపుట, ముక్తిమార్గమున నా
రంభ సోపానముల వంటివి. అవి నీయెడ స్పష్టము
గఁ గానవచ్చుచున్నవి. స్వదోషములను గమ
నింపనివాడుగాని, గమనించియు, గప్పిపుచ్చువాఁడు
గాని ముముక్షు వనిపించుకొనఁడు. అది యటు
లుండనీ, నీయిల్లాలి యక్షిసౌందర్యమునకు మించిన
అక్షి సౌందర్యము నీవు కనినప్పుడు నీవామెయెడ
విముఖుఁడవగుదువేమోయని తలచెదను.

రంగదాసు- ఒకవేళ అట్టి పరిస్థితు లేర్పడునేమోయనియా
మీ యనుమానము? మరొక నేత్రసౌష్ఠవ మెం
ట్లుండునను జిజ్ఞాసదాసునికే నశించినది. మానవుల
లో నిట్టి యక్షిసౌందర్యము గగనకుసుమ న్యాయ
ము.

శ్రీయతీంద్రులు- శ్రీరంగనాథుని సేవాకాలము సమీపించు
చున్నది. విధిలేని కార్యాంతరము లేకున్న నీవును

మా వెంట రావచ్చును.

రంగదాసు- దేవరవారిని సేవించుట, శ్రీ కస్తూరిరంగని సే వించుటవంటిది కాదా.. ఇంతకును, భగవత్సేవకన్న ను, కార్యాంతరమంత ముఖ్యముగాదు. కాని మా దాసురాలిని ఇప్పుడే గొనివచ్చెదను. ఇరువురము దేవరవారి పురుషకార పురస్సరముగ భగవత్సేవ యొనర్చుట సమంజసముగదా?

శ్రీయతీంద్రులు- అది మరియొక పర్యాయము గావచ్చును. ఇప్పటికే కాలాతీతమైనటుల తోచుచున్నది. యను చు శ్రీవారు లేచిరి.

రంగదాసు-భాగ్యము. దేవరవారి చిత్తానుసారమే వర్తింతును.

శ్రీరామానుజయతీంద్రులు రంగదాసుని వెంటగొని శిష్యులతోగూడి కోవెలకు వేంచేసి శ్రీరంగనాథుని ప్రణవ విమానమునకు ప్రదక్షిణమొనర్చి ధ్వజస్థంభ బలిపీఠముల కడ ప్రణమిల్లి లోనికి వేంచేసిరి. శ్రీరంగనాథుని సాయంకాల ఆ రాధన ముగిసిన వెనుక శ్రీవారు స్వీయకమండలోదక మభి మంత్రించి చెంతనున్న రంగదాసు యక్షియుగళముఁ దుడిచి శ్రీరంగనాథుని తిరుముఖమండలము వీక్షింపుమనిఁ బలికిరి. రంగదాసు ఆయత్యద్భుత సౌందర్యముగల దివ్యనేత్ర దృష్టి చే నాకర్షింపబడినవానివలె పులకీకృతగాత్రుడై, దివ్యసుందర నేత్రయుగళము, రంగ, రంగ, రంగాయని ధన్యోస్మి రంగా

యని కేకవైచి మూర్ఛిల్లెను. ఇది గనిన భక్తులందఱు ఆశ్చర్య నిమగ్నమానసులైరి. కోవెలలోనికి వచ్చినవారు ఒకరినొకరు తోసికొనుచూ రంగదాసు చెంత క్రిక్కిరిసియుండిరి ఈ వార్త శ్రీరంగ నగరములోని ఆబాలవృద్ధుల వరకు వ్యాపించెను. భర్తరాకకై యనుక్షణము నిరీక్షించుచుండ, పరుగుపరుగున పొరుగింటిపడుచువచ్చి, హేమాంబా! నీమగడు, శ్రీరంగనాథుని గుడిలో మూర్ఛిల్లిపడియున్నాడు. శీఘ్రముగ రమ్మని తొట్రుపడుచు పలికెను. భర్తరాలేదని వ్యాకులమున నిరీక్షించుచుండు హేమాంబిక కా పిడుగుబోలినవార్త చెవి సోకగనే, గోరుచుట్టుపై రోకటిపోటువలె మనంబును గాసిఁబొనర్చెను. విషాదభయసంభ్రమములు ముప్పిరిగొన నామె యతిత్వరితముగ కోవెలచేరి, అచ్చట మూగియుండు గుంపును తొలగించుకొనిపోయి శ్రీ సంయమీంద్రుల పదాబ్జములకు మ్రొక్కి కన్నీరొలుక మూర్ఛిల్లిన భర్తవంక దైన్యమున చూచుచుండెను. అపుడు శ్రీ యతిరాజులవా రామె దైన్యస్థితిగని "అమ్మా నీభర్త కావంతయు ప్రాణభయము లేదు. బహుమృదుత్వముగల సాత్వికస్వభావుఁడగుటచే శ్రీ రంగనాథునికి నీరాజన మర్పించుతఱి దివ్యనేత్రము లవలోకించి యాసౌందర్యమునకు జిక్కి పరవశుడయ్యెను. ఇక నొకముహూర్తకాలమున మూర్ఛ దేరుకొను సూచనలగపడుచున్నవి. అశ్రుకణము లొలుక హేమాంబిక చేలాంచలముచే తుడుచుకొనుచు, తన

హస్తమున భర్తదేహ మునిమురుచు నతనివంకనే దైన్యమునఁ జూచుచుండెను. కొండొకవడికిం రంగదాసు మూర్ఛదేరి, చెంత నున్న భార్యనుగని, చేసంజ్ఞచే నావలికిబొమ్మని, శ్రీయతీంద్రులతో "స్వామీ దేవరవారి యవ్యాజకటాక్షము, ఈకాంతా లోలునిపై ప్రసరించుటఁ జేసి ధన్యుడనైతిని. "స్థితేరవిందేమకరంద నిర్భరేమధు వ్రతో నేక్షురకం నవీక్షతే" (తామరపువ్వులో నిండియుండు మకరందమును గోరెడు భృంగము (ఎందుకు కొఱగాని) నీరుగొబ్బిపువ్వును కంటనైన జూడనొల్లదుగదా! యను శ్రీయామున శ్రీసూక్తినే డనుభవమునకు దెచ్చి ధన్యుని గావించితిరి, ఇక దేవరవారి నెడబాసియుండనోప. దేవరవారి శిష్యులలో నొకనిగ నెంచి యేలుకొనుడు" అని వేడుచు శ్రీవారి శ్రీపాదాబ్జములపైవ్రాలెను. శ్రీయతీంద్రులును కరుణార్ద్ర హృదయులై "రంగదాసూ లెమ్ము. నీహృదయమును దివ్యనేత్రదృష్టిచే నాకర్షించిన శ్రీరంగనాథుడే సకలహితము లొనగూర్చును. నీవిదివరకు పేర్కొనిన పరమాచార్యుల శ్రీసూక్తులలో "త్వదంఘ్రిముద్దిశ్య" యను శ్లోకములోని భావమును విమర్శించిన శ్రియఃపతి సౌలభ్యము తేటతెల్లముగాగలదు. నిన్నే నమ్మికొనియున్న పరమసాధ్వియగు నీయిల్లాలి కపవర్గ సాధనోపాయముజూప కధోగతిపాలగునటుల యుపేక్షించుట విరక్తియనుట కవకాశము లేదు. భగవన్నివేద నార్హమగునెందు క్షీరపాత్రలో శర్కరచేర్చి నివేదన మొనర్చినటు లుండు

ను మీ రిరువురు శ్రీయఃపతి నాశ్రయించుట” అని యనుగ్రహింపగనే శ్రీ యెంబెరుమానారుల (శ్రీరామానుజుల) శ్రీ సూక్తులలోని ఔచిత్యమును బాగుగ విమర్శించుకొని, యమందానంద మానసుడై “దేవర వారి యాజ్ఞానుసారము వర్తించుటకు సంసిద్ధుడనని” యంజలి బద్ధుడై పలికెను. వాడి వన్నె తరిగిన హేమాంబికవదనారవిందము భర్త తుది వాక్యామృతముచే వికసించెను.

పదునారవ గుచ్ఛము సమాప్తము.



శ్రీమతేరామానుజాయనమః.



# శ్రీ రామానుజ ప్రభావకల్పకము.

## ఉత్తరభాగము. - తొమ్మిదవగుచ్ఛము.

### రంగదాసు శ్రీ యెంబెరుమానారుల నాశ్రయించుట.

రంగదాసును, హేమాంబయు శ్రీ యెంబెరుమానారుల యనుజ్ఞవడసి, స్వగృహముఁజేరుకొనిరి. ఆనాటినుండి వారిరువురికి గురుభక్తి శీఘ్రముగ వృద్ధియగుచుండెను. ఒకనాడుదయము రంగదాసు తనభార్యతోఁగూడ శ్రీ యెంబెరుమానారుల పరిణామము లర్పించి, దర్శించి యంజలిబద్ధుఁడై దాసునికి పంచసంస్కార మనుగ్రహించి దేవరవారి శిష్యబృందములో నొకనిగచేర్చి యేలుకొమ్మని, శ్రీవారిని ప్రార్థించెను. శ్రీ యెంబెరుమానారులు రేపే సుముహూర్తమున్నది. ఉదయముననే స్నానాది నిత్యకృత్యములు నెరవేర్చుకొని మీరిరువురు పూజాపరికరములతో రండని, యాదంపతుల నాశీర్వదించి పంపి శ్రీరంగనాథుని సేవింప వేంచేసిరి. మరుదినముద

యమున శ్రీ యెంబెరుమానారుల యాజ్ఞమేరకు రంగదాసును, హేమాంబయు, పంచసంస్కారమునకు వలయు పరికరములతో మఠమునకువచ్చి శ్రీవారిసన్నిధి నిరువురును ప్రణామము లర్పించి యంజలిబద్ధులై నిలిచిరి. శ్రీ యెంబెరుమానారులు వారిని సాదరభావమున కటాక్షించి ఉచితస్థలమున గూర్చుండ నియోగించి పంచగవ్య మొసంగి శాస్త్రోక్త పంచ సంస్కార సంపన్నులగావించి, ఉచితరీతి హితబోధ గావించి, శ్రీపాదతీర్థ ప్రసాదములను గ్రహించిరి. శ్రీరంగదాసు, శ్రీవారిని తృప్తికరముగ పూజించి యనుజ్ఞవడసి స్వగృహము చేరుకొని గురుమంత్ర వైభవభక్తులు నానాటికి వృద్ధిచేసుకొను చుండెను. భగవత్కైంకర్యమున విశ్రాంతి చిక్కినపుడంతయు స్వాచార్యసన్నిధికి భార్యతోగూడ వచ్చి, స్వరూపగ్రంథములలోని యమూల్యాంశముల దెలిసికొని, ఆనందముగ కాలము గడపుచుండెను. భాగవతులకు వీరియనువర్తన మత్యంతానందదాయకముగ నుండెను.

శ్రీ యెంబెరుమానారుల నాశ్రయించినది మొదలు, శ్రీ రంగదాసు సతీసమేతుడై, శ్రీకావేరినుండి, యుదయమున భగవదాజ్ఞావిధులు నెరవేర్చుకొని వేంచేయుచుండు, తమ యాచార్యుల దర్శనమునకై మార్గమధ్యమున కాచుకొని యుండుటయు, శ్రీవారి దర్శనముకాగానే ఆదంపతులు శ్రీవారి శ్రీపదాబ్జములపై వ్రాలి దండము సమర్పించుటయు,

వారు వారి రువురి శిరముపై శ్రీ హస్తముంచి లేపి, యాశీర్వ దించుటయు, శ్రీ రంగదాసు భార్యను యింటికనిపి మఠము వరకు తమ యాచార్యుల వెంట నరుగునపుడు శ్రీ వారతని కరంబు బట్టుకొనియే మఠమున కరుగుటయు, వాడుకగా జరుగు చుండినది. స్నానానంతరము, అబ్రాహ్మణ సంస్పర్శ యత్యంత గర్హితముగదా యని బ్రాహ్మణ శిష్యులలో కొందఱు గుస గుసలాడుకొనజొచ్చిరి. వీరిలో కొందఱకు రాను రాను తమ యాచార్యవిషయమై విప్రతిపత్తి అంకురించుచుండినది. మఱి కొందఱ కది ముదిరి ఫలవంతమై మనంబు దుర్వాసనా దూ షితమయ్యెను. అందుచే చాటుచాటున ఆచార్య నింద కుపక్ర మించిరి. ఈవార్త యాచార్యులవారి కాప్తవర్గముగుండా తె లియవచ్చెను. శ్రీ కూరేశకురుకేశాది భాగవతోత్తములు కొందఱు ఇట్టి యతినింద యత్యంత గర్హితము. అందును స్వా చార్యనింద, అసహ్యాపచారముగ పరిగణింపబడి కేవల భగవ న్నిగ్రహమునకే కారణమగుననియు, ధర్మసూక్ష్మములు, రజోగుణతమోగుణమలినాంతఃకరణులగు మీకు సులభము గా గ్రాహ్యముగాదనియు, కాలక్రమముగ నన్నియు దెలియ వచ్చుననియు యథాశక్తి వారికి హితబోధయొనర్చుచున్నను, వారి స్వభావ మణుమాత్రమైనను మారలేదు. శ్రీ యెంబెరు మానారులును, తమ పద్ధతిని వీరినిందకు వెఱచి యణుమాత్ర మైనను మార్చుకొనలేదు. పరాత్పరుడగు శ్రీయఃపతికిని, తదీ

యులగు పరమభాగవతులకును, పరదుఃఖాసహిష్ణుత్వమును పరనిందా పరాఙ్ముఖత్వమును, స్వభావసిద్ధములగుటచే స్వ రూప ప్రకాశకరములు. భాగవతాభాసులకు, భాగవతనింద స్వభావసిద్ధమగుటచే నిసుపచిట్టెములోని మాణిక్యమువలె, ఆత్మస్వరూపము నానాటికి వన్నెతరగుచు తుదకధోగతి కలు గును. ఆవుపొదుగును లేగయు. ఈగయు నాశ్రయించియు, లేగ పాలు త్రాగ, ఈగ రక్తము త్రాగుచుండునుగదా! శ్రీ యొంబెరుమానారులు, తమ్మాశ్రయించిన వారధోగతి పాల గుచుండ జూడనోల్లక జాలిచే వారిని దిద్దుబాటొనర్ప తగు సమయమునకై పరీక్షించుచుండ శ్రియఃపతి శ్రీవారి హృదయ మున నెద్దియో స్ఫురింపజేసెను. తత్క్షణమే తమ శిష్యులలో నాప్తులగువారి నిరువురను బిలిచి వారి చెవిలో నెవ్వియో కొన్ని వాక్యములు రహస్యముగా బలికి పంపిరి వారు మర మున స్వాచార్యులుదక్క మరెవ్వరును లేని రాత్రివేళ ఆచా ర్యనిందకు కంకణబద్ధులైన వారార వేసిన యంగవస్త్రములొక టొకటిలో జేనెడు కత్తిరించి యాపేలికలు యాచార్య సన్నిధి లో భద్రపరచి, యనుజ్ఞవడసి చనిరి. ఆచార్యనిందాపరు లుద యమున ఆర్ద్రవస్త్రధరులై వచ్చి తమ యంగవస్త్రములు కత్తిరింపబడియుండుట గని, నీవుదొంగవు, నీవు దొంగవని నా నావిధముల దూషించుకొనుటేగాక, ముష్టియుద్ధమున కుపక్ర మించుచుండ, కొందఱు భాగవతు లందు గుమిగూడి మఃద

లింపబోవుచుండిరి. శ్రీయెంబెరుమానారులు యిది విని వారి నందఱ బిలిచి కలహకారణ మడిగిరి. ఎవరో భాగవత ద్రోహులు మే మారవేసిన మడివస్త్రములలో కొంత కత్తిరించుకొనిపోయిరి. క్రొత్తవారీపని గావింప నిందెవ్వరును రారు. ఆకారణముచే మేము మాకనుమానమున్న వారితో కలహింపవలసివచ్చినదని బలికిరి. శ్రీవారు వారి కలహముఁ సమయోచితరీతి వారించి, యికవివాదమైనను హెచ్చరికతో నుండిన కాలక్రమమున దొంగతనము బయటబడకపోదని పలికి వారిని శాంతపఱచి పంపిరి. మఱికొన్నిదినములు గడచినపిదప, ఇదివఱకు మడివస్త్రములు కత్తిరించిన నిరుపులు శిష్యులనే బిలిచి మఠమున కాదాయము రానురాను సన్నగిల్లుచున్నది. భాగవతారాధనాది యనివార్యకార్యముల చేవ్యయము పెచ్చుపెరిగి పోవుచున్నది. కావున మీరన్యథా భావించి యపచార పడక, ఈరాత్రి ఒకసాహసకార్యమున కొడిగట్టక తీరదు. అని వారిరువురిచెవిలో కొన్ని రహస్యవాక్యములు చెప్పి పంపిరి. వారు పరమసాత్త్విక స్వభావులు గావున ఇందెద్దియో స్వామున్నలకు దురవగాహమగు ధర్మసూక్ష్మ ముండకపోదని, యాచార్యాజ్ఞ నారాత్రి నిర్వర్తింపబూనిరి. ధనుర్దాసను నామాంతరమున సామాన్యముగ వ్యవహరింపబడుచుండు మన శ్రీరంగదాసు, తన భార్యయు వేరువేరు మంచములపై పండుండి భగవద్భాగవతాచార్య గుణానుభవముచేయుచు, నిశ్చింతతో

నిద్రించువాడుక బహుధైర్యశాలియని అసమాన దేహబలము గలవాడని ప్రఖ్యాతి గాంచిన శ్రీరంగదాసునింటి వంక నెట్టి బలధైర్యసాహసములు గలవాడైనను తొంగియైన చూడడని యాయన దృఢనమ్మకము. ఆకారణముచే తలుపులుమూసి తాళమువేసి యుండు వాడుక లేదు. తలుపులు నామమాత్రము మూయబడి నిలిచియుండును. తస్కరవేషధారులు అర్ధరాత్రి మున శ్రీరంగదాసుని మంచమువద్ద గాఢనిద్రావశుడై యతడుండుటంగని శ్రీమతి హేమాంబ పరుండియుండిన మంచము వద్దకు వచ్చి నిశ్శబ్దముగ నిలుచుండిరి ఆమె తనచేలాంచలము మోముపై గప్పుకొని యొకప్రక్క నొత్తిగిలి పరుండియుండెను. శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహము లోలోన నాపాద మస్తకము శ్రీపాణి యోగీంద్రుని పగిది ననుసంధించుకొనుచు కన్నులు మూసుకొనియుండెను. చోరవేషధారుల యడుగుల చప్పుడు విని యించుక కనువిచ్చిచూచి, వచ్చినవారు తస్కర వేషధారులగు భాగవతులని గ్రహించి, వారికార్యము నాటంకపఱుపకుండెను. వారు శ్రీరంగదాసువలె నామెయు గాఢ నిద్రకు లోనైయుండునను భ్రమచే నొకచేతి బంగారు గజ్జల వంకియు, బంగారుగాజులును, ఒకచెవి రవలకమ్మయు తీసుకొనిరి. కాలినూపురము నంటబోవు సమయమున మాత్ర మించుక కదలినది వచ్చినవారు తానిదివరకు మఠమున జూచి యుండిన భాగవతులనియు, దారిద్ర్యము పీడింప నీసాహస

కార్యము బూనివచ్చియుందురనియు వారు తనసమీపమువద్దకు
వచ్చి నిలువగనే గ్రహించియు, వారికార్యమున కణుమాత్ర
మైన భంగము గావింపనొల్లక మిన్నకుండియు, పరమభాగవ
తుల పాదములంటు నిచ్చుట పాతకమని స్ఫురించుటచే నపచా
రమునకు వెఱచి యటుల కదలెను. ఆమె కదలుటచే మేల్కొన
నని చికితులై వారచ్చోటు వాసిచని లభించిన యాభరణములం
శ్రీవారి కొప్పజెప్పి జరిగిన విషయమంతయు విజ్ఞాపనచేసి,
యనుజ్ఞవడసి చనిరి. శ్రీమతి హేమాంబిక రాత్రి జరిగిన
సంగతులన్నియు భర్తకడ విన్నవించుకొనెను. శ్రీరంగదాసు
ఆమె చెప్పిన మాటలన్నియు సావధానముగ విని, లేచిపోయి
నిత్యకృత్యములు నెరవేర్చుకొని తమ యాచార్య సన్నిధి కరి
గెను. ఇట్టి వైఖరి గమనించుచుండిన శ్రీమతి హేమాంబ,
భర్త తన్ను హెచ్చరించక యే యానాడు మఠమున కరుగుటచే
భయమున మిక్కిలి వ్యాకులపడుచుండెను. ఇంతలో నేమి
తలంచుకొనెనోగాని శ్రీరంగదాసు తిరిగియింటికివచ్చి, "నీవీనా
డు నా వెంట నాచార్యసన్నిధికి రావలెను. శీఘ్రముగ పయనము
గమ్మ"ని తీవ్రపఱచెను. ఆమె సంశయగ్రస్తచిత్తయై తీవ్ర
ముగ గృహకృత్యములు ముగించుకొని భర్తవెంట నరిగెను.
శ్రీ యెంబెరుమానారుకు శ్రీకావేరినుండి మఠమునకు వేంచే
యునపుడానాడు శ్రీరంగదాసు యగపడలేదు. వారు మఠము
నకు వేంచేసిన ముహూర్తకాలము లోపలనే శ్రీరంగదాసు,

భార్యను వెంటబెట్టుకొనివచ్చెను. స్వాములందఱు శ్రీ యతీంద్రుల సన్నిధిలో స్తోత్రరత్నము కాలక్షేపముఁజేయుచుండిరి. అందులోని "నదేహం, నప్రాణం, నచసుఖమశేషాభిలషితం" అను వాక్యము లతనిచెవినిబడెను. ఈవాక్యములు యాదృచ్ఛికముగ విన నవకాశమేర్పడిన శ్రీరంగదాసు హృత్క్షేత్రమున, యానాడుదయమున నాటబడిన భావబీజముల కీవినికిడి దోహదమయ్యెను.

ఆదంపతులు శ్రీయతీంద్రులసన్నిధిని దండమునసమర్పించి యంజలిబద్ధులై నిలుచుండిరికాని వారిమోమున మునుపటి వికాస మగుపడలేదు. మీపరిస్థితులు తారుమారైనట్టుల మీముఖభావములేఁ దెల్పుచున్నవి. ఇందుకు కారణ మేమని శ్రీవారడిగిరి. అపుడు శ్రీరంగదాసు "స్వామీ! మీ దాసురాలు నిన్నటిరేయి గొప్ప భాగవతాపచారము గావించినది. ఇట్టి యపచారము గావించిన దాసిపొత్తు చిత్తవైకల్యమునకే కారణము. స్వరూపహానికరము. కావున యీదాసు డీనాటి నుండి ఏకాకియై, చీకాకులేక వర్తింప నిశ్చయించుకొనినాడు. ఈపె మీదాసిగావున మీయిచ్ఛవచ్చినరీతి మీసొత్తును మీరు వినియోగపఱచుకొనవచ్చును. క్రియవిక్రియార్హదాసులుగ నుండుటే శ్రీవైష్ణవ స్వరూపమని తామెన్ని పర్యాయములో యనుగ్రహించియే యున్నారుగదా!" అని విన్నవించుకొనెను. అపుడు శ్రీ యెంబెరుమానారులు శ్రీమతి హేమాంబతో

"అమ్మా! నీభర్తకు నీయెడ యిట్టి తీవ్రవైముఖ్యము కలుగు నంతటి యపచారమేమి తటస్థించినదో తెలుపు"మని యడిగిరి. అపుడామె సంతతధారగా గారుచుండు కన్నీరు చేలాంచలము చే దుడుచుకొనుచు, పెదవులు తడబడ గద్గదకంఠయై "స్వామీ! దాసి యపచారమేదో యింకను స్ఫురింపకున్నది. నిన్న రాత్రి మంచముపై నొకప్రక్క నొత్తిగిలి పరుండియుంటిని. వీరు నాసమీపముననే వేరొకమంచమున పరుండి నిద్రించుచుండిరి. అర్ధరాత్రివేళ నిరువురు భాగవతులు మీదాసుని గుడిసెలో బ్రవేశించి మీదాసురాలి మేనిపైనుండు నొక బంగారు గజ్జెల [illegible] తమ్మియు తీసికొని, నూపురమునుగొన నుద్యుక్తులై కాలినంట బోవ, భాగవతాపచారమునకు వెఱచి, కర్తవ్యమూహింప జాలక నించుక కదలితిని. రెండవవైపు నాభరణములు సైతము ధైర్యముగగొని దాసురాలిని ధన్యురాలుగ చేయుదురు గదా! యని యనుకొంటినిగాని, వారు దాసి మేలుకొనెనని మరుక్షణమే మరుగైరి. విఫలమనోరథులై వారరుగవలసివచ్చి నందుకు దాసి యెంతయో వ్యాకులపడుచుండ భల్లున తెల్లవారినది. జరిగిన సంగతులన్నియు వీరికడ విజ్ఞాపనంబొనర్చితిని. కాని వారు మరుమాటాడక దాసిని మీసన్నిధానమునకు రా తీవ్రపఱుప భాగ్యమని బయలుదేఱివచ్చితిని" అని దైన్యమున విన్నవించుకొనెను. అపుడు శ్రీ యెంబెరుమానారులు "రంగ

దాసూ యామె పరివర్తనమున నేలోపము నీవు గ్రహించితివి" అని యడిగిరి. అపుడు శ్రీ రంగదాసు "స్వామి! ఆత్మ, ఆత్మీయములు శ్రియఃపతికి శేషమనినపుడు ఆ శేషత్వము తదీయ పర్యంతము యనువర్తించునుగదా! శేషత్వ స్వరూపము వంటిదేగదా, పారతంత్ర్య స్వరూపము? అచిద్వత్ పారతంత్ర్యముగదా, ఆత్మకుండతగినది. పారతంత్ర్యములేని శేషత్వము ఆభరణముగా మారి యుపయోగపడని బంగారు వంటిదేగదా? ఇట్టి యమూల్యమగు శ్రీసూక్తులు దేవర వారినుండి యెన్ని పర్యాయములో వినియు, భాగవతులు భయమున పారిపోవలసివచ్చునంతటి యపచారము గావింపగూడదుగదా. రెండవవైపు యాభరణములు వారికి గావలసియుండిన తన్ను రెండవపర్యాయము పారలించి యాభరణములను గొనిపోవు స్వాతంత్ర్యము వారికున్నదిగదా? తానై రెండవపక్క కొత్తిగిలుట అచిద్వత్ పారతంత్ర్యమునకు హానికదా. ఈదుస్స్వాతంత్ర్యమే భాగవతులు విఫలమనోరథులై పోవలసి వచ్చినందుకు కారణమని దాసుని యభిప్రాయము" అని పలికెను.

శ్రీ యెంబెరుమానారులు భాగవతులు యందెల కొఱకు కాలుదాకవచ్చినప్పుడు, సాత్త్వికహృదయులు స్వరూప హానికి వెఱచి చలించుట స్వాభావికమే. వెఱపు విమర్శజ్ఞానమున కవకాశమిచ్చునని తలంతువా? యీామె విధిలేక కదలవలసి వచ్చినందున వారును విఫలమనోరథులై పోవలసివచ్చినది.

ఇదిగాక ఈమె నిద్రించినదని భ్రమించిగదా హారాభరణ ములు గ్రహింపజొచ్చిరి. అట్టివారు మేల్కొని యుండిన వారిని తమ స్వాతంత్ర్యస్థాపనకై పారలించి, సొత్తులు గొనిపోవ సా హసింతురా? అట్టి సాహసమే వారికుండిన నిద్రాసమయమున రా నేల? ఇంతమాత్రము మానవ స్వభావము గ్రహింప జా లక యపచారమంటగట్టి యాకస్మికముగ వదలుకొనబూనుట మాత్ర మపచార మేలకాదు?" యనగనే శ్రీరంగదాసు మో మించుక పైకెత్తి యోచించి శ్రీ యతీంద్రులతో "ఈలాటి ధర్మసూక్ష్మములు నావంటి యజ్ఞులకు దెలియవప్పు డెన్ని యో పొరపాట్లు కల్గును. దేవర వారివంటి యుదారహృదయులు దా సుల తప్పులదిద్ది యేలుకొందురు. మీదాసిని మీకొప్పగించి తిని. సంసారమున నీలాటి చిక్కులెన్నియో కల్గుచునేయుండు ను. ధర్మసూక్ష్మము గ్రహింపజాలక నిర్నిమిత్తముగ వారికి బాధ గలిగించుటయు నపచారమే. అపచారములకు వెఱచి మీదాసిని మీకొప్పగింప నిశ్చయించుకొంటినికాని వేరు గా దు" అనెను అపుడు శ్రీయతీంద్రులు చిరునగవుతో, "కోరి కోరి నేలపరుండనొల్లక నుత్తమ తల్పమును కష్టపడి తెచ్చు కొని నల్లులకు వెఱచి నేలపరుండమాచుట పాడియా? మంచ మున్నంతవఱకు నల్లులుండకపోవు. లభించిన పరికరములలో, లోపములుగపడిన సవరించుకొనవదగును గాని పరిత్యజించుట తగ దు. కావున పొరబాటుచే నపచారములుగలిగిన భగవద్భాగవ

తాచార్యుల సన్నిధులలో విన్నవించుకొని, యపరాధముల క
చితప్రాయశ్చిత్తము వారు విధించినరీతి జేసికొని, బుద్ధిపూర్వక
యపచారము లంటకుండ అంతఃపురంధ్రీరత్నమువలె భయభక్తు
లతో ప్రపన్నుకు వర్తింపవలసినదని శాస్త్రము దెలుపుచుండు
ను ఆసంగతి యటులుండనీ కాని, "మీసొత్తును మీ కొప్ప
గించితినంటివిగదా, సొత్తుపై మాకు పూర్ణాధికార మొప్ప
గించియేనా?" అనిరి.

శ్రీరంగదాసు- అందులో నింకను సందేహమా? స్వామీ!

శ్రీయతీంద్రులు- అటులైన మాసొత్తును మాకిష్టమైన వారి
కివ్వనచ్చునుగదా?

శ్రీరంగదాసు- దేవరవారికి సొత్తుపై పూర్ణాధికారమున్నపు
డు ఈదాసు నావిషయమునుగురించి యడుగవల
సిన యావశ్యకతయే యగపడలేదే.

రంగదాసు నోటినుండి వెడలిన యీకడపటి వాక్యము
వినినవారిలో కొందఱు స్వాములు "శ్రీయతీంద్రుల యుద్దేశ
మేమోయని యుత్కంఠతోనుండిరి. వారు శ్రీ యతీంద్రుల
వర్తనమున నిదివఱకు తప్పులెంచి యపచారపడినవారేగాని
మఱెవ్వరునుగారు.

అప్పుడు "శ్రీరంగదాసును చెంతకుబిలిచి" నాకిష్టమైన
వాడవు నీవేకావున ఈమెను మరల నీవశమొనర్చియున్నాను.
ఇదియే శ్రీరంగనాథుని సొత్తుగావున భగవత్ప్రసాద బుద్ధ్యా,

వినియోగించుకొనదగియుండును. ఆత్మయాత్రికు సౌకర్యార్థము భగవద్దత్తమగు దేహము నెటుల వినియోగించుకొందుమో యటులనే వినియోగించుకొనదగినది. అని శ్రీ రంగదాసుకు శ్రీ యెంబెరుమానారులు యుచిత రీతి ధర్మసూక్ష్మములు సంగ్రహముగా ననుగ్రహించి యా దంపతుల నాశీర్వదించి పంపిరి. వారును ఆనాటినుండి శ్రీ వారి యనుగ్రహము విరివిగా ప్రసరించుటఁజేసి నెమ్మదిగా కాలము దోఁసిపుచ్చుచుండిరి. తమ్మిదివరకు నిందించుచు, శ్రీరంగదాసును అసూయతో జూచుచుండిన భాగవతాభాసుల గని శ్రీవారు "శ్రీరంగదాసు శ్రీమతి హేమాంబల యనువర్తనము లిప్పటికైనను మీరు గ్రహించియుండకపోరని దలంతును. ఇట్టి పవిత్రహృదయులు, స్వార్థత్యాగశీలురు అబ్రాహ్మణులని, యంటరానివారని నావంటి యతి కిదిమితిమీరిన సాహసకార్యమని, నానా విధముల చాటుచాటున నిందించుచుంటిరిగద్యా. మడివస్త్రములలో జేనెడు పేలికలు కత్తిరించుకొనిపోయిన మాత్రమున శ్రీవైష్ణవ స్వరూపమునకు మిక్కిలి హానికరమగు వాక్యముల నొకరినొకరు నిందించుకొనుచుంటిరే. వంటిమీది యాభరణములన్నియు వలుచుకొని పోవుచుండినను మిన్నకుండిన యా సాధ్వీరత్నమునెడ అచిద్వత్ పారతంత్ర్యము కొఱతపడినదని సందేహించిన యామె భర్తమరెంతటి త్యాగశీలుడో భాగవత పతిపతిగఁవాడో మీకు బోధపడినదా?"

నశూద్రాభగవద్భక్తాః విప్రాః భాగవతస్స్మృతాః సర్వవర్ణేషు తేశూద్రాః యేహ్యభక్తాః జనార్దనే" యనియు; శ్వపచోపి మహీపాల! విష్ణుభక్తోద్విజాధికః। విష్ణుభక్తివిహీనస్తు యతిశ్చ శ్వపచాధమః యనియు "అనాచారాన్, దురాచారాన్, అజ్ఞాతౄన్ హీనజన్మః మద్భక్తాన్ శ్రోత్రియో నిందన్ సద్య శ్చండాలతాంవ్రజేత్" ఇత్యాది భగవద్భాగవత శ్రీసూక్తులెన్నియో కలవుగదా? వాటినన్నింటిని మీరు నిరాకరించి స్వేచ్ఛగా వర్తించుటచే కల్గు మహాదోషములకేమి ప్రాయశ్చిత్తముండునని మీయభిప్రాయము అని స్వరూపశిక్షా రూపక వాక్యములు కొన్ని యనుగ్రహింపగనే ఆస్వాములు చకితులై "మేము అజ్ఞులమై అసూయాగ్రస్తులమై గావించిన యపచారములు క్షమించి రక్షింపుడని యంజలిబద్ధులై పలుకుచూ శ్రీవారికి సాష్టాంగ ప్రణామము లర్పించిరి.

అపుడు శ్రీ యెంబెరుమానారులు దాసుల తప్పులు దండముతో సరియను సామెత ననుసరించి ఇకమీదనైనను మిక్కిలి జాగరూకతతో స్వరూపము గాపాడుకొనుడనియు, వర్ణత్వము, వైష్ణవత్వము దేహముండువఱకు కాపాడుకొనుటే ప్రాజ్ఞలక్షణమనియు బోధించి, సాదరదృష్టిచే కటాక్షించి పంపిరి "క్షమాసారాహిసాధవః"అను నార్యోక్తి యాచార్య శిఖామణియగు శ్రీవారియెడ వర్తించుట సహజమేకదా?

ఒకనాటి మధ్యాహ్నవేళ శ్రీ రామానుజయతీంద్రులు

భిక్షకై నొకభాగవతోత్తముల యింటివద్దకు వేంచేయుచుండిరి. తమవెంట పలువురు భాగవతోత్తములు వచ్చుచుండిరి. ఒక మేడమీదనున్న నారీరత్నము తానుండు యింటికే వారు విచ్చే యుటను గని శీఘ్రముగ మేడదిగివచ్చి ముంగిట శ్రీయతీంద్రుల తో ప్రకడ్డముగ నిలుచుండెను శ్రీయతీంద్రు లామెనుగని "అమ్మా దారినొసంగుమనిరి" అప్పుడామె వినయమున నంజలి జోడించి నమస్కరించి "ఇందరు భాగవతోత్తములు, మీరు భిక్షకై యరుగుచుండునప్పుడు సైతము మీ వెనువెంట రావల యునన్న శ్రీరంగనాథునికన్న మిమ్ముల నెక్కువగ ప్రీతిపత్తి తో ప్రేమించుచుండునటుల దోచుచున్నది. ఇందఱు భాగవ తోత్తముల నాకర్షింపగల శక్తియో, మాయయో, మంత్ర మో మీకడనుండకపోదు"అని నింకను నేమియో జెప్పబోవు చుండ శ్రీయతీంద్రులు చిరునగవుతో "అమ్మాయీ! మాకడ మాయలుమచ్చులు యెవ్వియు లేవుగాని యవిగలవారిని సైత మవలీలగ లోబఱచుకొనదగిన మంత్రమొకటి మాకడనుండుట నిక్కము" అనగనే అట్లైన మహాత్మా! యీదాసి యా మంత్ర మనుగ్రహింపబడదగినదని మీకు తోచిన దయచేసి యనుగ్రహింపుడు. ధన్యురాలగు"నని వినయమున బ్రార్థించె ను. అపుడు శ్రీయతీంద్రులామె చెవిని మంత్రముపదేశించి, యాభాగవతోత్తముల యింట భిక్షగొని వేంచేసిరి. పాప మా లేమ మందమతిచే మంత్రము మఱచి యనుతాపపడుచుండెను.

ఆమె శ్రీరంగనగరవాసిని గాను. పశ్చిమదేశస్థురాలు, అచ్చట క్షామబాధ సహింపనేరక యాదేశమువదలి రావలసి వచ్చెను. భగవదనుగ్రహము విరివిగ ప్రసరించిన వారికి బాధలు ప్రారబ్ధవశమున తటస్థించినను యవి వారికి తుదకు మేలై యొన రించునని యీయావనితారత్నపు పవిత్ర చరిత్రమే చాటుచున్నది. కొంతకాలము గడవ తమదేశమున క్షామము తొలగినదని దెలియవచ్చెను. స్వదేశమున కరుగుదమని యామెభర్త యామెను తీవ్రపఱచెను. దివ్యస్థలవాస మలవడిన సాధుసత్తము లకు స్వదేశవాసముగూడ రుచింపకుండు టాశ్చర్యముగాదు. మీాదు మిక్కిలి నరకతుల్యముగ దోచుట సహజమే. ఇక నా సాధ్వీమణి పరితాపమునకు మేరలేదు భర్త వెంట పోకతీరదు గాని మఱచిన మంత్రము మఱల లభించుటెట్లు. స్వోజ్జీవనో పాయము దెలియక శ్రీ కస్తూరిరంగని ఆత్మ రక్షణము నకై కడుంగడు ప్రార్థించుచుండెను కరుణానిధియగు శ్రీ కస్తూరిరంగ డీసాధ్వి మొఱ యాలకించి గావనెంచె కాబోలు నని యనుకొనునటుల వెనుక వేంచేసిన భాగవతగృహముననే చంద్రచకోర న్యాయమున నిరీక్షించుచుండు నాసాధ్వీమణికి శ్రీ యతిచంద్రులు దర్శనమొసంగిరి. ఆనాడును అగృహమున భిక్షకై కొనవేంచేయుట కేవల దైవప్రేరితము ఆమె యావ రాని యానందమున మేడదిగివచ్చి శ్రీయతీంద్రులకు వందనం బాచరించి "మహాత్మా మందమతిచే మీా రనుగ్రహించిన

మంత్రము మఱచి సంతపించుచుంటిని. ఈ యపచారము క్షమించి మఱల మఱచిన మంత్రము ననుగ్రహింపుడు

మా దేశమున క్షామబాధ తొలగినదని నాభర్త వినుటచే స్వదేశమునకు బోవ త్వరపడుచున్నాడు. భగవద్భాగవతాచార్య సాన్నిధ్యము ప్రారబ్ధకర్మబలమున దూరమైనను మంత్రమును జపించు వేళనైనను మిమ్ములను భాగవతోత్తములను, శ్రీయఃపతిని స్మరించి కొంతతృప్తినొందుచుందును. అని దైన్యమున బలికెను శ్రీయతీంద్రులాసాధ్వీమూర్తిని గని కనికరించి యాపర్యాయము పంచసంస్కార సహితముగ మంత్రరత్నత్రయ ముపదేశించి "ఈమారేమరక నీరత్నత్రయమును హృదయపేటికలో బదిలపరుపుమని హెచ్చరిక చేయుటే గాక తమ శ్రీపాదుక లామె కనుగ్రహింపబోవ వాటిని కైకొన తన కొంగుబట్టి ధన్యోస్మియని సంతసమున స్వీకరించెను. స్వీకరించిన దాది యది తమ కొంగుపసిడియేయని మురియుచుండుట తన ఆనాటినుండి యామె కొంగుపిరాట్టియని విఖ్యాతి గాంచెను. శ్రీ కొంగుపిరాట్టి శ్రీ యతీంద్రుల సన్నిధినంజలి ఘటించి, ఈదాసి పతియాధీన. యెప్పుడీనగరము వదల వలసి యుండునో తెలియదు. మరల యేలినవారిదర్శన మీనగరము విడుచులోపల లభించునో లభింపదో తెలియదు. గావున స్వదేశమున కరుగ నాజ్ఞయొసంగుడని కన్నీరొలుక బలుకుచు ప్రణామమొనర్చెను. శ్రీయతీంద్రులాసాధ్వి నాశీర్వదించి భాగవత బృందముతో స్వమఠమునకు వేంచేసిరి.

పదునేడవ గుచ్ఛము సమాప్తము.

# వైరాగ్య పద్య రత్నావళి.

—o—

భక్తిప్రవాహము నుప్పొంగజేయు మహాపురుషరచిత గ్రంథములనుండి సేకరించబడిన పద్యరత్నములు లిందుగలవు. కొద్ది ప్రతులే మిగిలియున్నవి గాన త్వరపడి తెప్పించుకొనుడు.

శ్రీ రామానుజ ప్రభావకల్పకము

| | | |
|---|---|---|
| పూర్వభాగము | రు. | 4—0— |
| ఉత్తరభాగము మొదటి సంపుటము | " | 2—8— |
| " రెండవ సంపుటము | " | 2—8—0 |
| ధ్యానప్రకరణము ... ... | " | 0—1— |
| స్తుతిప్రకరణము ... ... | " | 0—4 |
| ధ్యానముస్తుతి ఒకేసంపుటమున ... | " | 0—4— |

చిరునామా:—

బుక్కపట్టణం నరసింహాచార్యులు
తాడిపత్రి.